## సంతానం కలిగి, అన్యోన్య దాంపత్య జీవితం ఉండి, విశాలహృదయం కలిగిన 22-35 మధ్య వయసులోని

# మహిళావలంటీర్లు "సరొగేట్ మదర్ "గా

## వ్యవహరించటానికి కావాలి !

పెళ్ళి జరిగి, సంతానం కనగల వయసులో ఉండి, సంతానం కావాలని కోరుకున్నా పిల్లలు పుట్టని దంపతులు జనాభాలో పదిశాతం ఉన్నారు. అన్ని రకాల వైద్య సహాయం అందించినా కూడా వీరిలో కొందరు గర్భం ధరించలేక పోవటమో, ధరించినా నిలుపుకోలేక పోవటమో జరుగుతుంటుంది. అటువంటి వారికి టెస్ట్ ట్యూబ్ బేబి విధానం ద్వారా శరీరం బయట అండాన్ని - వీర్యకణాలనీ కలిపి ప్రయోగశాలలోనే "ఎంబ్రియో" ని రూపొందించడం జరుగుతుంది. అలాంటి సూక్ష్మమైన ఎంబ్రియోని తమ గర్భాశయం లోనికి ప్రవేశపెడితే జరిగే గర్భధారణని నిలుపుకొని, నవమాసాలు మోసి, పుట్టిన సంతానాన్ని అసలు తలిదండ్రులకు అందచేయడాన్ని సరొగేట్ మదర్ హుడ్ (Surrogate Motherhood) అంటాం.



స్వయంగా ఈ ప్రకృతి కార్యాన్ని నిర్వహించుకోలేని దంపతులకు ఆధునిక వైద్యశాస్త్రం అందిస్తున్న సాకర్యమే సరొగేట్ మదర్‌హుడ్. ఇలాంటి పవిత్ర కార్యాన్నీ, పుణ్యకార్యాన్నీ విశాల హృదయంతో అంగీకరించి, బాధ్యతాయుతంగా పని పూర్తి చేసి, బిడ్డని కని అసలు తలిదండ్రులకు అందించటానికి సిద్ధంగా ఉన్న ఉత్తమ స్త్రీలకీ / దంపతులకీ, సహాయం పొందే దంపతులు తమ ఆర్థిక సామర్థ్యాన్ని బట్టి మంచి ప్రతిఫలాన్ని కృతజ్ఞతా పూర్వకంగా అందించడానికి సిద్ధంగా ఉన్నారు. ఇటువంటి ఉన్నతమైన, సంస్కారవంతమైన దానకార్యాన్ని ఆనందంగా అమలు చేద్దామని కోరుకుంటున్నవారు 92463 30020/ 040-6646 7744 నంబరుకు ఫోన్ చేసి సంప్రదించవలసినదిగా కోరుతున్నాం.

**మానవసేవే - మాధవసేవ**

# సిటీ సెంట్రల్ స్కూల్
# సిటీ టాలెంట్ స్కూల్

**కోదాడ,** నల్లగొండ జిల్లా, (ఆం.ప్ర)

ఫోన్: 08683 256994, 92478 83968



రావిళ్ళ శ్రీకావ్య

H.T. No: 0840310

**585 / 600**

**1** State 1st Marks

బి.భావన **200/200**
**Maths & Science**
స్టేట్ టాప్ మార్క్స్

| 550కి పైగా మార్కులు సాధించినవారు | 500కి పైగా మార్కులు సాధించినవారు |
|---|---|
| **11 మంది** | **83** |

పరీక్షకు హాజరైన విద్యార్థులు : 220

| Ist క్లాసు | IInd క్లాసు | IIIrd క్లాసు |
|---|---|---|
| 190 | 22 | 2 |

| Maths 100/100 | Science లో 95 ఆపైన | Maths లో 90కి పైన |
|---|---|---|
| 22 మంది | 30 మంది | 98 మంది |

సబ్జెక్టుల వారిగా అత్యధిక మార్కులు

| Maths | Science | Social | Telugu | Hindi | Eng. |
|---|---|---|---|---|---|
| 100 | 100 | 99 | 97 | 97 | 94 |

- ఆంధ్రప్రదేశ్‌లో మొట్టమొదటి **IIT, MBBS Integrated Foundation** పాఠశాలలు.
- రాష్ట్ర మరియు జాతీయస్థాయిలో **Maths / Science** టాలెంట్ పరీక్షలందు అనేక **ప్రథమ ర్యాంకులతో**పాటు 10 లోపు సగానికి పైగా పొంది **S.S.C. 2007** నందు స్టేట్ **1st** మార్క్సు సాధించిన ఏకైక విద్యాసంస్థ **"సిటీ టాలెంట్ స్కూల్, కోదాడ".**
- **ఫౌండేషన్ తరగతులు 6 నుండి 10 వరకు.**

—మేనేజ్‌మెంట్

Eenadu, Kodad. 98484 16681

నవ్య నవలా వేదిక

# చతుర

సంపుటి : 30 | సంచిక 5
జూన్ 2007 | 353 వ సంచిక

ఈ నెల నవల

బలవంతపు చదువులు
మెడపై కత్తులై వేలాడుతుంటే తప్పించుకోగోరే
విద్యార్థుల ప్రయత్నాలకు ప్రతిరూపం

సరోజా సింధూరి నవల

## పడమటి గది

10వ పేజీలో

బొమ్మలు: పినిశెట్టి



హెల్త్ బిట్స్: ఎం. వెంకటేశ్వరరావు

ముఖచిత్రం: నేహా ఒబెరాయ్

# కాలాతీతం

ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయవేదిక



# బ్లాక్ బ్యూటీ

## (ఒక గుర్రం ఆత్మకథ)

పచ్చని పచ్చిక బయలూ, నీళ్ళ కొలనులో పూచిన తామర మొక్కలూ నా తొలి జ్ఞాపకం. వేసవిలో ఇక్కడే రోజంతా అమ్మతో పరిగెత్తేదాన్ని. చలేసినప్పుడు ఫర్ చెట్ల కింద కట్టిన షెడ్డులో తల దాచుకునేదాన్ని. మా అమ్మ పేరు డచెస్. మా నాన్నా, తాతా గొప్ప వంశానికి చెందిన వాళ్లే. రెండుసార్లు రేసుల్లో న్యూ మార్కెట్ కప్ గెల్చుకున్నారట. మా నానమ్మ చాలా మంచిదనీ, ఆమె లాగే మంచి బుద్ధులు నేర్చుకుని, హుందాగా ఎదగాలనీ చెప్పేది అమ్మ. రెండేళ్ళున్నప్పుడు నాకు తొలిసారిగా వేట అంటే ఏమిటో తెలిసింది. గుర్రాలెక్కిన వేటగాళ్లు జాగిలాలను తీసుకుని కుందేళ్ళ కోసం వచ్చారు. భయపడిన కుందేలు చిటికెలో ఎటో పారిపోయింది. దాన్ని వెంబడించటంలో ఒక గుర్రం కాలుజారి కింద పడి గిలగిలా కొట్టుకుంది. ఎవరో తుపాకీతో గురి చూసి పేల్చారు. అంతే. ఆ తర్వాత గుర్రం కదల్లేదు. ఇది చూసి అమ్మ మనసు కూడా కలత చెందింది. ఆ తర్వాత అటువైపు వెళ్ళాలంటేనే భయమేసింది. నాలుగేళ్ళకు బాగా నునుపు తేలాను. నా నల్లటి చర్మం నిగనిగా మెరిసింది. యజమాని నాకు కళ్లెం వేశాడు. అనుభవించిన వాళ్ళకే తెలుస్తుందా బాధ. పళ్లకూ, నాలికకూ మధ్యన స్టీలు ముక్క పెట్టి రెండు వైపులా తోలు పట్టాలతో బిగిస్తారు. ఆ తర్వాత గిట్టలకు నాడాలు కొట్టారు. క్రమంగా ఆ నరకాన్ని భరించటం కూడా అలవాటైంది. నా యజమాని జోగ్రీన్.

శిక్షణలో ఓ రెండు వారాలు నన్ను రైల్వే లైను పక్కన గొర్రెలతో, ఆవులతో తిప్పారు. మొదటిసారి రైలును చూసి రొద విన్నప్పుడెంత భయమేసిందో! ఆవులు ఇదేం పట్టనట్టుగా గడ్డి మేస్తూనే ఉన్నాయి. ఇంజను నా మీది కొస్తుందనే అనుకున్నాను. క్రమంగా దానికీ అలవాటు పడ్డాను.

నా యజమాని నన్ను ఒకనాడు స్క్వైర్ గార్డన్‌కు అమ్మేశారు. అశ్వశాలలో నా పక్కన బొద్దుగా ఉన్న మరో గుర్రంపిల్ల కనిపించింది. దాని పేరు మెర్రీ లెగ్స్. దాని పక్కన చెస్ట్ నట్ రంగులో మరో గుర్రం ఉంది. అది చాలా కోపిష్టి అనీ దాని పేరు జింజర్ అనీ చెప్పింది మెర్రీ లెగ్స్. పిల్లలను సరిగా పెంచకపోతే చెడ్డ అలవాట్లు వస్తాయి. నాకు కొత్త ఇల్లు నచ్చింది. కోచ్ మాన్ జాన్ మాన్లీ నన్ను పార్కులో బాగా

# అన్నాసెవెల్ (1820-1878)



'ఒక గుర్రం ఆత్మకథ' రాసిన అన్నా జన్మ స్థలం నార్ఫోక్ ప్రాంతంలోని గ్రేట్ యార్మౌత్. సాంప్ర దాయక కుటుంబంలో పుట్టిన అన్నాకు "లోకంలోని జీవులన్నీ సృష్టికర్త ప్రతిరూ పాలే' అని బోధించింది తల్లి. ఆ రోజుల్లో గుర్రాలూ, గుర్రబ్బండ్లే ప్రయాణ సాధనాలు. సంగీతం, చిత్రలే ఖనం, కవిత్వం అన్నాకు ఇష్టమైన కళలు. పద్నాలుగేళ్లప్పుడు, ఆమెకేదో ఎముకల జబ్బు వచ్చింది. ఫలితంగా జీవితాంతం మంచంమీదే గడిపింది. అందువల్ల ఇల్లు వదిలి ఎక్కడికెళ్లాలన్నా గుర్రబ్బండి మీద ఆధారపడక తప్ప లేదు. గుర్రాల ప్రవర్తనను, స్వభావాన్ని అధ్యయనం చేసే ప్రయత్నం ఆమెలో అప్పుడే ప్రారంభమైంది. ఒక్కనాడు ఒక్క దెబ్బ వెయ్యలేదు. కొరడా ఝుళి పించలేదు. ఆమె వాటిని చంటి పిల్ల ల్లాగ ముద్దు చేసేది. గుర్రంమీద అన్నా రాసిన ప్రేమకావ్యం 'బ్లాక్ బ్యూటీ'.

ఆరోగ్యం మరింత దిగజారి, తనింక బతకననుకున్న దశలో 1871లో ఈ నవలా రచన ప్రారంభించింది అన్నా. కాని కథ ముందుకు సాగలేదు. కలం కూడా పట్టుకోలేనంత బలహీనత. తన కథ ముగిసేలోగా ఎలాగైనా ఈ కథను ముగించాలనుకుంది. ఓపికున్నప్పుడల్లా కొన్ని వాక్యాలు తల్లికి డిక్టేట్ చేసింది. అలా తల్లీకూతుళ్ల సమిష్టి కృషిగా 1877 నవంబర్‌లో 'బ్లాక్ బ్యూటీ' తొలిసారిగా వెలుగు చూసింది. ఆ తర్వాత మరో అయిదు నెలలకు అన్నా మరణించింది.

ఏడాది తిరక్కుండానే బ్లాక్ బ్యూటీ పుస్తకం అఖండ విజయం సాధించి లక్షల ప్రతులు అమ్ముడుపోయింది. అనేక ప్రపంచ భాషల్లోకి అనువదితమై అనేకసార్లు సినిమాగా కూడా రూపాం తరం చెందింది. "జంతువుల పట్ల కరుణ చూపించాలి" అన్న సందేశాన్ని బలంగా వినిపించిన నవల బ్లాక్ బ్యూటీ. బ్రిటన్‌లోని రాయల్ సొసైటీ ఫర్ ది ప్రివెన్షన్ ఆఫ్ క్రూయల్టీ టు ఆని మల్స్ వారు ఈ పుస్తకాన్ని జంతు ప్రేమికులందరికీ ప్రత్యేకంగా సిఫార్స్ చేశారు. ఇదో అరుదైన గౌరవం.

– గెయిల్ కార్సన్ లెవైన్

పరిగెత్తించాడు.

యజమాని ఇష్టపడ్డాడని గ్రహిం చాను. స్క్వైర్, అతడి భార్యా నా పేరు గురించి చర్చించుకున్నారు. ఒకరు "ఎబానీ" బాగుంటుందన్నారు. మరొకరు "బ్లాక్ బర్డ్" అని పిలవాలన్నారు. చివరికి బ్లాక్ బ్యూటీగా నిర్ణయించారు.

* * * *

నాకు మైదానాల్లో విహరించాలని ఉండేది. కాని నా యజమాని నన్నెక్కు వసేపు అశ్వశాలలోనే బందీ చేసేవాడు. జింజర్ ప్రవర్తన నచ్చనప్పుడు కోచ్‌మాన్ బాగా కొట్టేవాడు. కాని తన్నులు తప్ప వని తెలిసీ అది అలా ఎందుకు ప్రవర్తి స్తుంది? ఒకనాడు మేం ఒంటరిగా ఉన్న ప్పుడు జింజర్ తన గోడు వెళ్ళబోసు




దరూ క్రూరంగా హింసించారట. తన తల్లిదండ్రులు మంచి సంతతికి చెందిన వాళ్ళు. ఎవరైనా తన మీద స్వారీ చెయ్యటం ఇష్టం లేదు దానికి.

మొదటి యజమాని కొడుక్కేమో తాను మహా గొప్ప అశ్వికుణ్ణనీ, ఎలాంటి గుర్రాన్నైనా ఎక్కగలననీ గర్వం. అతణ్ణి వరుసగా మూడుసార్లు కింద పడేసింది జింజర్. మనుషులు ఇలాంటి అవమానాన్ని భరిస్తారా? ఇంక రోజూ బడితె పూజే. కళ్లెం వేసినప్పుడు నోరంతా గీరుకుపోయి నెత్తురు వచ్చిందట. దెబ్బలకు చర్మం చిట్లి పుళ్లైనాయట. కనీసం వాటికి మందు కూడా రాయలేదు. తిండి పెట్టక వారం రోజులు మాడ్చాడా దుర్మార్గుడు. చివరికి ఒకనాడు ఆ యువకుడి తండ్రి ఒక బకెట్‌లో ఓట్స్ (ధాన్యం, గుర్రపు దాణా) నీళ్ళూ తీసుకుని వచ్చి ఆప్యాయంగా పలకరించాడట.

కొందరు యజమానులు నలుగుర్లో తమ హోదా చూపుకోవటానికి గుర్రాలను ఎంత హింసించటానికైనా వెనుకాడరు. జింజర్‌ను కొన్న ఓ పెద్ద మనిషి, లండన్ గుర్రాల ప్రదర్శనలో దానికి అదనంగా మరో కళ్లెం వేసి మెడ వెనక్కు విరిచి కట్టాడట. నొప్పెట్టదా పాపం. ప్రదర్శన ముగుస్తుందనగా అది ఈ హింస భరించలేక ఒక్కసారి తోలు పట్టా తెంచుకుని పరిగెత్తిందట. అదో అవమానంగా భావించిన యజమాని దాన్ని చంపినంత పని చేశాడు. జింజర్‌ను కొన్న మూడో మనిషి కూడా దాన్ని చీటికీ మాటికీ కొట్టి గాయపరిచేవాడు. ఇన్ని బాధలనుభవించిన జింజర్‌కు మనుషులంతా శత్రువుల్లాగా కనిపించటం సహజమే గదా.

ఒకనాడు నన్ను బండికి కట్టి బస్తీకి తీసికెళ్లాడు నా యజమాని. తిరుగు ప్రయాణంలో చీకటి పడింది. మంచు తుపాను కూడా వచ్చింది. ఒక పెద్ద ఓక్ చెట్టు కూలి రోడ్డుకడ్డం పడింది. బండి వెనక్కు తీసుకుని మరో దారి గుండా వెళ్ళాం. సగం దూరం వచ్చాక, కాలికింద ఏదో బల్ల ఉన్నట్టనిపించింది. దాన్ని బ్రిడ్జి అంటారట. రెండడుగులు వేశానో లేదో అది మా బరువు ఆపలేదని తెలిసింది. సకిలించి వెనక్కు తిరిగాను. తరువాత మరెవరో నడిచినప్పుడది విరిగిందట.

ఆ రాత్రి యజమాని నన్నెంత మెచ్చుకున్నాడో, నా వల్లే తనింకా బతికున్నానని మిత్రులకు చెప్పుకున్నాడు.

ఒకనాడు యజమానీ, ఆయన భార్యా నలభై ఆరు మైళ్ళ దూరంలో ఉన్న మరో ఊరికి వెళ్ళాలనుకున్నారు. నన్నూ, జింజర్‌నూ బండికి కట్టాడు కోచ్‌మాన్ జేమ్స్. ఆ కొత్త ఊళ్లో మమ్మల్నో అశ్వశాలలో విడిచారు. మాతోపాటు మరో నాలుగైదు గుర్రాలు కూడా అక్కడ మేస్తున్నాయి. ఏదో పనిమీద ఒక వృద్ధుడు వచ్చి గడ్డి మోపుల్ని అటూ ఇటూ కెలికి, తలుపు మూసేసి వెళ్లాడు. మరికాసేపటికి పొగ వ్యాపించింది. ఏం జరుగుతున్నదో తెలియలేదు. ఊపిరి పీల్చుకోవటం కష్టమైంది. మా అందరి పరిస్థితీ అలాగే ఉంది. సకిలించాం. గిట్టలతో నేలమీద చప్పుడు చేశాం. మమ్మల్ని గుంజలకు కట్టేశారాయె. మంటలు వ్యాపించాయి. అప్పుడు తలుపు తెరుచుకుంది. జేమ్స్ హడావిడిగా వచ్చి నన్నూ, జింజర్‌నూ



బైటికి లాగాడు. కాని, పాపం అప్పటికే మిగతా గుర్రాలు అగ్నికాహుతైనాయి. కళ్ల ముందే సాటి ప్రాణులు కాలిపోవటం మనసునెంత కలచివేసిందో!

మా యజమానురాలు జబ్బు పడినప్పుడు డాక్టరును తీసుకురావటానికి జాన్ నన్ను వాడుకున్నాడు. ఆయనను మళ్లీ ఇంట్లో వదిలి వచ్చేసరికి నా ఒళ్లు హూనం అయింది. రెండు రోజులు కదల్లేకపోయాను. వెటరినరీ డాక్టర్ మిస్టర్ బాండ్ వచ్చి మందిచ్చాడు.

మంచి యజమానులు కూడా మా విశ్రాంతి గురించి ఆలోచించరు. అనారోగ్యంగా ఉన్నా రోజూ బండి తోలక తప్పలేదు. ఒకనాడు ఇటుక బట్టీల దగ్గర ఒక అత్యంత దయనీయమైన దృశ్యం చూశాను. బండినిండా ఇటుకలున్నాయి. చక్రాలు బురదలో ఇరుక్కుపోయి కదలటంలేదు. యజమాని దానికి కట్టిన రెండు గుర్రాలనూ బాదుతున్నాడు. ఈ మనుషులకింత జ్ఞానం కూడా ఉండదా? మరో పది గుర్రాలను తీసుకొచ్చినా ఆ బండి కదలదు.

జాన్‌కు జాలేసింది. వెళ్ళి ఆ బండి మనిషికి సలహా యివ్వబోయాడు. కాని అతను మరింత పరుషంగా జాన్‌ను తిట్టాడు. బండిని అద్దెకు తీసుకున్న ఇటుకబట్టీ యజమానికి ఫిర్యాదు చేశాడు జాన్. అతడిక్కాస్త కనికరం ఉంది. బండి మనిషి గురించి జడ్జీగారికి చెప్పాడు. అతడిమీద కేసు నడుస్తున్నదనుకుంటాను.

ఏనాడు ఎవరు నాకు యజమాని అవుతారో తెలియదు. నన్నూ, జింజర్‌నూ లార్డ్ డబ్ల్యుకు అమ్మేశారు. నా కొత్త కోచ్‌మాన్ పేరు యార్క్. నన్ను వదులుకున్నందుకు జాన్ కూడా బాధపడ్డాడు. చివరిసారిగా అతడి చేతిని నా ముట్టెతో నిమిరినప్పుడు నాకూ కన్నీళ్లాగలేదు.

నా కొత్త యజమానురాలు హై సొసైటీ లేడీ. పారిపోతాననే భయంతో ఇరవైనాలుగ్గంటలూ నోట్లో బిగుతుగా కళ్లెంవేసి ఉంచారు. నేను భరించాను. కాని జింజర్‌కు కోపం వచ్చింది. మమ్మల్ని బండికి కడుతున్నప్పుడు ఎడమ కాళ్లతో బలంగా తన్ని విదిలించుకుంది. ఇలాంటి స్వభావం ఉన్న గుర్రాలను చూసి మనుషులు భయపడతారు. నాతోపాటు బండి లాగటానికి మాక్స్ అనే కొత్త గుర్రం వచ్చింది.

మరి కొద్ది నెలలకే ఒక మంచి అశ్వికురాలు లేడీ ఆన్ నన్ను తన కోసం ఎంచుకుంది. 'బ్లాక్ ఆస్టర్' అని పేరు పెట్టింది. ఆమె కజిన్ కెప్టెన్ బ్లాంటిక్ తరచూ వచ్చేవాడు. అతడి గుర్రం పేరు 'లిజ్జీ.' అది భయస్తురాలనీ, రోడ్డు మీద మరే గుర్రాన్ని చూసినా బెదిరిపోతుందనీ చెప్పింది జింజర్. ఒకనాడు లేడీ ఆన్‌కు లిజ్జీ మీద స్వారి చెయ్యాలనిపించింది. నా యజమానురాలు క్షేమంగా ఉండాలనే నేను కోరుకున్నాను. కొద్ది దూరం వెళ్లిందో లేదో లిజ్జీ అదుపు తప్పి పరిగెత్తింది. కళ్ళెం లాగినా ఆగలేదు. ప్రమాదం పసిగట్టి బ్లాంటిర్‌తో కలిసి వెంబడించాను.

లిజ్జీకి పిచ్చెక్కింది. మైదానం దాటి, గతుకు రోడ్లపైన దౌడు తీసింది. పూలమొక్కలు, పొదలు, కంచెలు అడ్డం వచ్చినా ఆగలేదు. లేడీ ఆన్ అరుపులు హృదయ విదారకంగా వినిపించాయి. లిజ్జీ గెంతటానికి ప్రయత్నించి గోతిలో పడిపోయింది. దానితోపాటే లేడీ ఆన్ కూడా బ్లాంటిర్ ఆమెను లేపి కూర్చోపెట్టాడు. మరో మనిషిని తీసుకుని డాక్టర్ వద్దకు పరిగెత్తాను. ఈ అశ్వికుడికి మా సంగతి తెలిసినట్టుంది. కళ్లెం లాగలేదు. హింసించని రౌతులంటే మాకెంత ఇష్టమో! రెండు రోజుల తర్వాత లేడీ ఆన్ కోలుకుంది.

రూబెన్ స్మిత్ గురించి రెండు

మాటలు చెప్పాలి. యార్క్ సెలవులో వెళ్లి నప్పుడు అశ్వశాలలో అతడే మా బాగోగులు చూసుకుంటాడు. 'మంచివాడే గాని 'తాగుడు బానిస' అని చెప్పింది మాక్స్. తాగిన మైకంలో, బిగ్గరగా అరుస్తూ, ఒక రాత్రంతా నన్ను పరిగెత్తించాడు. నా కాలి నాడా ఒకటి వదులైంది. మామూలుగా అశ్వికులందరూ ముందరే ఇవన్నీ సరిచూసుకుని ప్రయాణం ప్రారంభిస్తారు. కాని తాగిన మైకంలో అతడికివేమీ గుర్తులేవు. కాలి నొప్పి భరించలేక రోడ్డుమీద పడిపోయాను.

ఎన్ని గంటలు గడిచాయో. జింజర్ మరో ఇద్దరు మనుషుల్ని తీసుకుని వచ్చింది. రూబెన్‌లో కదలిక లేదు. అతణ్ణి లేపటానికి ప్రయత్నించారు. కాని అప్పటికే మరణించాడతడు. ఎముకలు విరిగాయట.

ఆరోగ్యం కుదుటపడిన తర్వాత ఒక 'ఎర్ల్' నన్ను కొనుక్కుని అందరికీ అద్దెకిచ్చి వ్యాపారం చేశాడు. ఇది అధ్వాన్నమైన జీవితం. ఒకనాడు బరువులు మోయాలి. ఒకనాడు బండి లాగాలి. ఒకనాడు గానుగ వద్ద తిరగాలి. జింజర్‌ను, లార్డ్‌జార్జ్ కొనుక్కుని రేసుల్లో పరిగెత్తించాడు.

ఆ తర్వాత నన్ను 'మిస్టర్ బారీ' కొన్నాడు. అతడు మంచివాడే గాని గుర్రాల గురించి అతడికేమీ తెలియదు. అతని అశ్వశాలలో పనిచేసే ఫిల్చర్ నా ఆహారాన్ని దొంగలించేవాడు. తిండి లేకుండా పనిచెయ్యటం సాధ్యమా? రెండు నెలల్లోనే నా ఆరోగ్యం పాడైంది. రహస్యం తెలుసుకున్న బారీ, ఫిల్చర్‌ను జైలుకు పంపించాడు.

ఆ తర్వాత వచ్చినవాడు దుర్మార్గుడు కాదుగాని బద్ధకస్తుడు. ఇటువంటి సేవకులతో గుర్రాలను పోషించడం కష్టమనుకున్న భారీ నన్ను ఒక గుర్రబ్బండి యజమాని జెరెమియా బార్కర్ కమ్మేశాడు.

ఇప్పటిదాకా నాకు దొరికిన యజమానులందర్లోకీ ఇతడే మంచివాడనిపించింది. గుర్రాలనెలా చూసుకోవాలో తెలుసు. ఆయన భార్య, కొడుకు, కూతురు కూడా ముద్దు చేశారు. మొత్తంమీద బార్కర్‌తో కలిసి లండన్ నగరమంతా తిరిగాను. ప్రయాణీకులు ఎక్కువ బాడుగ ఇచ్చి నన్ను (కొట్టి) వేగంగా పరిగెత్తించమన్నా నిరాకరించాడు బార్కర్. ఇక్కడ, నాతోపాటు బండీ లాగిన మరో మంచి గుర్రం పేరు కెప్టెన్.

ఆదివారం సెలవు. మనుషులూ జంతువులు కూడా వారానికోరోజు విశ్రాంతి తీసుకోవాలంటాడు బార్కర్. ఒకనాడు జబ్బుపడిన ఒక వృద్ధురాల్ని ఆస్పత్రికి తీసుకుపోవటానికి మాత్రం బండి కట్టాడాయన. ఆపదలో ఒకరినొకరం ఆదుకోలేకపోతే ఎలా?

ఒకనాడు జింజర్ కనిపించి కంటతడి పెట్టుకుంది. యజమాని హింసను భరించలేకపోతున్నానంది. ఆ తర్వాత అవి మళ్లీ కనిపించలేదు. ఆ తర్వాత ఒకరోజు బండిలో గుర్రం శవాన్ని చూశాను. అదే చెస్ట్‌నట్ రంగు. నుదిటిమీద తెల్లటి చార.

ఆ తర్వాత నా ఆప్తమిత్రుడు కెప్టెన్ మరణం కూడా చూశాను. మేం వీధిలో పరిగెత్తుతున్నప్పుడు తాగిన వాడెవడో వచ్చి తన బండితో మమ్మల్ని ఢీకొట్టాడు. కెప్టెన్‌కు బాగా గాయాలయ్యాయి. కాలు విరిగింది. యజమాని దానికి బాధ నుండి విముక్తి కలిగించే పద్ధతిలో తలకు గురి చూసి తుపాకీ పేల్చాడు. ఇలా చేతులు మారి చివరికి మళ్లీ నా తొలి రోజుల యజమాని జోగ్రీన్ వద్దకు చేరుకున్నాను. అతడు కూడా నన్ను కౌగిలించుకుని ఏడ్చాడు. మళ్లీ పుట్టింటికి చేరిన ఈ సంతోష ఘడియలో నా కథ ముగిస్తాను.

– ఎం.వసంత





బిడ్డ కడుపులో ఉండగానే ఆ బిడ్డ ఏం చదవాలి? ఎట్లా చదవాలి? ఎక్కడ చదవాలి? ఏ ఉద్యోగం చేయాలి? ఎక్కడ ఉండాలి? అనే అంశాలన్నిటినీ కన్నవారు ముందే నిర్ణయిస్తున్న రోజులివి. తమ స్వప్నం సాకారం చేసుకోవడం కోసం పిల్లల ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా బలవంతంగా తమకిష్టమైన కోర్సుల్లో చేర్పిస్తున్నారు చాలామంది తల్లిదండ్రులు. అందుకు ఎంత కష్టమైనా పడుతున్నారు, ఎన్ని లక్షలైనా ఖర్చు పెడుతున్నారు. వారికి తగ్గట్టే కొన్ని కార్పొరేట్ కాలేజీలు జైళ్లను తలపిస్తూ, ర్యాంకుల కోసం పిల్లలపై ఒత్తిడి పెంచుతున్నాయి. విద్యార్థుల మనోభావాలకు విలువే లేదు. ఆ పసిమనసులు ఏం కోరుకుంటున్నాయి? ఇష్టమైన చదువును ఎంపిక చేసుకునే స్వేచ్ఛకోసం అవి ఎలా అలమటిస్తున్నాయో విశ్లేషించిన సరోజా సింధూరి నవల 'పడమటి గది' ఈ నెల 'చతుర' సమర్పణ.



# పడమటి గది

సిటీ అవుట్ స్కర్ట్స్‌కి... పది కిలో మీటర్ల దూరంలో కనుచూపు మేర జన సంచారం కడబడని... అతి ప్రశాంతమైన వాతావరణంలో వుంది సత్యం రెసిడెన్షియల్ జూనియర్ కాలేజీ. అది కేవలం అమ్మాయిల కాలేజి. బైపిసి, ఎమ్‌పిసి గ్రూపులకు మాత్రమే పరిమితం.

దానికి వంద గజాల దూరంలో వుంది హాస్టల్ భవనం. నాలుగంతస్తుల ఆ భవనంలో ఒక్కో అంతస్తుకు ఇరవై చొప్పున ఎనభై గదులున్నాయి. దాదాపు నాలుగు వందల మంది స్టూడెంట్సూ. పది మంది లెక్చరర్లూ... ఒక ప్రిన్సిపల్, ఇద్దరు వార్డెన్లూ... ఇద్దరు కేర్ టేకర్లూ ఉంటున్నారందులో. వాళ్ల కాక ఒక స్టోర్ కీపర్... ముగ్గురు వంటవాళ్ళూ వున్నారు. ఇద్దరు సాయుధులైన వాచ్‌మెన్లు ఎప్పుడూ అప్రమత్తంగా భవనం గేటు ముందు కాపలా కాస్తుంటారు.

రాత్రి ఎనిమిదైంది. స్టడీ అవర్స్ అయిపోయిన స్టూడెంట్స్... భోజనాలు ముగించుకొని కాసేపు కబుర్లతో కాలక్షేపం చేసి... తొమ్మిదింటికల్లా ఎవరి గదుల్లోకి వాళ్లు సర్దుకున్నారు. ఇద్దరు వార్డెన్లూ అలవాటుగా చెకింగ్‌కి బయలుదేరారు. తొమ్మిది తరువాత ఎవరి గది తలుపులూ తెరిచి వుండకూడదనేది అక్కడి రూలు. స్టడీ అవర్స్ దాటాక కూడా ఒకవేళ ఎవరైనా చదువుకోవాలనుకుంటే... రూమ్‌లోనే చదువుకోవాలి. అదీ ఒక్క గంట మాత్రమే. పది తరువాత రూమ్‌లో లైట్ కూడా వుండకూడదు.

మొదటి రెండు అంతస్తుల్లో రౌండ్ పూర్తి చేసుకొని మూడో అంతస్తులోకి అడుగుపెట్టారు వాళ్లు. యాభై అయిదో నంబర్ గదిని దాటాక... వెనక ఎవరో నవ్వుతున్న సవ్వడి విన్పించింది వార్డెన్ శమంతకు.

వెనక్కు తిరిగి చూసింది.

ఎవ్వరూ లేరక్కడ. బహుశా... యాభై అయిదో నంబర్ గదిలోంచి ఆ నవ్వు వినబడిందేమో అనుకుందామె. అయినా సందేహం తీరక... తన కన్నా ముందు నడుస్తున్న మరో వార్డెన్ శివాజీని అడిగింది "ఎవరో నవ్వినట్టుగా వుందికదూ!"

శివాజీ ఆమె భర్తే.

"నువ్వే నవ్వుంటావ్" జోక్ చేశాడతను.

"బి సీరియస్. స్పష్టంగా విన్నాన్నేను."

అతను నాలుగడుగులు వెనక్కు వచ్చి... యాభై అయిదో నంబర్ గదివైపు పరిశీలనగా చూశాడు. "లోపల లైట్ కూడా లేదే... నిద్రపోతున్నారంతా" అన్నాడు.

శమంత అనుమానం తీరనిదాన్లా గది తలుపు మీద మెల్లగా తట్టింది.

"డిస్టర్బ్ చెయ్యకు... పద" అంటున్న వాడల్లా చప్పున ఆగిపోయి "శమంతా... అటు చూడు" అన్నాడు తలుపు వంకే భృకుటి ముడిచి చూస్తూ.

తలుపుమీద అతని చూపులు చిక్కుకున్న ప్రదేశాన్ని ఆసక్తిగా చూసింది శమంత.

తల్ల కిందులుగా రాసి వున్నాయి తెలుగు అక్షరాలు... ఎర్రటి రంగులో

ఈ గదిలో దెయ్యం ఉంది

★ ★ ★

"ఈ గదిలో దెయ్యం ఉంది" కూడబలుక్కున్నట్లు చదివింది. ఒక్కక్షణం వెన్ను ఝల్లుమందామెకు. మరుక్షణం కోపంతో జేవురించిందామె ముఖం.

"ఒక దెయ్యం కాదు... అయిదు దెయ్యాలున్నాయి... లోపల" అంటూనే తలుపు మీద దబదబ బాదేసింది.

"రేపు తేల్చుకుందాం. ఇప్పుడొదిలేయ్" అని భర్త అంటున్నా విన్పించుకోలేదు.

లోపల ఆదమరచి నిద్రపోతున్న అయిదుగురిలో చటుక్కున లేచింది కల్పన



ఒక్కటే.

చదివీ చదివీ అలసిపోయారేమో... అట్లా పడుకున్నారో... లేదో ఇట్లా పట్టేసింది గాఢనిద్ర.

తన పక్క బెడ్‌మీద వున్న సాదియాని కుదిపి లేపింది కల్పన. నిద్ర కళ్ళతో విసుగ్గా చూస్తున్న సాదియాతో "ఎవరో తలుపు కొడుతున్నారు" అంది కల్పన.

"ఇంకెవరు? మన శమంతకమణి అయ్యుంటుంది. నిద్ర పోయామా లేదా అని డౌట్ మహాతల్లికి" అంటూ సాదియా లేచి లైట్ వేసి... కిటికీ తలుపు ఒక రెక్క తెరిచి చూసింది.

ఆ అమ్మాయి వూహించినట్టే... శమంత కనబడింది.

"చెప్పానా! ఆ డెవిలే. తలుపు తెరువ్" అంది సాదియా.

కల్పన తలుపు తెరిచింది "వాట్ మేమ్" అంది. "ఆ ప్రశ్న వెయ్యాల్సింది నేను. ఇదేంటి మేడమ్ ? " అంది కరుగ్గా శమంత తలుపుకేసి చూపిస్తూ...

కల్పనా... సాదియా.. ఒకేసారి ఆ వైపు చూశారు. అక్షరాలు తల కిందులుగా వుండడంతో అది చదవడానికి ఓ నిముషం పట్టింది వాళ్ళకి. చదివాక... ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

"మర్యాదగా చెప్పండి. ఎవర్రాశారీ రాతలు? "

"ప్రామిస్ మేమ్. నాకు తెలీదు" అంది కల్పన. "నా కస్సలు తెలీదు" సాదియా నమ్మకంగా అంది.

"మిగతా వాళ్ళని లేపు" కల్పనతో అన్నాడు శివాజి.

కల్పన తేజస్విని లేపుతుండగానే... లేచేశారు నిత్యా... నిఖిలా..

రెండు నిముషాల్లో అందరికీ విషయం అర్థమైంది. మేం కాదంటే మేం కాదని... ఒట్టు మీద ఒట్టు పెట్టుకున్నారు. ఈ గొడవకి పక్కరూమ్ పిల్లలు కూడా కొందరు లేచేశారు. "వాళ్ళ రూమ్ మీద వాళ్ళెందుకు అలా రాసుకుంటారు. ఇది వేరే వాళ్ళ పనే. రేప్పొద్దుటే వాళ్ళని" చెప్పాడు శివాజి.

"ఎవర్రాశారో తెలుస్తా. రేపీపాటికి టి.సి.తో ఇంట్లో వుంటారు. చివరికి టి.సి.లో కూడా కాండక్ట్ కాలమ్‌లో 'బేడ్' అని రాయించకపోతే... నా పేరు శమంత కాదు"

అందర్నీ ఉద్దేశించి వార్నింగ్ ఇచ్చి... విసవిస నడుచుకుంటూ ముందుకెళ్ళిపోయింది శమంత.

"గోటు బెడ్" చెప్పాడు శివాజీ... గదుల గుమ్మాల్లో నిలబడ్డ అమ్మాయిలకి. అయిదు నిమిషాలకంతా అక్కడ సద్దుమణిగిపోయింది. యాభై అయిదో నంబర్ గదిలోని అమ్మాయిలకి మాత్రం నిద్రపట్టడం లేదు.

"అక్షరాలు ఎర్రగా వున్నాయి కదూ! అది రంగా... రక్తమా? " సాదియా అనుమానం వ్యక్తం చేసింది.

కల్పన గుండె ఝల్లుమంది "అబ్బే... అది రక్తం కాదు. రంగే అయ్యుంటుంది"

అంతవరకూ తీవ్రంగా ఆలోచిస్తున్న నిఖిత అంది. "నాకు ఝాన్సీ మీద అనుమానంగా వుంది. ఇవాళ ఉదయం క్లాసులో నన్ను రెడ్ ఇంక్ వుందా అనడిగింది. నేను పెన్ ఆఫర్ చెయ్యబోతే... అహఁ... బాల్ పెన్ కాదు. ఇంక్ కావాలి అంది"

కల్పన ఉత్సాహంగా అంది "నే చెప్పలా అది రంగే..."

"లీవిట్... నువ్వేం చెప్పకు ఝాన్సీ మీద. దొంగని వాళ్ళనే పట్టనీ" నిత్య అంది. "ఇక లైట్ తియ్యండి తల్లీ... మళ్ళీ వచ్చేస్తుంది, మన డెవిల్" తేజస్విని అంటుండగానే, స్విచ్చాఫ్ చేసింది సాదియా.

అందరూ ముసుగులు తన్నారు గాని... ఎవరికీ నిద్ర పట్టటం లేదు. అందరి మనసుల్లో ఒకటే ప్రశ్న... డోర్ మీద అట్లా

ఎవర్రాసి వుంటారు. 'ఎవర్రాస్తారు? ఎవరో పోకిరీలు' మనసు ఇచ్చే సమాధానం అదే అయినా... మారుమూల ఎక్కడో అనుమానం.

"నిజంగా దయ్యమే రాసిందేమో!"

కల్పన లేచి కూర్చుంది. గది వెనక వైపుగా వున్న కిటికీ తెరిచి వుండటం గమనించింది. అప్రయత్నంగా కిటికీలోంచి బయటకు చూసింది. కేంపస్ అవతల... దట్టంగా వున్న చెట్లు... ఆ చీకట్లో దయ్యాల గుంపుల్లా వున్నాయి. కిటికీ మూయాలని బలంగా అన్పించిందామెకు. బెడ్‌మీంచి దిగి మెల్లగా కిటికీవైపు నడిచింది. కిటికీ రెక్కలు బయటకి వున్నాయి. మూయాలంటే చేతులు బయటకు పెట్టి రెక్కలు ముందుకు లాగాలి. కల్పనకట్లా చెయ్యడానికి ధైర్యం చాల్లేదు. కిటికీ దగ్గరగా వున్నా బెడ్‌మీద పడుకుని వున్న నిత్యని తట్టి లేపింది. నిత్యకు బాగా నిద్ర పట్టినట్టుంది. రెండు మూడుసార్లు తడితేగానీ లేవలేదు.

కల్పన అంది, "నిత్యా ఆ కిటికీ ముయ్యవే"

"ఎందుకూ? గాలి రాదు" నిత్య వద్దన్నట్టుగా చూసింది.

"ప్లీజ్... భయంగా వుంది" కల్పన బతిమాలింది.

"నువ్వు మరీ" విసుక్కుంటూ లేచింది, "ఎవరో రాసిన పిచ్చి రాతలకు ఇంతలా భయపడాలా?" నిత్య ఎటువంటి ఫీలింగ్ లేకుండా చెయ్యి బయటకు పోనిచ్చి కిటికీ రెక్కలు మూసేసి అన్నది "ఇక పడుకోవచ్చు తమరు"

కల్పన నిశ్చింతగా వెళ్ళి పడుకుంది.

చెవుల్లో ఒకటే కీచురాళ్ళ రొద. అది రోజూ వుండేదే అయినా, ఇవాళెందుకో ఆ శబ్దం మెదడంతా ఆక్రమించుకున్నట్టుగా వుంది. విసుగ్గా అట్నుంచి ఇటు తిరిగింది కల్పన.

ఎటు తిరిగినా ఆ శబ్దం దాని పాటికది మెదడ్ని తినేస్తోంది. ఇక లాభం లేదనుకుని రెండు చెవుల్లో వేళ్ళు పెట్టుకోబోతున్న కల్పన ఉలిక్కిపడి ఆ ప్రయత్నం విరమించుకుంది.

ఆ నిశ్శబ్ద నిశీధిని చీల్చుకుంటూ వినబడింది... గుండెలవిసిపోయే ఓ వెర్రికేక.

★ ★ ★

"మా వూర్లో శ్మశానం మీదుగా వెళ్ళే రోడ్డుంది.

## రచయిత్రి పరిచయం



అధ్యాపక వృత్తిలో ఉన్న సరోజా సింధూరి విద్యార్థి దశ నుండే కథలు రాయటం ఆరంభించారు. "జాతర", "గంగమ్మ తల్లి", "చీకటి వర్షం", "భయం... భయం" అనే కథలకు ఆంధ్రభూమి నిర్వహించిన వివిధ కథల పోటీలలో వరసగా ప్రథమ, ద్వితీయ, తృతీయ, కన్సొలేషన్ బహుమతులు లభించాయి . "జాతర" టెలిఫిల్మ్‌గా వచ్చింది. "మరీచిక" అనే కథకు స్వాతి వారపత్రిక నుండి, 'ది పెయింటింగ్' అనే కథకు ఈనాడు ఆదివారం నుండీ బహుమతులు అందుకున్నారు. "మా లక్ష్మి", "శక్తి" , "మున్నీ" "ది సిలికాన్ ఫ్యామిలీ" నవలలు ప్రచురితమయ్యాయి. 2006 సంవత్సరానికి గాను 'ది బెస్ట్ లిటరసీ' అవార్డు, 2006 'లాయర్' వారపత్రిక కథల పోటీలో తన కథ "శతాబ్దాలకావల" కు ముఖ్యమంత్రి అవార్డు ప్రదానం చేయడం ఒక తీపి గుర్తు అంటారామె.


చిరునామా: **సరోజాసింధూరి**
W/o కె.వి.కె మోహన్
ఉస్మాన్‌సాహెబ్‌పేట,
నెల్లూరు - 524 002
ఫోన్: 0861-2302835



అది చాలా డేంజరస్ ప్లేస్. అక్కడ ఒక చెట్టు కింద ఒక స్త్రీ తన బిడ్డను ఎత్తుకుని నిలబడి వుంటుందట. ఆ దార్న ఎవరైనా ఒంటరిగా పోతుంటే చాలు పిలిచి బిడ్డను ఎత్తుకుని ఆడించమని అడుగుతుందట. ఎవరైనా బిడ్డను చేతికి తీసుకున్నారో అంతే సంగతులు. అక్కడికక్కడే నెత్తురు కక్కుకుని చచ్చిపోతార్ట"

తేజస్విని చెప్పింది విని కల్పన అందుకుంది, "మా నానమ్మగారి వూళ్లో అయితే ఒకటేంటి... ఎన్ని దయ్యాలో. ఎక్కడ చింత చెట్టుంటే అక్కడో దయ్యం. అర్ధరాత్రి అవన్నీ కలసి చింతచెట్టు చిటారు కొమ్మల మీద జుట్టు విరబోసుకు నిలబడి పాటలు పాడతాయంట. ఆ టైమ్‌లో ఆ పాట విన్నామో... గుండె ఆగి చావడం ఖాయం"

'ఈ గదిలో దయ్యం వుంది' అన్న వాక్యం ఎవర్రాశారో అంతు బట్టలేదు గానీ... ఆ రాతలకు ఉపయోగించింది ఏ ఇంకో... రంగో కాదని... అది అచ్చమైన మనిషి రక్తమనీ తేల్చేశారంతా.

కేంపస్‌లో చోటు చేసుకున్న మరో చిత్రం.... బిల్డింగ్ వెనక వైపున్న ప్రదేశంలో ఫ్లాషెస్‌లాగా అక్కడక్కడా మంటలు రేగడం. వార్డెన్స్ చెకింగ్ పూర్తయిన ప్రతి అంతస్తులో ఒక్క బల్బును మాత్రం వుంచి కేరిడార్‌లో మిగతా లైట్స్‌ను ఆర్పుకుంటూ నడుస్తున్నారు కేర్‌టేకర్స్ పట్నాయక్, రాజు. చివరి అంతస్తులో కూడా లైట్స్ ఆపేశాక... టెర్రస్‌మీద ఒక్క నిముషం నిలబడి కేంపస్ చుట్టుపక్కలంతా టార్చ్ ఫోకస్ చేసి చూశాడు పట్నాయక్. 'రోజూ అట్లా చూడ్డం అతని డ్యూటీలో భాగం. ఎంతయినా ఆడపిల్లల హాస్టల్ కాబట్టి అతి జాగ్రత్తలు తీసుకొంటోంది మేనేజ్‌మెంట్.'

ఆ ఇద్దరికీ... టెర్రస్ మీద కేటాయించారు ఓ ఒంటి గదిని. గంట గంటకూ షిఫ్ట్ డ్యూటీలో ఇద్దరూ బయటకొచ్చి ఓ రౌండ్ వేసుకుని పోతుంటారు.

అప్పటికే రాజు గదిలోకి వెళ్ళిపోయాడు. పట్నాయక్ యాదాలాపంగా పారాపిట్ వాల్ మీంచి వెనక భాగంవైపు తొంగి చూశాడు.

అంతే! కొయ్యబారిపోయాడు.

గ్రౌండ్‌లో అక్కడక్కడా భగభగమంటున్న మంటలు. ముందు విద్యుత్ షార్ట్ సర్క్యూటేమో అనుకున్నాడు గానీ ఆ మంటలు మండే తీరు మాత్రం చిత్రంగా తోచింది. గుప్పుమని ఇంతెత్తున లేచి... చప్పున చల్లారిపోతున్నాయ్.

తెలుకొండిలా తలెత్తింది ఓ అనుమానం అతని మెదడులో. అనుమానం రావడం... ఒక్కటే గావుకేక పెట్టడం ఏక కాలంలో జరిగిపోయాయి.

అతని కేక... హాస్టల్ మొత్తాన్ని మేల్కొలిపింది. గేట్ దగ్గరున్న వాచ్‌మెన్లిద్దరూ అలర్ట్ అయిపోయారు.

కేరిడార్లంతా చక్... చక్‌మని వెలిగాయి లైట్లు.

"కొ... కొ... కొరివి దయ్యాలు" గడగడ వణికిపోతున్న పట్నాయక్ నోటి వెంట మాటలు సరిగా రావడం లేదు.

కెమిస్ట్రీ లెక్చరర్... శివరామ్ ఒక్కపెట్టున నవ్వాడు. కొందరతనితో శ్రుతి కలిపారు గాని... అందరూ కాదు.

ఇద్దరు వాచ్‌మెన్‌లలో ఒకడైన రామ్ సింగ్ అన్నాడు "మంటల్. నేం కూడా చూశా సాబ్, అవి సీదగా లేవ్. జరా తేడాగా వున్నయ్"

ప్రిన్సిపాల్ అర్జంటుగా కల్పించుకున్నాడు. "సమ్మర్ కదూ! గ్రౌండ్‌లో గడ్డి ఎండిపోయి వుంది. ఎవడో సిగరెట్ బట్ విసిరేసి వుంటాడు. స్టూడెంట్స్! యుకెన్ డిస్పర్స్ టు యువర్ రూమ్స్"

అక్కడ్నించి కదలడం ఇష్టం లేకపోయినా అందరూ ఎవరి గదులకు వాళ్లు

# శతాబ్దాల ఘనచరిత ఆదిలాబాద్ సింగరేణిది
# అద్భుతాల విజయచరిత మంచిర్యాల కృష్ణవేణిది

ఏ స్థాయిలో చూసినా, ఏ కోణంలో విశ్లేషించినా,
ఈ విధమైన ఫలితాలు ఒక్క మంచిర్యాల కృష్ణవేణికే తప్ప వేరెవరికీ సాధ్యం కావు,
గత సంవత్సరం 579/600 ఇప్పుడు **S.S.C. 2007లో 583/600, 582/600**



**K.Saketh Reddy**
**H.T.No. 1122961**
# 583/600



**B.Saishma**
**H.T.No. 1122929**
# 582/600



**B.Purna Laxmi**
**H.T.No. 1122705**
# 574/600

రాష్ట్ర జాతీయ మరియు అంతర్జాతీయ స్థాయి కార్పోరేట్ విద్యా సంస్థలను వెతుక్కుంటూ మరో నగరానికి వెళ్లి ప్రతి సంవత్సరం పిల్లల చదువుకు లక్షలాది రూపాయల వ్యయం చేయవలసిన అవసరం లేకుండా ఆ స్థాయి విద్యను మన మంచిర్యాలలోనే అందించాలనే చిత్తశుద్ధితోనే అత్యున్నత పరిశోధనాత్మక బోధనా ప్రమాణాలతో కూడిన విద్యను కృష్ణవేణి ద్వారా అందించడమే మా ధ్యేయమని సవినయంగా తెలియజేయుచున్నాము.



**KASTURI PADMACHARAN**
**Principal & Director**

**అడ్మిషన్లు జరుగుచున్నవి. హాస్టల్ వసతి కలదు.**

వివరాలకు సంప్రదించండి: సెల్: **9396625757, 08736–320656**

The only school with Medicine & I.I.T. Foundation



# KRISHNAVENI TALENT SCHOOL

(Recognised by Govt. of A.P.)
A place where one forgets about tuitions
**MANCHERIAL**

ఇంగ్లీష్ మీడియం | **VI TO X CLASS** | డే-కమ్-రెసిడెన్షియల్



సర్దుకున్నారు. గదుల తలుపులు మూశారే గాని... నాన్‌స్టాప్‌గా జరుగుతున్నాయి డిస్కషన్స్.

అక్కడ ప్రిన్సిపాల్ ఆఫీసు రూమ్‌లో అత్యవసర సమావేశం ఏర్పాటు చేశాడు.

పదిమంది లెక్చరర్లు... వార్డెన్లు... ఇద్దరు కేర్ టేకర్లు... వాచ్‌మెన్లు.... చివరకు వంటవాళ్ళతో సహా హాజరయ్యారక్కడ. యాభై అయిదో నంబర్ గది తలుపు పైన రాతల మీద, గ్రౌండ్‌లో కనబడ్డ మంటల మీద కాసేపు చర్చలు జరిగాక ప్రిన్సిపాల్ అన్నాడు.

"సత్యం విద్యా సంస్థలు ఎంత ప్రతిష్ఠాత్మకమైనవో మీకందరికీ తెలుసు. ఇక్కడ పని చేయడమే ఒక ప్రిస్టేజ్ ఇష్యూ. జిల్లాల వారీగా విస్తరిస్తున్న మన సంస్థల్ని దెబ్బతీయడానికి శత్రువులెవరైనా పనిగట్టుకుని పుకార్లు పుట్టిస్తున్నారా అనేది ఒక పాయింటైతే... మన బాయ్స్ రెసిడెన్షియల్ కాలేజ్ స్టూడెంట్స్ అమ్మాయిల్ని ఆటపట్టించడానికి ఇదంతా చేస్తున్నారా అనేది రెండో పాయింట్"

గాళ్స్ రెసిడెన్స్‌కి అర కిలోమీటర్ దూరంలో వున్న బాయ్స్ రెసిడెన్స్ మీదకి మళ్ళింది ఒక్కసారిగా అందరి దృష్టి.

కానీ పాసిబిలిటీ కన్పించలేదు. ఎందుకంటే అంత రాత్రివేళ అర కిలోమీటర్ దూరం వచ్చి గాళ్స్ రెసిడెన్స్‌లో అడుగు పెట్టే సాహసం... అవకాశం అక్కడెవరికీ లేవు.

కనీసం...గాళ్స్... బాయ్స్ కాలేజీల కేంపస్‌లు కూడా ఒకటి కావు. వేరే... వేరే. వాళ్ళకీ వీళ్ళకీ సంబంధం ఉండదు. కాబట్టి ఇది ఖచ్చితంగా ప్రొఫెషనల్ జెలసీ కేస్ అయ్యుండాలి.

అందరూ రెండోదే అయ్యుంటుందని తీర్మానించారు.

దేన్నీ వెంటనే ఒప్పుకోవడానికి మనసు అంగీకరించని పట్నాయక్ మాత్రం మౌనంగా నిలబడ్డాడు. అతడి కళ్లు చూసిన దృశ్యం అలాంటిది మరి. రామ్‌సింగ్... రాజుల పరిస్థితీ అట్లాగే వుంది.

"ఏం పట్నాయక్.. బిల్డింగ్ వెనక గ్రౌండ్‌లో ఏం చూశానంటావ్?" అడిగాడు ప్రిన్సిపాల్.



ప్రిన్సిపాల్ అంతరంగం అర్థమైంది పట్నాయక్కి. పుకారు షికారు చెయ్యకూడదు. అదే జరిగితే సత్యం విద్యాసంస్థల ప్రతిష్ఠకు భంగం... జనంలో ఆదరణ తగ్గుతుంది. ఇక్కడ పిల్లలకే కాదు. బయటనుంచి వచ్చే లెక్చరర్లకు కూడా ఈ విషయం తెలీకూడదు.

"ఏం జూళ్ళేదు సార్" చెప్పాడు తెలివిగా.

"మరీ అట్లా అనకు. కళ్ళెదురుగా మంట కనబడితే, నేనేం చూళ్లేదని బుకాయించడం ఓ రకంగా పుకారవడానికే చోటిస్తుంది" ఫిజిక్స్ లెక్చరర్ శివరామ్ అన్నాడు.

"మరేం జెప్పమంటారు?" నిజాయతీగా అడిగాడు.

"నువ్ రాత్రి మంటలు చూసింది నిజమే. కానీ అవి ఏ వాచ్‌మెనో విసిరిన బీడీ ముక్క ఫలితం అన్నమాట. అట్లా చెప్పాలి. నువ్వు మన స్టూడెంట్స్ అందరికీ. ఏం రామ్‌సింగ్ నువ్వు కూడా" అన్నాడు శివరామ్.

"ఎవురో ఏంది సాబ్. నేనే బీడీ ముక్క

విసిరేశా" నవ్వుతూ అన్నాడు రామ్ సింగ్. ప్రిన్సిపాల్ తృప్తిగా నవ్వాడు. ఆనక శివాజీతో "తలుపు మీద రాతల్ని తుడిపించండి. ఈ విషయం ఇంతటితో సమసిపోవాలి. డు యిట్ ఎట్ ఒన్స్" అన్నాడు.

రాజు ఓ బకెట్‌తో నీళ్ళు పట్టుకు నిలబడితే... పట్నాయక్ అందులో ఓ గుడ్డ ముంచి తుడవడం మొదలెట్టాడు.

శమంతా, శివాజీ పర్యవేక్షిస్తున్నారు.

లెక్చరర్స్ కొందరు గదులకు వెళ్ళిపోగా కొందరు మాత్రం రూమ్ నంబర్ ఫిఫ్టీఫైవ్ ఎదురుగా కేరిడార్‌లో నిలబడి హస్కు వెయ్యడం మొదలెట్టారు.

ఈ సందడికి ఆ రూమ్‌లో వాళ్ళే కాదు పక్క గదుల్లోంచి కొందరు స్టూడెంట్స్ బయటకొచ్చారు.

"పట్నాయక్... అది రంగేనా? ..." అడిగింది లోగొంతుకతో కల్పన. తుడుస్తున్న గుడ్డను వాసన చూడమన్నట్టుగా ఆమె ముందుకు చాపాడు. నిత్య వంగి వాసన చూసింది. ఒకలాంటి నీచువాసన... కడుపులో దేవినట్టయింది.

"రక్తంలా వుందే" అంది కల్పన పట్నాయక్‌తో. జువాలజీ లెక్చరర్ షీబాతో మాట్లా







దుతున్న శమంత చటుక్కున ఇటు తిరి గింది. అది గమనించిన పట్నాయక్ "రక్తమా... పాడా... రంగేనమ్మా" అన్నాడు.

అతనికి నిజం చెప్పాలని వున్నా ఎందుకో దాస్తున్నాడని అర్థమైంది నిత్యకి.

శమంత అన్నది అక్కడ చేరిన అమ్మా యిలతో "ఈ పని చేసింది ఒక పోకిరీ. తనెవ్వరో కూడా కనిపెట్టేశాం. యాక్షన్ తీసుకోబోతున్నాం. సో... ఈ చచ్చు విష యాల గురించి ఆలోచించకుండా... వెళ్ళి హాయిగా పడుకోండి"

శమంత ఎంత డైవర్ట్ చేయాలని చూసి నా తలుపు రాతలకు ఉపయోగించింది రంగు కాదనీ రక్తమనీ ప్రచారం అయిపో యింది.

పైపెచ్చు... ఆ రక్తం మనిషిదన్న పుకారు కూడా ఆ వార్తకి జతైపోయింది.

నా కలల కోట గుమ్మంలో ఎవరిదో అడుగుల సవ్వడి. జలతారు పరదాలు తొలగించి తొంగి చూశాను. సంజె కెంజా యరంగు చీర కట్టుకొని... గోరింట పూల పరిమళాల్ని ఒంటినిండా రాసుకుని నిలబడి వుంది. మునిమాపు నాకేసి రారమ్మని చేయి చాపింది. వేలు పట్టుకుని వెంట నడి చాను. గడ్డిపూలు పరచుకున్న బాటల్లో... చల్లని తరువుల నీడల్లో నడిపించుకుంటూ నన్ను తీసుకెళ్ళి రాత్రి దేవత ముందు నిల్చోబెట్టి తను వెళ్ళిపోయింది.

రాత్రి! ఎంత అద్భుతంగా వుంది!

ఆమె సిగపాయల నిండా ధగధగ లాడు తున్నాయ్ నక్షత్రాల పూలు సువిశాలమైన ఆ పాల భాగం మీద... నిశ్శబ్దంగా మెరు స్తోంది చంద్రబింబం.

ఎటుచూసినా వెన్నెల ధారలే. వెండి వెలుగుల పండగలా వుందక్కడ.. నాకైతే... అక్కడే వెన్నెల్లో వెలిగిపోతున్న ఇసుక తిన్నెల మీద...

"నిత్యా ! ఏంటమ్మా.... అంత డీప్‌గా రాస్తున్నావ్" అడిగింది సాదియా స్నానం కానిచ్చివస్తూ.

"కవిత్వం" చెప్పింది నిత్య.

"బాప్‌రే కవిత్వమా!" అంది సాదియా.

"యాఁ... చదువు..." డైరీని సాదియా ముందుకు తోసింది.

"మాకంత టేస్టు లేదుగాని... త్వరగా స్నానం కానివ్వు. కాలేజీకి టైమౌతోంది" చెప్పింది తల దువ్వుకుంటూ.

నిత్య డైరీని కప్‌బోర్డులో పెడుతూ అంది "సొంగ కార్చుకుంటూ దెయ్యాల కథలు వినే వాళ్ళకి కవిత్వం ఎక్కడ వంట పడుతుందిలే..."

"దెయ్యమంటే గుర్తొచ్చింది, అదింకా మనగదిలో వున్నట్టా... పోయినట్టా" తేజ స్విని అడిగింది.

"మన గదిలో... మన ముందు... అంత ధైర్యమా దానికి!" నిత్య స్నానానికి వెళ్ళిపోయింది. ఆ సంఘటన జరిగి అప్ప టికి నాలుగు రోజులైంది. దాదాపుగా అందరూ మర్చిపోయారా విషయం. ప్రిన్సి పాల్ కూడా దాన్నో పోకిరీ చేష్టగా భావించి కరస్పాండెంట్ దాకా విషయం వెళ్ళనివ్వలేదు.

నిత్య స్నానం అయ్యాక అందరూ ఓ అర గంటకల్లా మెస్‌లో టిఫిన్లు ముగించి షార్ట్ టర్మ్ ఎమ్‌సెట్ కోచింగ్ క్లాసెస్‌కని కాలేజీకి వెళ్ళారు. ఇంటర్వెల్‌లో ఝాన్సీ... ఒక్కతే హాస్టల్ బిల్డింగ్ వైపు వెళ్ళడం గమనించిన కల్పన "ఈవిడెందుకో హాస్టల్‌కెళ్తోంది" అంది నిఖితతో.

"ఎవరి అవసరం వాళ్ళది. సరేగానీ నియాన్ అటామిక్ నంబరెంతో చెప్పు గుర్తు రావడం లేదు" అడిగింది నిఖిత.

చెప్పింది కల్పన.

ఇంటర్వెల్ అయిన అయిదు నిముషా లకు హడావుడిగా వచ్చింది ఝాన్సీ.

ఆంధ్ర దేశంలో ప్రతి ఇంటా ఉండదగిన

## పండిత శ్రీ బుట్టే వీరభద్ర దైవజ్ఞ

శ్రీ శ్రీశైల దేవస్థాన ఆస్థాన సిద్ధాంతిగారిచే గుణింపబడి, రచియింపబడిన

**110 సం॥ల భూత భవిష్యద్వర్తమాన**



# శతాబ్ది

# పంచాంగము

**మినీ జ్యోతిష కంప్యూటర్**

## 1941 నుండి 2050 వరకు

**5 నిముషాలలో మీ జాతక చక్రం రెడీ ! మీ జాతక చక్రం మీరేవేసుకోవచ్చు !**

✦110 సం॥లకు ప్రతిరోజు గ్రహచక్రములు ✦ రాబోయే 50 సం॥లకు ప్రతి రాశివార్కి జాతకఫలాలు ✦ ప్రతి సంవత్సరం సంభవించు సూర్య - చంద్ర గ్రహణములు ✦ ప్రతి సంవత్సరం గురు, శుక్ర మౌఢ్యములు ✦ ఇంకనూ ముఖ్య పండుగలు ✦ రాబోయే 2050 వరకు పుష్కరముల తేదీలు

**అన్నిబుక్‌షాపులందు లభించును** **వెల : రూ. 675/-**

☞ మీ సమీపప్రాంతమునందు ఈపుస్తకం లభించనియెడల మమ్మల్ని సంప్రదించండి.

సెల్ : 98481 71785 , 9290099287

జాతక, వాస్తు, ముహూర్త విషయములకు సంప్రదించండి

## పండిత శ్రీ బుట్టే వీరభద్ర దైవజ్ఞ

డో.నెం. 79-2-4/3, తిలక్‌రోడ్, రాజమండ్రి - 3

ఫోన్ : (95883) 2469631



కెమిస్ట్రీ లెక్చరర్‌తో సన్నగా చీవాట్లు వేయించుకుని క్లాస్‌లోకి వచ్చింది.

కెమిస్ట్రీ తరువాత ఫిజిక్స్ క్లాసుంది గానీ... ఆరోజు లెక్చరర్ రాకపోవడంతో క్లాస్ జరగలేదు.

కాసేపు క్లాస్‌లోనే వుండి ప్రాబ్లమ్స్ ఎవరికివారు చేసుకున్నారు. లంచ్ బ్రేక్ స్టార్టయింది. అందరూ హాస్టల్ కెళ్ళి బుక్స్ పెట్టేసి మెస్‌లో కలుసుకున్నారు.

హెడ్‌కుక్ రామచంద్రయ్య అన్నం వడ్డిస్తున్నాడు. అతని సహాయకుడు శీను కూర వడ్డిస్తున్నాడు.

"ఇవాళేం కూరలు శీనూ?" అడిగింది ఝాన్సీ.

"తోటకూర పప్పు, బీన్స్ ఫ్రై..." చెప్పాడు శీను.

"నాకా కూరలేం వద్దుగానీ, పెరుగు వెయ్" అంది.

"పోనీ రసమో... సాంబారో వేసుకోండి" చెప్పాడు శీను.

"వద్దు, కడుపులో బాగాలేదు... పెరుగు చాలు" చెప్పింది.

"రాజమ్మా... పెరుగు" కిచెన్ గుమ్మంలో నిలబడి కేకేసి మళ్ళీ వడ్డించడంలో పడ్డాడు శీను

"అట్ట వడ్డించాడో లేదో ఇంతలోనే పెరుగు. నేను ఖాళీగుంటే చూళ్ళేడు ఎదవ" కిచెన్‌లో నేలమీద కాళ్ళు చాపుకుని కూర్చుని మోకాళ్ళు వత్తుకుంటున్న యాభై ఏళ్ళు పైబడ్డ రాజమ్మ అరచేతులను నేల మీద ఆన్చి, అతికష్టంమీద లేచింది.

నిలబడ్డంతసేపూ అలుపు సొలుపు ఎరక్కుండా ఓపిగ్గా పని చేసుకుంటుందామె. ఒక్కసారి నేలమీద చతికిల బడిందంటే ఇక లేవటం ఆమెవల్ల కాదు.

"రాజమ్మా పెరుగు" మళ్ళీ కేకేశాడు శీను.

రాజమ్మ పెరుగున్న స్టీల్ బకెట్ అందుకోబోతూ ఒక్కపెట్టున అరిచేసింది. అరవడమే కాదు... తన వయసునీ... మోకాళ్ళ నొప్పుల్నీ పూర్తిగా మర్చిపోయి బాణంలా దూసుకొచ్చింది డైనింగ్ హాల్లోకి. స్టూడెంట్స్ భోంచెయ్యడం ఆపేసి ఆశ్చర్యంగా చూశారామె వైపు.

"ఏంది రాజమ్మా... ఏమైంది" అన్నాడు శీను.

రాజమ్మకు నోటమాట రావడం లేదు. ఏదో చెప్పడానికి ప్రయత్నిస్తోంది గాని నోరు పెగలటం లేదు.

"చెప్పు రాజమ్మా.. ఇంతమందిమున్నాం. నీకేం భయంలేదు" తింటున్న అన్నం ఆపేసి ఆమె చుట్టూ చేరిన అమ్మాయిల్ని చూపిస్తూ భరోసా ఇచ్చాడు రామచంద్రయ్య.

"పె... పె... పెరుగులో... పెరుగులో..." ఆమె నోట మాట పూర్తవుతుండగానే ఒక్క అంగలో పెరుగు పాత్ర దగ్గరికి చేరుకున్న శీను.. గుండె ఒక్క క్షణం కొట్టుకోవడం మానేసింది.



రాత్రి పదకొండు దాటింది.

గేటు దగ్గర స్టూల్ మీద కూర్చుని బీడి కాలుస్తున్నాడు వాచ్‌మెన్ రాంసింగ్... అతని కెదురుగా కూర్చుని వున్నాడు మరో వాచ్‌మెన్ నర్సింలు. మామూలుగా అయితే... వంతులవారీగా మేలుకునే ఆ ఇద్దరూ ... ఇవాళ మాత్రం కలసికట్టుగా కాపలా కాస్తున్నారు.

హాస్టల్ మెస్‌లో ఆ రోజు జరిగిన సంఘటన వెన్నులో వణుకు పుట్టిస్తోంది వాళ్ళకి.

గట్టిగా తోడుకున్న పెరుగు ఉపరితలం మీద చిక్కగా పరుచుకున్న రక్తాన్ని అందరితో పాటూ వాళ్ళూ చూశారు.

ఒంటిమీద వెంట్రుకలు నిక్క బొడుచుకునేలా చేసిన ఆ దృశ్యం మనసులోంచి ఎంత చెరుపుకుందామన్నా చెరిగిపోవటం

లేదు.

వేసవి రాత్రులలో సాధారణంగా గాలి వీస్తుంటుంది. ఆరోజెందుకో ఆకు కదలటం లేదు. ఉక్కగా వుంది.

"అది రంగేనంటావా?" ఆరాగా అడిగాడు నర్సింలు.

"చెవిలో పువ్వు పెట్టుకున్న వాళ్ళకి చెప్పమను. అది నిఖార్సయిన ఖూన్. వాళ్ళ ఇది ఖరాబు కాకుండా అట్ల బుకాయిస్తున్నార్" రామ్ సింగ్ నిరసనగా అన్నాడు.

"సరే... వాళ్ళ బాధ వాళ్ళది. పెద్దసారు ఎట్ల జెప్పమంటే అట్టేగా"

పెద్దసారంటే సత్యం విద్యాసంస్థల అధినేత సత్యనారాయణ. మొదటి రెండు రోజుల్లో జరిగిన సంఘటనల్ని ... ముందు కొంచెం గాబరా పడ్డా ఆనక సిల్లీగా తీసుకుని వదిలేసిన ప్రిన్సిపాల్ ఇవాల్టి ఇన్సిడెంట్ ని మాత్రం జీర్ణించుకోలేకపోయాడు. వెంటనే కరస్పాండెంట్ కి సమాచారం అందించాడు. విషయం తెలిసిన గంటలోపే కరెస్పాండెంట్ రావడం... స్టాఫ్‌తో అత్యవసరంగా సమావేశం కావడం జరిగిపోయింది.

మరో సమావేశంలో ఏం మాట్లాడుకున్నారో ఏమోగాని... కరస్పాండెంట్ హాస్టల్ అమ్మాయిలందర్నీ పిలిపించి ... ఆ సంఘటనలన్నింటినీ పోకిరి చేష్టలుగా అభివర్ణించారు. వాళ్ళ ముందే ఆ పెరుగుని డస్ట్‌బిన్‌లో పోయించాడు. "ఆ పోకిరిని పట్టుకునేందుకు తక్షణ చర్యలు తీసుకుంటాం. మీరు కూడా సహకరించాలి"అని వాళ్ళని కోరాడు. ఆ పోకిరిని గుర్తించినవారికి రెండువేల రూపాయల కేష్ ప్రైజ్ కూడా ప్రకటించాడు.

అక్కడే కొట్టాడు దెబ్బ కరెక్టుగా వారి సైకాలజీ మీద.

అంతవరకూ ఏవేవో అపోహలతో గుబగుబలాడుతున్న వాళ్ళ గుండెల్లో ఆశ తళుక్కుమంది. అసలు విషయం మెదడులోంచి మాయమై కేష్ ప్రైజ్ దాన్ని ఆక్రమించుకుంది.

ఎలాగైనా ఆ పోకిరిని పట్టాలి అన్న ఉత్సాహం వారిలోని భయాన్ని అధిగమించేలా చేసింది.

కానీ... వంటవాళ్ళూ వాచ్‌మెన్లూ... కేర్‌టేకర్లూ మాత్రం ఆ సంఘటనల్ని అతీతశక్తుల పనే అని నమ్మటానికి మాత్రమే ఇష్టపడుతున్నారు.

"ఎప్పుడైనా నువ్వు సైతాన్ని చూశావా నర్సింలూ?" ఉన్నట్లుండి అడిగాడు రాంసింగ్.

నర్సింలు తన తల వెంట్రుకల్ని చూపుడు వేలితో చూపిస్తూ "ఇన్నిసార్లు చూశా సింగూ" అన్నాడు గొప్పగా.

"నేను ఏక్‌బార్ చూశా" రామ్‌సింగ్ సాలోచనగా అన్నాడు. నర్సింలు చెప్పమని అడక్కుండానే మొదలుపెట్టాడు రామ్‌సింగ్. "పదిహేనేళ్ళ కిందటి మాట. గుంటూరు బ్రాడీపేటలో ఒక షావుకారుకాడ పన్జేసే వాణ్ణి. మా ఇల్లు కొరిటిపాట్లో. కొత్తగా పెళ్ళయింది నాకు. నా పనేమో నైట్ వాచ్‌మెన్. నా భార్య మనసు బాగా కష్టపెట్టుకునేది. పైసా కోసం పన్జెయ్యక తప్పదు. రాత్రుళ్ళు గేటు ముందు వుండే వాణ్ణేగాని దిల్ మాత్రం ఇంటికాణ్ణే వుండేది. ఓ రోజు

**"ఎప్పుడైనా నువ్వు సైతాన్ని చూశావా నర్సింలూ?" ఉన్నట్లుండి అడిగాడు రాంసింగ్. నర్సింలు తన తల వెంట్రుకల్ని చూపుడు వేలితో చూపిస్తూ "ఇన్ని సార్లు చూశా సింగూ" అన్నాడు గొప్పగా. "నేను ఏక్‌బార్ చూశా" రామ్‌సింగ్ సాలోచనగా అన్నాడు.**





నా బీబీ గురించి తల్చుకుంటూ గేటు ముందు స్టూల్ మీద కూర్చొనున్నా. జరా నిద్ర పట్టేసింది. ఎవర్దో హాత్ మీద పడింది. నీంద్ ఎగిరిపోయింది. సామ్‌నే నిలబడి వుంది నా బీబీ. చానా ఖుషీ అయిందిగాని, ఆమె అట్లా అంత చీకట్లో ఎట్లా వచ్చిందో నాకు సమఝ్ కాలేదు. అదే అడిగాను. జవాబ్ ఇయ్యలేదు. తియ్యంగా నవ్వేసింది. నా నరాలు జివ్వు మన్నాయి. దగ్గరకురమ్మని సైగల్ చేసింది. డ్యూటీ గుర్తొచ్చినా ఆగలేకపోయా. దగ్గరగా వెళ్ళా. తెల్లటి చుడీదార్ వేసుకొని గాలికి వదిలేసి వుంది జుట్టు. పల్చటి లాల్ దుప ట్టాలోంచి నా బీబీ ఒంటిమీద వెండినగలు వెన్నెల్లో చమక్ మంటున్నాయ్. రెండు చేతులూ చాపి... మత్తుగా నవ్వింది. ఇంకేం... సోచాయించ లేదు. అట్లాగే వెళ్ళి కౌగలించుకున్నా.

ఒక్క క్షణం నాకేం అర్థం కాలేదు. ఆమె చేతులు నా చుట్టూ బిగుసుకున్నాయి. ఎట్లా అంటే... ఇనపగొలుసుల్లాగా. ఊపిరి ఆడ్డం లేదు. అసలు నాకేం అవుతోందో నాకు సమఝ్ కావడంతో... ఏక్‌దమ్ విరు చుకొని పడిపోయా.

ఆ తెల్లవారి తెలిసింది ఆ రాత్రి నా బీబీ అసలు గడపైనా దాటలేదని. నెత్తురు కక్కు కుని గేటుముందు పడిపోయివున్న నన్ను షావుకారే దవాఖాన్ల చేర్పించాడు. నువ్ నమ్మూ నమ్మకపో నర్సింలూ, ఏక్ మైనే తక్ దవాఖానాలో పడివున్నా. ఇంకంతే, ఆడ పనికి గుడ్‌బై చెప్పేశా"

నర్శింలు, రామ్‌సింగ్ చెప్పిందంతా శ్రద్ధగా విన్నాక ఓసారి చుట్టూ చూశాడు. ఛోటా జంగిల్‌ని తలపిస్తున్న కేంపస్ పరి సరాలు చిక్కటి నిశ్శబ్దంలో బావురుమంటు న్నాయి. ఎందుకోగాని దెయ్యాల గోల అంతటితో ఆపెయ్యాలనిపించిందతనికి.

"పెద్ద సారు... ఈసారి జీతాలు పెంచు తాడా? " అన్నాడు టాపిక్ మారుస్తూ.

"ఆc... పెంచినా ఏముందిలే... వందో... రెండొందలో. వాళ్ళు మాత్రం కరోడ్‌పతులు కావాల. మనమిట్టాగే గరీబ్ బతుకు బతకాల" రామ్‌సింగ్ నిట్టూర్చాడు.

నర్శింలుకి... ఒంటికి వెళ్ళాలనిపించింది. రాంసింగ్‌కి చెప్పి పొదల చాటుకు వెళ్లాడు. పది నిమిషాలు గడిచాయి. నర్శింలు వెళ్ళిన పొదలవైపు ఓసారి యాదా లాపంగా చూశాడు రామ్‌సింగ్.

అతను వస్తున్న జాడ కనబడలేదు.

మరో పది నిముషాలు గడిచిపోయాక రామ్‌సింగ్ ఆలోచనలో పడ్డాడు. టార్చ్ ఫోకస్ చేసి చూశాడు నర్శింలు వెళ్ళిన వైపు. ఏ కదలికా లేదు.

ఇంకో అయిదు నిముషాలు గడిచాయి. ఇక ఆగలేకపోయాడు. మనసేదో కీడును శంకిస్తుండగా టార్చ్ ఫోకస్ చేసుకుంటూ పొదల్లోకి నడిచాడు.

నర్శింలు కనబడలేదు రాంసింగ్ నాలుక తడారి పోతుండగా... ఇంకో పదడుగులు ముందుకు పోయి... "నర్శింలూ... నర్శింలూ" అంటూ గట్టిగా అరిచాడు. సమాధానం రాకపోవడంతో జంకుగా అన్పించినా... మొండి ధైర్యంతో మరో నాలుగడుగులు లోపలికి పోయాడు.

ఓ చోట నిలబడి చుట్టూ టార్చ్ ఫోకస్ చేస్తున్నప్పుడు అల్లంత దూరంలో కనబడిం దతనికి... బొక్క బోర్లా పడి ఉన్న ఓ మనిషి శరీరం.



"ఇది ఖచ్చితంగా ఝాన్సీ పనే అయ్యుం టుంది" అంది కల్పన.

"హౌ కెన్ యు సే? " అంది నిత్య.

"ఝాన్సీని అనుమానించడానికి నా దగ్గర రెండు ఆధారాలున్నాయ్. మొదటిది నిఖి తని అది రెడ్ ఇంక్ కావాలని అడిగిన రోజు రాత్రే మన రూమ్ డోర్‌మీద ఆ

రాతలు కనబడ్డాయ్. ఇక రెండవది... ఇవాళ ఉదయం ఇంటర్వెల్ టైంలో అది హాస్టల్‌కెళ్లి క్లాసుకి లేట్‌గా వచ్చింది.

లంచ్ టైమ్‌లో అది ఏ కూరలూ వద్దు. పెరుగే కావాలని పట్టు పట్టింది. సో... నాకెక్కడో... ఏదో అనుమానంగా ఉంది"

"వెల్‌సెడ్. ఇది ఖచ్చితంగా ఝూన్సీ పనే. దెయ్యాలా... గాడిద గుడ్డా" నిత్య అంది.

"కల్పనా... కేష్ ప్రైజ్ కొట్టావనుకో... నువ్ షేర్ మార్కెట్ పెట్టాల్సిందే" నిత్య అంది.

"నాట్ లైక్ దట్. ఫిఫ్టీ నాకు. ఫిఫ్టీ మీ అందరికీ" చెప్పింది కల్పన.

"యూ... కంజూస్" నిత్యా, తేజస్విని ఒకేసారి అన్నారు.

ఆ రాత్రి ఇట్లా సాగిన వారి సంభాషణకు... తెల్లారటంతోనే ఫుల్‌స్టాప్ పడింది.

రాత్రి నర్శింలు... పొదల్లో స్పృహ తప్పి పడిపోయిన సమాచారం తాటాకు మంటలా గుప్పుమంది. నిన్న మొన్నటి సంఘటనల్ని పోకిరీ చేష్టలుగా కొట్టిపారేసిన మేనేజ్మెంట్ నర్శింలు విషయంలో నోరు మెదపలేదేమో అనుకున్నారంతా.

కారణం... స్పృహలో కొచ్చిన నర్శింలు చెప్పిన కథ వింటుంటేనే ఒళ్ళు గగుర్పొడిచింది అందరికీ.

ఒంటికని వెళ్ళిన నర్శింలు గొంతుని పొదల్లోకి సాగిన ఇంత పొడవు చెయ్యి ఒడిసి పట్టుకుంది. ఆ చెయ్యంతా నల్లగా దట్టంగా ఉన్నాయి వెంట్రుకలు. అది తన పొడవాటి గోళ్లను అమాంతం నర్శింలు గొంతులోకి దించింది. అంతే... అతనికి స్పృహ తప్పింది.

అతను చెప్పినదానికి సాక్ష్యంగా అతని గొంతుమీద గోళ్లతో గుచ్చిన గుర్తులు... ఆ గాయాల్లోంచి కారి చారలు కట్టిన రక్తం.

దాంతో ఝూన్సీమీద కల్పనకున్న అనుమానం తుడిచిపెట్టుకు పోయింది.

అది ఝూన్సీ రాణో... రుద్రమదేవో చేయగలిగిన పని కాదని ఇట్టే అర్థమై పోవడంతో... కల్పన గుండె కడుపులోకి జారిపోయింది.

మేనేజ్‌మెంట్ స్టూడెంట్స్ మీటింగ్ కండక్ట్ చేస్తారేమో అనుకున్నారంతా.

అట్లాంటిదేం జరగలేదు గాని... ఆ సాయంత్రానికి నలుగురు పోలీసులు కనబడ్డారు.

మామూలుగానే స్టడీ అవర్స్ జరిగాయి. ఎనిమిదింటికి భోజనాలక్కదిలారంతా. నిన్నటి సంఘటనతో... మెస్‌లో భోజనమంటేనే... ఏదోలా ఉంది అందరికీ. పగలెలాగో అడ్జస్ట్ అయ్యారు గాని రాత్రి భోజనానికి చాలామంది గైర్‌హాజర్ అయ్యారు.

అట్లాంటి కొందర్ని "డోంట్ బి సిల్లీ... మనముండేది ట్వెంటీ ఫస్ట్ సెంచరీలో. కాక్ అండ్ బుల్ స్టోరీస్ నమ్మడానికి సిగ్గుగా లేదూ మీకు? కమాన్, హరియప్. ఇమ్మీడియట్‌గా వెళ్ళి మీల్స్ చెయ్యండి"

**ఒంటికని వెళ్ళిన నర్శింలు గొంతుని పొదల్లోకి సాగిన ఇంత పొడవు చెయ్యి ఒడిసి పట్టుకుంది. ఆ చెయ్యంతా నల్లగా దట్టంగా ఉన్నాయి వెంట్రుకలు. అది తన పొడవాటి గోళ్లను అమాంతం నర్శింలు గొంతులోకి దించింది. అంతే... అతనికి స్పృహ తప్పింది. అతను చెప్పినదానికి సాక్ష్యంగా అతని గొంతుమీద గోళ్లతో గుచ్చిన గుర్తులు... ఆ గాయాల్లోంచి కారి చారలు కట్టిన రక్తం.**







అంటూ వార్డెన్స్ శమంతా... శివాజీ... ప్రిన్సిపాల్... చీవాట్లేసి... చెవులు మెలేసి నంత పని చేసి... భోజనం తినిపించారు.

నర్సింలు ఓ వారం సెలవు పెట్టి ఇంటికి వెళతానన్నా ఒప్పుకోలేదు మేనేజ్‌మెంట్. ఏ విషయమైనా పెదవి దాటితే పెన్న దాటుతుందని తెలుసు వాళ్ళకు. అతను భయపడుతున్నాడు గనుక డ్యూటీ నుంచి మాత్రం రిలీవ్ చేసి హాస్టల్లోనే రెస్ట్ తీసుకో మన్నారు.

మేనేజ్‌మెంట్ తీసుకున్న ఇంకో జాగ్రత్త ఏంటంటే స్టూడెంట్స్‌ని ఒకళ్ళని కూడా ఇంటికి ఫోన్ చెయ్యనివ్వటం లేదు. ఇళ్ళ నుంచి ఫోన్ వచ్చినా శమంతో... శివాజినో రిసీవ్ చేసుకుని విషయం కనుక్కొని సంబంధిత విద్యార్థులకి చెబుతున్నారు.

పోలీసులు... ఒక్కో అంతస్తులో ఒక్కొక్కరు చొప్పున రాత్రింబవళ్ళూ వాచ్ చేస్తు న్నారు.

నాలుగు రోజులు సజావుగానే గడిచిపో యాయి. ఎటువంటి విపరీతాలు జరగ లేదు. అబ్‌నార్మల్‌గా కొట్టుకుంటున్న హాస్టల్ విద్యార్థినుల గుండెలు సాధారణ స్థితికి అప్పుడప్పుడే వస్తున్నాయి.

డిస్టర్బ్ అయిన మనసుల్ని కుదుట పర చుకుని చదువుల మీద దృష్టి కేంద్రీకరించ బోయే తరుణంలో జరిగింది మళ్ళీ ఓ సంఘటన. అదీ రూమ్ నెంబర్ ఫిఫ్టీఫైవ్ లోనే.

ఆ రూమ్‌లో ఒక్క తేజస్వినికి తప్ప అందరిదీ షార్ట్ హెయిరే. తేజస్వినిది తెగ బారెడు జుట్టు. పాత సినిమా హీరోయిన్లే సుకున్నట్టు ఇంత పొడుగున అల్లుకుం టుంది వాలు జడ.

"అబ్బా... చుడీదార్‌కీ ఆ జడకీ నప్పదే తల్లీ. హెయిర్ స్టైయిలైనా మార్చు డ్రెస్ స్టైయిలైనా మార్చు" అంటూ ఫ్రెండ్స్ సల హాలు కూడా ఇస్తుంటారు.

జడ కరినాగులా ఉంటుందని 'మిస్ కరి నాగు' అని టైటిల్ కూడా ఇచ్చేశారామెకు క్లాస్‌మేట్స్. ఫ్రెండ్స్ అట్లా పిలిచినప్పుడు కోపం నటిస్తుందే గానీ, గర్వంగా ఫీలవు తుంది తేజస్విని.

అటువంటి ఆమె జడ మొదలంటా కత్తి రించబడింది. ఉదయం నాలుగున్నరకి లేచి ప్రార్థనకు రావడంతో అక్కడి విద్యార్థినుల దినచర్య ఆరంభమవుతుంది. ప్రార్థన గంట మోగగానే లేచి రేగిన జుట్టును సరి చేసు కుని జడను వేలి ముడిలా చుట్టుకునే అల వాటున్న తేజస్విని ఆ రోజు లేవగానే అదే పని చెయ్యబోయి గతుక్కుమంది. కత్తివే టుకి నెత్తురు చుక్కలేని ముఖంతో పక్క బెడ్ మీదున్న నిత్యను హడావుడిగా లేపింది. అప్పటికే తేజస్విని కళ్ళలోంచి నీళ్ళు దూకుతున్నాయి.



నిద్ర మత్తులో తేజస్విని ఏం చెబుతుందో నిత్యకు అర్థం కాలేదు. అర్థమయ్యాక ఆమె కళ్ళు పెద్దవయ్యాయి. ఆశ్చర్యంతో నోరు తెరుచుకుపోయింది.

కల్పన, సాదియా, నిఖిత లేచేశారు. తేజస్విని చుట్టూ మూగారు.

వేసిన తలుపులు వేసినట్టే ఉండగా... తేజస్విని జుట్టు ఎవరు కత్తిరించి ఉంటారన్నది జవాబు లేని ప్రశ్నయ్యింది.

ఉన్నట్టుండి కల్పన అంది "అసలు జుట్టేది?"

బెడ్ మీద చూశారు. గది నలుమూలలా వెదికారు. ఎక్కడా కన్పించలేదు. క్షణాల్లో స్ప్రెడ్ అయింది వార్త.

చివరకు ఆ జుట్టు సాదియా ట్రావెలింగ్ బేగ్‌లో బట్టల అడుగున దొరికింది.

తేజస్విని చచ్చినా హాస్టల్లో ఉండనని మొండిపట్టు పట్టింది. వార్డెన్లూ... లెక్చరర్లూ... ఎందరు చెప్పినా వినకుండా భోజనం కూడా మాని కూర్చుంది. రెండు రోజుల్లో పంపించేస్తామని ప్రిన్సిపాల్ మాటిచ్చాక కాస్త ఊరడిల్లింది.

అయితే ఆ రెండు రోజుల్లో చాలా అనూహ్య సంఘటనలు జరిగిపోయాయి. ఆ రాత్రి థర్డ్ ఫ్లోర్‌లో వాచ్ చేస్తున్న... పోలీస్ కేరిడార్‌లో మంటలు కనిపించాయని రిపోర్ట్ చేశాడు. భయంతో జ్వరం కూడా వచ్చిందతనికి.

ఆ మర్నాడు కిచెన్‌లో గ్లాసులూ, ప్లేట్లూ గాల్లో ఎగరడం చూసిన రాజమ్మకు భయంతో స్పృహ తప్పింది. ఉడికిన అన్నంలో ఇసుక పడింది. నలభై రెండో నంబర్ గదిలోని తులసికి అర్ధరాత్రిపూట... కిటికీలోంచి తల లేని మొండెం కనబడింది.





అదే రాత్రి బోటనీ లెక్చరర్ రజని గుండెల మీద ఎవరో కూర్చున్నారని గగ్గోలు పెట్టింది. మరో లెక్చరర్ శివానీ బెడ్ మీంచి తననెవరో తోసేశారని వాపో యింది.

చీకటి పడితే చాలు పిల్లలు, పెద్దలు గుండెలు గుప్పెట్లో పెట్టుకుని బతుకుతు న్నారు. చాలామంది అమ్మాయిలు భయాన్ని అణచుకోలేక ఏడ్చేస్తున్నారు. ఇళ్ళకు వెళ్ళిపోతామని మొండికేస్తున్నారు.

★ ★ ★

హాస్టల్ కేంపస్‌లో పెద్ద ఎత్తున కర్మ కాండ జరుగుతోంది. సమయం అర్ధరాత్రి పన్నెండు గంటలు.

నలుగురు మంత్రగాళ్ళు గాల్లో ఎగురుతు న్నారు. వాళ్ళు ఎగురుతున్నంత సేపు వాయిద్యాలు మోగుతూనే ఉన్నాయి. ప్రధాన మంత్రగాడు భగభగ మండుతున్న మంట ముందు కూర్చుని... అనర్గళంగా మంత్రాలు ఉచ్చరిస్తున్నాడు.

స్టూడెంట్స్ టీచింగ్ స్టాఫ్... నాన్ టీచింగ్ స్టాఫ్... అందరూ చుట్టూ నిలబడి జరిగే తంతు చూస్తున్నారు.

అందరితో పాటూ చూస్తున్న రాజమ్మ శరీరం... మెల్లగా వణకటం ఆరంభిం చింది.

అందరికంటే ముందా విషయాన్ని గమ నించింది నిత్య.

"ఏమైంది రాజమ్మా" ఆమె భుజం మీద చెయ్యి వెయ్యబోయింది నిత్య.

ఆ చేతిని విసిరి కొట్టింది రాజమ్మ. చూస్తుండగానే ఆమె శరీరం వూగి పోసా గింది. పళ్ళు కొరుకుతూ... కళ్ళు గుండ్రంగా తిప్పుతోంది. ఆమె గొంతు లోంచి మూలుగులాంటి శబ్దం వెలువడు తోంది.

రాజమ్మకు పూనకం వచ్చిందని అందరికీ అర్థమైపోయింది. చూస్తుండగానే ఆమె మంత్రగాళ్లతో పాటు ఎగరటం ఆరంభిం చింది. మోకాళ్ళ నొప్పులతో బాధపడే రాజమ్మ అట్లా ఆడటం చిత్రంగా ఉంది అందరికీ. ఒకలాంటి భయంతో బిగుసుకు పోయారంతా. వాయిద్యం... ఎగరటం హఠాత్తుగా ఆగిపోయాయి. ప్రధాన మంత్ర గాడు రాజమ్మకేసి సూటిగా చూశాడు.

రాజమ్మ మంత్రగాణ్ణి భయపెడుతున్న ట్టుగా ఎరుపెక్కిన కనుగుడ్లను భయంక రంగా తిప్పింది.

"మింగేస్తాన్రోయ్" అంటూ అతని మీద దాడికి దిగబోయింది.

మంత్రగాడు ఏవో మంత్రాలు ఉచ్చ రిస్తూ... నిప్పులో ఏదో పొడిని చల్లాడు. గుప్పుమని లేచి రాజమ్మను చుట్టేసింది పొగ. ఉక్కిరి బిక్కిరై పోయి... ప్రధాన మంత్రగాడి ముందు మోకాళ్ళ మీద కూల బడిపోయింది. అతను పసుపు నీళ్లతో వేప మండల్ని ముంచి ఆమె ముఖం మీద చల్లాడు.

సొమ్మసిల్లిపోతున్నట్టుగా నీరసంగా కళ్ళు రెపరెపలాడించింది.

ఇక వరసగా ప్రశ్నలడగటం మొదలెట్టాడ తను.

"నేను రాధికను. విజయా మేడమ్ నన్ను అవమానిస్తే వురేసుకున్నాను. అర్థాంత రంగా చనిపోయాను. నా కోరికలు తీరలేదు. వీళ్ళంతా ఇక్కడ హాయిగా చదువు కుంటుంటే అసూయగా ఉంది. ఒక్కొక్క ళ్ళనీ వరసబెట్టి మింగేస్తాను. ఎవర్నీ బత కనివ్వను. ఎవ్వర్నీ బతకనివ్వను... ఎవ్వర్నీ బతకనివ్వను..." రాజమ్మ తల గుండ్రంగా తిప్పేస్తోంది.

మంత్రగాడు హూంకరించాడు. మళ్ళీ పొగపెట్టి... ఆమెను ఉక్కిరి బిక్కిరి చేశాడు. రాజమ్మ జుట్టు పట్టుకుని తల పైకెత్తి ఇన్ని పసుపు నీళ్లు ఆమె ముఖాన ఊపిరాడకుండా కొట్టాడు.

ఉన్నత చదువులకు మార్గదర్శి...

# MATRIX Career Solutions

## ADMISSION GUIDANCE - 2007



# MBBS/BDS

**Pondicherry,**
**Karnataka & Tamilnadu**

*For more details contact:*

## MATRIX Career Solutions

**R.T.Nagar, Bangalore-32**

## Cell: 09845572001



"నన్నేం చెయ్యొద్దు. రెండు ప్రాణాలు బలిస్తే నేనెళ్ళిపోతాను" ప్రధాన మంత్ర గాడు రెండు కోళ్లను బలిచ్చాడు. రాజమ్మ సొమ్మసిల్లి పడిపోయింది. ప్రధాన మంత్ర గాడు ఒక ఖాళీ హార్లిక్స్ బాటిల్ తీసుకుని మూత తెరిచి పడిపోయిన రాజమ్మ ముందు పెట్టాడు. సీసాలోకి దయ్యాన్ని ఆవాహన చేశాడు. మూత గట్టిగా బిగించి హాస్టల్ గేటు బయటికి నడిచాడు. అతనితో పాటు చాలామంది కదిలారు. చెట్లలోకి పోయాక... మిగిలిన మంత్రగాళ్ళలో ఒకడు మూరెడు లోతు గుంట తవ్వాడు.

ప్రధాన మంత్రగాడు ఆ సీసాని గుంటలో పెట్టి మట్టి కప్పాడు. అక్కడే కూర్చుని మంత్రాలు చదివాడు.

ఓ పది నిముషాల తర్వాత అందర్నీ ఉద్దేశించి చెప్పాడు "రాధిక ఆత్మను భూస్థాపితం చేశాను. ఇంక అది ఎవర్నీ పీడించదు. మీరు నిశ్చింతగా ఉండొచ్చు"

ప్రిన్సిపాల్ గదిలో కూర్చుని తల పట్టుకున్నాడు. కరస్పాండెంట్ సత్యనారాయణ దెయ్యం భయం పోగొట్టాలంటే ఏదో ఒకటి చెయ్యాలని అనుకున్నాడాయన. రాజమ్మ సొంత ఊళ్ళో ఎవడో భూత వైద్యుడున్నాడని, అతన్ని పిలిపిస్తే దెయ్యాన్ని చిటికెలో పట్టి బంధిస్తాడనీ తనతో అన్నట్టు చెప్పుకొచ్చాడు ప్రిన్సిపాల్.

సత్యనారాయణకీ సలహా నచ్చింది. ఏదో ఒక చర్య తీసుకోవాలి. పిల్లల్లో భయాన్ని పోగొట్టాలి.

'గుట్టుగా ఆ పూజేదో జరిపిస్తే... దెయ్యం భయం నుంచి పిల్లలు బయట పడతారు... అసలు దెయ్యం ఉందా లేదా అనేది ప్రశ్నకాదు. ఆ పూజతో ఆ గిలి పోతుంది. సైకలాజికల్‌గా పిల్లలు కుదుట పడతారు' అనుకున్నాడాయన.

దాని ఫలితమే ఈ పూజ. పూజ తర్వాత నిజంగానే పిల్లల్లో మనోధైర్యం కలిగింది. తమను పట్టి పీడిస్తున్న దెయ్యం భూస్థాపితం అయ్యింది అన్న ఫీలింగ్ వాళ్లలో తెలియని నిశ్చింతని కలిగించింది.

కానీ... కొత్తగా ఒక సమస్య తలెత్తింది. "రాధిక ఎవరు? ఎందుకు ఉరేసుకుంది? " ఈ ప్రశ్న దావానలంలా వ్యాపించింది హాస్టలంతా.

ఆరేడేళ్ళ క్రితం నాటి మాట అది. కెమిస్ట్రీ లెక్చరర్ విజయలక్ష్మి రాధిక అనే స్టూడెంట్‌ని మార్కులు తక్కువొచ్చాయంటూ... క్లాస్ క్లాస్‌కీ తిప్పి ఇతర స్టూడెంట్స్ చేత షేమ్ చేయించింది. అంతే... ఆ రాత్రికే... హాస్టల్ గదిలోనే ఫ్యానుకి చున్నీతో ఉరేసుకు చనిపోయిందా అమ్మాయి.

ఏదైనా లెటర్ రాసి పెట్టిందేమోనని గదంతా వెదికిన మేనేజ్‌మెంట్‌కి ఏం కనబడలేదు గానీ... 'ఐ హేట్ విజయా మేడమ్' అని రెండు అర చేతుల్లోనూ ఆ అమ్మాయి రాసుకున్న రాతలు పోలీసుల కంట బడ్డాయి.

పెద్ద దుమారమే రేగబోయింది గానీ... పచ్చనోట్లు వెదజల్లి... పోలీసుల్ని మచ్చిక చేసుకోవటంతో... ఇన్‌స్పెక్టరే మధ్యవర్తిత్వం నడిపి గుట్టుగా అయిదు లక్షలు రాధిక తల్లిదండ్రులకి మేనేజ్‌మెంట్ నుంచి ఇప్పించాడని అప్పట్లో అంతా చెప్పుకునేవారు. ఆ తర్వాత ఆ ఘటనకు కారణమైన విజయా మేడమ్‌ని డిస్మిస్ చేసేశారు. విషయం కనీసం న్యూస్ పేపర్‌లో కూడా రాకుండా తొక్కిపట్టారు. కాలక్రమంలో పూర్తిగా మరుగున పడిపోయిందా సంఘటన.

కానీ ఇన్నాళ్లకు... రాజమ్మ పూనకం పుణ్యమా అని వెలుగులోకొచ్చింది.

అప్పటి కేటరింగ్ స్టాఫ్‌లో రాజమ్మ లేదు. రాజమ్మే కాదు రామచంద్రయ్య... శీను ఎవరూ లేరు. కనీసం లెక్చరర్లు కూడా

అప్పటివాళ్లు లేరు. ఒక్క ప్రిన్సిపాల్‌కు మాత్రమే... విషయం తెలుసు. బట్... అతను చాలా క్రెడిబుల్. వృత్తిరీత్యా గాని... ప్రవృత్తి రీత్యా గానీ... క్రెడిబిలిటీకి ప్రాణం ఇస్తాడు.

సో... ఇది రాజమ్మకు తెలిసే మార్గమే లేదు. పూనకం తగ్గిన తక్షణమే సత్యనారాయణ రాజమ్మను ప్రత్యేకంగా ఇంటర్వ్యూ కూడా చేశాడు.

"రాధిక... అనే అమ్మాయి ఈ హాస్టల్‌లో ఉరేసుకుందని నీకెవరు చెప్పారు?" అన్నాడు.

"రాధికమ్మ ఎవరు సారూ!" రాజమ్మ ఆశ్చర్యంతో నోరు తెరిచేసింది.

ఆమె ఆశ్చర్యంలో నిజాయితీ కనబడిందాయనకు. రాజమ్మ పూనకం నాటకమేమో అని ఏ మూలో ఉన్న అనుమానం కాస్తా పటాపంచలైందాయనకు.

ఇక ఏ ప్రశ్నలూ వెయ్యకుండా ఆమెను పంపించేసి ప్రిన్సిపాల్‌ని అడిగాడు. "నిజంగానే రాధిక ఆత్మ హాస్టల్లో తిరుగుతోందంటారా మిస్టర్ మూర్తీ?"

ప్రిన్సిపాల్ ఒక్క క్షణం మౌనంగా ఉండిపోయి ఆనక అన్నాడు. "తిరిగిందో లేదో... బట్... నౌ... దాన్ని మంత్రగాడు పాతేశానంటున్నాడు గదా! ఐ థింక్... ఇప్పటినుంచీ ఇంకే సమస్యా ఉండకపోవచ్చు"

సత్యనారాయణ తృప్తిగా తలాడించి చెప్పాడు. "రాధిక మరణం అబద్ధమనీ, గిట్టనివాళ్ళు పుట్టించిన పుకారని స్టూడెంట్స్‌ని మేకప్ చేయండి మీరు"

"ష్యూర్" చెప్పాడు ప్రిన్సిపాల్, సత్యనారాయణతో కరచాలనం చేస్తూ.

"పుకారని బుకాయిస్తున్నారు గానీ రాధిక అనే అమ్మాయి ఈ హాస్టల్లో ఖచ్చితంగా ఉరేసుకుని ఉంటుంది" కల్పన అంది.

రాజమ్మ పూనకం తర్వాత... చాలా మంది అమ్మాయిలు ఆమెను రాధిక



మరణం గురించి ఆరా తీశారు గానీ... ఆమెనుంచి ఏమీ రాబట్టలేకపోయారు. అయితే అదంతా కట్టు కథన్న ప్రిన్సిపాల్ ప్రచారం మాత్రం ఆ హాస్టల్లో ఎప్పుడో ఒక మ్మాయి మరణించిందన్న అనుమానాన్ని చెరపలేకపోయింది.

అందుకే... ఊహాగానాలు యథేచ్ఛగా సాగుతున్నాయి. ఏదో ఒక రకంగా ఏదో ఒక ఇన్ఫర్మేషన్ కలెక్ట్ అవుతోంది.

సాదియా ఒక్క క్షణం ఆలోచించి చెప్పింది.

"రాధిక ఈ గదిలోనే ఆత్మహత్య చేసుకుని ఉంటుంది"

కల్పన ఉలిక్కి పడింది. "ఛ... మన గదిలో అయ్యుండదులే" అంది సర్దుకుంటూ.

"ఈ గదిలో దయ్యం ఉంది అని రాసిందిగా" అంది సాదియా.

వింటున్న నిత్యకు విసుగొచ్చింది. "మనం ప్రిపేరవుతున్నది ఎమ్సెట్ పరీక్షలకు. దెయ్యాల మీద పరిశోధనక్కాదు. మీకు చదవడం ఇష్టం లేకపోతే- దుప్పటి ముసుగుతన్ని పడుకోండి. నన్ను డిస్టర్బ్ చెయ్యొద్దు"

తెల్లవారి స్లిప్ టెస్ట్ ఉంది. అందుకే స్టడీ అవర్స్ తర్వాత కూడా చదువుకుంటోంది నిత్య.

"అది కాదు నిత్యా- రాధిక మన గదిలో..." కల్పన నాన్చింది.

"యస్... మన గదిలోనే చనిపోయింది. ఈ ఫ్యాన్కే ఉరేసుకుంది. సో వ్వాట్... యుగయుగాల నుండీ ప్రపంచంలో రోజుకు ఎంతమంది చనిపోతున్నారు... వాళ్ళ ఆత్మలన్నీ మన బెడ్రూముల్లో... బాత్రూముల్లో ఉంటే బతికున్న మనకి నిల్చునే స్థలం కూడా దొరకదీ భూమ్మీద. కాస్త సెన్సిబుల్గా ఆలోచించడం నేర్చుకోండి. చదువుకున్న వాళ్ళు అయ్యుండీ... అంత సిల్లీగా మాట్లాడటానికి సిగ్గు లేదూ మీకు?" నిరసనగా చూసింది నిత్య.

సాదియా ఏదో అనబోతుంటే... మళ్ళీ నిత్యే అందుకుంది, "పోనీ, మీ నమ్మకమే కరెక్ట్. ఈ హాస్టల్లో ఆత్మ తిరుగాడిందని అనుకుందాం. ఆ మంత్రగాడు దాన్ని బంధించి భూమిలో పాతిపెట్టానన్నాడుగా. ఇక భయం ఎందుకు?"

కల్పనా, సాదియా చర్చలు ఆపేసి పడుకున్నారు.

నిత్య మాత్రం మరో అరగంట చదువుకుని లైటార్పి పడుకుంది. కాసేపట్లాగే కళ్ళు మూసుకుంది గానీ నిద్ర పట్టలేదు నిత్యకు. కళ్ళు తెరిచి సీలింగ్ వైపు చూస్తోంది. ఫ్యాను గిర్రున శబ్దం చేస్తూ తిరుగుతోంది.

ఆ అమ్మాయి ఉరేసుకుంది, సాదియా అన్నట్టు ఈ గదిలోనే అయ్యుంటుందా?

మార్కులు తగ్గినంత మాత్రాన అంత అవమానం చెయ్యాలా! ఆవిడెవరో మరీ ఎక్స్ట్రార్డినరీ లెక్చరర్లా ఉంది. అందరూ అట్లా చెయ్యరు. ఆవిడ శాడిస్టు కాబోలు. ఇవాళ మార్కులు తగ్గితే రేపు కష్టపడి చదివి తెచ్చుకోవచ్చు ఒకవేళ తెచ్చుకోలేకపోయినా వచ్చే నష్టమేమీ లేదు. పరీక్ష పోతుంది. పోయిన ప్రాణం తిరిగి వస్తుందా! ప్రాణం కంటే విలువైనది కాదీ పరీక్ష.

జీవితంలో చదువే కాదు... అంతకంటే ముఖ్యమైనవీ, సాధించాల్సినవీ ఎన్నో ఉన్నాయి. కానీ... జీవితం మాత్రం ఒక్కటే. జీవించి ఉంటే ఏదో ఒకటి అచీవ్ చెయ్యొచ్చు... అసలు జీవితమే లేకుంటే? ఆ విజయా మేడమ్ తనక్కనబడితే ఈ ప్రశ్నే అడగాలి... ఆమెను నిలదియ్యాలి. రాధిక జీవితాన్ని ఎందుకు బలి తీసుకుందో అడగాలి. ఆమెకు మరో జీవితాన్ని తెచ్చివ్వమని కడగాలి.

హఠాత్తుగా పవర్ కట్టయింది. చిమ్మ

చీకటి. నిత్యకు బెడ్ లైట్ లేకపోతే నిద్ర పట్టదు. చీకట్లో తడుముకుంటూ లేచి కప్ బోర్డ్‌లో కేండిలూ... అగ్గిపెట్టె తీసుకుంది.

అగ్గిపుల్ల గియ్యబోతుండగానే చప్పున కరెంట్ వచ్చింది. ఫ్యాను గిర్రున తిరగడం మొదలైంది. కేండిలూ... అగ్గిపెట్టె దిండు కింద పెట్టి మళ్లీ వెల్లకిలా పడుకుంది.

ఈసారి ఆమె దృష్టి ఫ్యాన్‌మీద పడింది. రాత్రి భోజనాలప్పుడు ఆకలి లేదని చెప్పి ఆరోజు గదిలోనే ఉండిపోయిందట రాధిక. అందర్నీ భోజనాలకు పోనిచ్చి... గది తలుపులు గడియపెట్టి ఫ్యాన్‌కి చున్నీతో ఉరేసుకుందట.

ఆ అమ్మాయి ఉరిపోసుకున్న ఫ్యానూ... ఇదీ ఒకటేనా? లేక అది తీసేసి కొత్త ఫ్యాను బిగించారా?

ఈ ఫ్యాన్ మాత్రం చాలా ఓల్డ్‌గా ఉంటుంది. ఒకవేళ అదీ ఇదీ ఒకటేనేమో! నిత్య క్యూరియస్‌గా చూసింది. అట్లా చూస్తూనే ఉంది... దాన్నుంచి కన్ను మరల్చలేనట్టూ చూస్తోంది.

ఎంతసేపలా చూసిందో... ఆమెకే తెలీదు.

నిద్రలో కల గన్నదో... మెలకువలో నిజంగానే కనబడిందో గానీ... నాలుక బయటకు పొడుచుకొచ్చిన ఒక పదహారు... పదిహేడేళ్ల అమ్మాయి శవం ఫ్యాన్నుంచి వేళ్లాడుతూ కన్పించింది నిత్యకు.

★ ★ ★

తేజస్వి చక చక బట్టలు సర్దేసుకుంది.

"అరె! నే చెప్పేది విను తేజా" నిత్య అంది.

"ఇక ఎవరి మాటా వినను. ఒకవేళ పర్మిషన్ ఇవ్వకపోతే... ఆమరణ నిరాహార దీక్షే ఇక" తేజస్వి ముఖం ఎర్రబడింది.

"ప్చ్! నేను పొరపాటు చేశాను" పదోసారి అనుకుంది నిత్య.

రాత్రి ఫ్యాన్నుండి వేళ్లాడుతున్నట్టూ కనబడిన రాధిక శవాన్ని చూసిన వెంటనే... చివుక్కున లేచి కూర్చుంది నిత్య. ఒళ్లంతా గబగబ చెమటలు పోస్తుండగా పక్కనే ఉన్న తేజస్వినిని... బలహీనంగా పిల్చింది. గట్టిగా అరుద్దామన్నా నోరు పెగల్లేదు. ఒళ్లంతా చచ్చు పడ్డట్టయింది. కళ్ళు గట్టిగా మూసుకుని దేవుడ్ని తల్చుకుంటూ కూర్చుంది. రెండు నిముషాల తర్వాత కళ్ళు తెరిచి చూస్తే ఏం లేదక్కడ.

దుప్పటి ముసుగుతన్ని పడుకున్న పడుకోవడం ఉదయం నాలుగున్నరకి ప్రేయర్ బెల్ వినబడే వరకూ లేవలేదు.

అందరితో కల్సి... ప్రేయర్‌కీ... అదీ అటెండవుతున్నప్పుడు రాత్రి తను పడ్డ భయం అర్థం లేదన్పించిందామెకు.

తను ఆ విషయమే ఆలోచిస్తున్నందువల్ల కలిగిన భ్రమా... లేక కలో అని కూడా అనుకుంది. ఫ్రెండ్స్‌కు చెప్పాలా, వద్దా అనుకుంది ముందు. 'ఎందుకులే' అనుకుంది గాని స్టడీ అవర్స్ అయిపోయి రూమ్‌కి వచ్చాక... ఊరికే భయపడే కల్పనను ఏడ్పించాలన్పించి రాత్రి తను చూసిన దృశ్యం గురించి వర్ణించేసింది.

"నిజమా!" అని బెంబేలు పడిపోతున్న కల్పనతో "ఈ నైట్‌కి నిన్ను లేపి చూపిస్తాలే" అంది.

అయితే కల్పన కన్నా ఎక్కువ రియాక్ట్ అయింది తేజస్విని. తన జుట్టు కట్ అయిన రోజే ఇంటికెళ్లిపోతానని పట్టుబట్టి వార్డెన్‌తో కూడా సరే అన్పించుకున్న తేజస్విని... ఆ విషయాన్ని పెండింగ్‌లో పడేసి కాస్త అడ్జస్ట్ అవుతోంది. ఇప్పుడు నిత్య చెప్పిన వార్తతో కదిలిపోయింది.

"జస్ట్... ఆట పట్టిద్దామని చెప్పానే... నిజం కాదు. ప్రామిస్" అంటున్న నిత్య మాటల్ని పట్టించుకోకుండా... వార్డెన్ రెసిడెన్స్ వైపు దూసుకుపోయింది. ఆమె వెన







కాలే కదిలారు రూమ్మేట్సంతా.

వెళ్తూ... వెళ్తూ... నిత్య చూసిన విష యాన్ని దాదాపు వీలైనంత మందికి చెప్పే శారు. కల్పనా... సాదియా... శమంత రెసిడెన్స్ ముందు చిన్న గుంపే తయా రైంది.

"మేమ్... నేను ఊరెళ్లాలి. దయ చేసి పర్మిషన్ ఇవ్వండి"

ఈ దండయాత్రను కిటికీలోంచే గమ నించి బయటకొచ్చిన శమంతతో అంది తేజ స్విని. ఆమె ఏదో అనబోతున్నంతలో మళ్లీ తనే అంది తేజస్విని. "మీరు ఆల్రెడీ... నాకు పర్మిషన్ ఇచ్చారు మేడమ్" శమంతకు గుర్తుంది. రెండ్రోజుల్లో వెళ్లిపోతానంటున్న తేజస్వినితో తను 'సరే' అనడం. కానీ నాల్రోజుల్నుంచీ తేజస్విని ఆ ఊసే ఎత్తకపోవడంతో అడ్జస్ట్ అయిపోయిందిలే అనుకుందామె. మళ్లీ ఇంతలో ఉన్న ట్టుండి... ఇట్లా మందీ మార్బలాన్ని వేసు కుని... ఇంతలో శివాజీ లోపల్నుండి వచ్చాడు. ఇద్దరూ ఏదో గుసగుసలాడుకు న్నారు. తర్వాత శమంత తేజస్వినితో "అలాగే వెళ్దువులే. ప్రిన్సిపాల్ గారితో కన్సల్ట్ కావాలి. నౌ యుకెన్ గో" అంది.

"నో... మేమ్... నేనిప్పుడే వెళ్లిపోతాను" అట్లా అంటుంటేనే తేజస్విని కళ్లవెంట నీళ్లు కారిపోతున్నాయి.

మళ్లీ ఏదో జరిగిందని అర్థమైందామెకు. దానికితోడు కల్పన కూడా "ప్లీజ్... మేమ్... ఐ టూ విల్ గో... గివ్ మి పర్మి షన్" అంది.

"ఏదైనా ప్రాబ్లమా? " అడిగిందామె.

నిత్య మాట్లాడలేదుగాని... నిత్య చూసిన విషయాన్ని... తను చూసినంత క్లారిటీతో చెప్పింది కల్పన శమంతకు.

"మైగాడ్... అదా విషయం" శమంత ఒక్క క్షణం తల పట్టుకుంది.

"నిత్యా... యు... యు ఆర్ బ్రిలి యంట్ స్టూడెంట్. నువ్వందరిలోకీ డిఫ రెంట్ అనుకున్నా... నువ్వు కూడా..." అంటున్న శివాజీ మాటల్ని సగంలోనే అందుకుని అంది నిత్య.

"సర్... ఫ్యాన్నుంచి వేళ్లాడుతున్న శవం నాక్కనబడ్డం నిజమో... కలో... నాకే తెలీదు. దాచుకోలేక చెప్పాను. వీళ్లంతగా హర్ట్ అవుతారని నేననుకోలేద్సార్. అయినా కళ్లతో చూసింది నేను. నాకు లేని భయం వీళ్లకెందుకు సార్? నేనిప్పటికీ చెబ్తున్నాను అది నా భ్రమ... నిజంకాదు"

శివాజీ మెచ్చుకోలుగా చూశాడు నిత్య వైపు. "విన్నావా తేజస్వినీ... అదంతా భ్రమ అని... నిత్యే ఒప్పుకుంటోంది" అంది శమంత.

తేజస్విని శమంతవైపూ, నిత్యవైపూ ఉక్రో షంగా చూస్తూ... తన జుట్టు వైపు చూపుడు వేలితో పాయింటవుట్ చేస్తూ

అన్నది, "అది భ్రమ కావచ్చు... కానీ... ఇది భ్రమ కాదుగా మేమ్"

ఆ మాటలకు శమంత వెంటనే సమాధానం ఇవ్వలేకపోయింది.

ఈలోపు గుంపులు గుంపులుగా నిలబడ్డ అమ్మాయిలు గుసగుసలాడ్డం మొదలెట్టారు. శమంతకీ, శివాజీకీ పరిస్థితి అర్థమైంది. తేజస్వినే కాదు... అక్కడున్న అందరికీ ఇళ్లకు వెళ్లిపోవాలనే కోరిక మొదలైంది. "సరే... తేజస్విని... మీరందరూ అనుకుంటున్నట్లు ఈ హాస్టల్లో దెయ్యం ఉందనే అనుకుందాం. కానీ... దాన్ని మంత్రగాడు సీసాలో బంధించి... భూస్థాపితం చేశాడు కదా! అట్లా చెయ్యడాన్ని మీ కళ్లారా చూశారు కూడా. ఇంకేమిటి భయం?" అందామె కన్విన్స్ చెయ్యటానికి ప్రయత్నిస్తూ.

శివాజీ కూడా తమకు సపోర్టింగ్‌గా ఓ మాట అనబోతున్నంతలో... గస పెట్టుకుంటూ పరుగెత్తుకొచ్చాడు పట్నాయక్.

"సర్... సర్..." అంటూ శివాజీతో అతనేదో చెప్పటానికి ప్రయత్నిస్తున్నాడుగాని నోరు పెగలటంలేదు.

అందరి అటెన్షన్ అతని మీదకు మళ్లింది. శివాజి అతని భుజం మీద చెయ్యేసి "చెప్పు పట్నాయక్" అన్నాడు.

అతడు కాస్త సర్దుకున్నాడు. "సర్... ఆ సీసా... ఆ సీసా... బయటకొచ్చేసింది.







అది మీ రూమ్ వెనకాలున్న స్థలంలో... పగిలిపోయి పడివుంది సర్. అక్కడేదో చీటీ కూడా ఉంది సార్"

అతనంటున్న 'సీసా' ఏమిటో చెప్పకనే అర్థమైందక్కడున్న వాళ్లకు.

పొలోమని పరిగెత్తారు అందరూ శమంత రెసిడెన్స్ వెనకవైపుకు.

గోడవారగా నేలమీద... భళ్లున బద్దలైనట్టు పడివుంది... మంత్రగాడు రాధిక ఆత్మను బంధించి భూస్థాపితం చేసిన సీసా. పగిలిన గాజుపెంకుల మధ్య రెపరెపలాడుతోంది... ఎర్రటి అక్షరాలున్న ఓ కాగితం.

అందరూ ఎగబడి చూశారేగాని ఆ కాగితాన్ని అంటుకునే సాహసం ఎవ్వరూ చెయ్యలేకపోయారు. క్షణాల్లో వార్త... హాస్టలంతా పాకిపోయింది. ప్రిన్సిపాల్... లెక్చరర్స్‌తోపాటు... వంటవాళ్లు... చివరికి వాచ్‌మెన్లతోసహా పోగయ్యారక్కడ.

"రామ్‌సింగ్... ఆ చీటీ తీయ్" అన్నాడు ప్రిన్సిపాల్.

రామ్‌సింగ్ తడబడుతూ... గుటకలు మింగుతూ ముందుకు వంగుతుంటే... నిత్య చప్పున చెప్పింది "నే తీస్తాలే ఆగు" అంటూనే ఆమె నిస్సంకోచంగా ఆ కాగితాన్ని అందుకుంది.

"ఆత్మని భూస్థాపితం చేసే సత్తా మీకుందా! ఈ హాస్టల్‌ని సర్వనాశనం చెయ్యందే... నేను వెళ్ళను"

నిత్య పెద్దగా చదివింది అందరూ వినడానికి వీలుగా. చదివాక "సర్... ఐ థింక్... బ్లడ్ ఈజ్ యూజ్డ్ టు రైట్ దిస్ మేటర్" అంది ప్రిన్సిపాల్‌తో.

ప్రిన్సిపాల్... ఏదో అనబోయాడు గాని... శమంత అరిచిన అరుపుకు ఆయన్తోపాటు అక్కడున్న అందరూ ఎలక్ట్రిక్ షాక్ తిన్నట్టు ఆమెవైపు చూశారు. శమంత మిడిగుడ్లేసుకుని.. గోడకున్న వెనక కిటికీలోంచి తన రెసిడెన్స్‌లోకి చూస్తోంది. ఒక్కుమ్మడిగా అటు చూశారందరూ.

ఆ కిటికీలోంచి కనబడుతున్నాయి భగభగమంటూ మంటలు.




ఈరోజు 12.15 నిముషాలకు రాష్ట్రపతిని కలవనున్న సోనియా... సోనియా గాంధీ విదేశీయతపై... ఢిల్లీలో నిరసన ర్యాలీ...

అరె... బిజేపీ ఓడిపోయింది... ప్రజెంట్ గవర్నమెంట్ కాంగ్రెస్ పార్టీదా! దేశంలో ఇన్ని మార్పులు జరుగుతున్నాయా... ప్చ్... నాకొక్కటీ తెలీదే!" టీవీని చూస్తూ ఆశ్చర్యపోతున్న నిత్యతో... "నీతూ... టీవీ ఆఫ్ చెయ్.. వెళ్ళి చదువుకో" అంది వసంత కిచెన్‌లోంచి.

వసంత నిత్య తల్లి. రెవెన్యూ డిపార్ట్‌మెంట్‌లో క్లరికల్ కేడర్ ఉద్యోగం చేస్తోంది. తండ్రి దివాకర్ సూర్యా ఫార్మాస్యూటికల్స్ మెడికల్ రిప్రజంటేటివ్. వూళ్ళు తిరుగుతూ వుంటాడు. ప్రస్తుతం ఊళ్ళో లేడు.

నిత్య ఛానెల్ మార్చింది. ఈటీవీలో సినీ రంజని వస్తోంది. సౌందర్య నటించిన సీనేదో వేస్తున్నారు.

పక్కింటి లీలావతి వసంతతో పనిపడి వచ్చింది. హాల్లోంచి వంటింట్లోకి వెళ్తూ. నిత్యను పలకరించి టీవీ స్క్రీన్‌వైపు చూసింది.

"ప్చ్... అన్యాయంగా చనిపోయింది మంచి నటి" అంది.

నిత్య భృకుటి ముడిచింది.. "ఎవరాంటే



చనిపోయింది? ”

“విమానం కూలి సౌందర్య చనిపోవడం నీకు తెలీదా? ” ఆశ్చర్యపోయింది లీలావతి.

“నీతూ... ఏం చెప్పాను? ” వసంత మళ్ళీ అంది.

లీలావతి వసంతతో మాట్లాడ్డానికి కిచెన్‌లో కెళ్ళింది. నిత్యకు మనసంతా చేదుగా అన్పించింది.

తన ఫేవరెట్ హీరోయిన్ సౌందర్య మరణించిందా!

“సౌందర్య చనిపోవడం నీకు తెలీదా? ” లీలావతి ప్రశ్న చెవుల్లో గింగర్లాడుతోంది.

తెలీదు... తనకేం తెలియటంలేదు. ఎ ప్లస్ బి హోల్ స్క్వేర్ ఎంతో తెలుసు. సల్ఫర్ డయాక్సైడ్ కెమికల్ ప్రాపర్టీస్ తెలుసు. ఆక్సిజన్ అటామిక్ స్ట్రక్చర్ తెలుసు. స్క్రూగేజ్ నిర్మాణం తెలుసు. వెర్నియర్ కేలిపర్స్ ఉపయోగం తెలుసు.

కానీ... తన చుట్టూ ఏం జరుగుతోందో తెలీదు.

వసంత కిచెన్‌లోంచి వచ్చి నిత్య చేతిలో రిమోట్ లాక్కుని టీవీ ఆఫ్ చేసింది.

“వెళ్ళూ... వెళ్ళి చదువుకో...” చెప్పింది నిత్యతో.

“వున్నట్టుండి సెలవులేంటి? ” లీలావతి అడిగింది.

“ఆ కాలేజ్ అథారిటీస్‌ని అనుకోవాలి. సెన్స్‌లెస్ మేనేజ్‌మెంట్. హాస్టల్లో కొంత మంది పిల్లల మానసిక స్థితి బాగలేదు కాబట్టి ఓ వారం హాలిడేస్ డిక్లేర్ చేశార్ట. కోచింగే షార్ట్ టెర్మ్ కోచింగ్. అందులో మళ్ళీ సెలవులంటూ డేస్ షార్ట్‌కట్ చేశారు. ఇట్లా అయితే ఇక అయినట్టే. ఆ మానసిక స్థితి బాగాలేని వాళ్ళెవరో... ఆ దరిద్రుల్ని పంపగూడదూ ఇళ్ళకు. అందర్నీ తరిమెయ్యడమెందుకూ!”

“మానసిక స్థితి బాగా లేకపోవటమా? ” అయోమయంగా చూసింది నిత్య.

“మీ హాస్టల్లో కొందరు నీడను చూసి కూడా భయపడుతున్నారట. మేనేజ్‌మెంట్ సైకియాట్రిస్ట్‌ని సంప్రదిస్తే... వాళ్ళేదో ఫోబియాతో బాధపడుతున్నారనీ, ఓ వారం విశ్రాంతిమ్మనీ చెప్పాడటకదా ఆయన” అంది వసంత.

“ఓహో! దెయ్యం వూసెత్తకుండా పేరెంట్స్‌ని ఈవిధంగా టాకిల్ చేశారన్నమాట” అనుకుంది నిత్య.

వసంతతో “అవును మమ్మీ... కరెక్ట్. అది ఫోబియానే అయ్యుంటుంది. ‘అదిగో దెయ్యం, ఇదుగో దెయ్యం’ అంటూ ఒకటే గగ్గోలు. ఛ...స్టడీస్ సాగలేదనుకో అక్కడ” అన్నది.

“పిల్లలట్లా బిహేవ్ చెయ్యడానికేదైనా రీజనుందేమో!” అడిగింది వాళ్ళిద్దరి సంభాషణ ఆసక్తిగా వింటున్న లీలావతి.

నిత్య హాస్టల్లో జరిగిన సంఘటనలన్నీ పూసగుచ్చినట్టు చెప్పింది. వసంత కూడా శ్రద్ధగా వింది.

“ఇది ఖచ్చితంగా ప్రొఫెషనల్ జెలసీతో చేసిన కుట్ర” లీలావతి అంది.

“ఎగ్జాట్లీ... దాంతో పోటీపడలేక తొక్కే అడ్డదార్లు ఇవి” వసంత అంది.

“కరెక్ట్ ఆంటీ...” అంటూ సంభాషణ కంటిన్యూ చెయ్యబోతున్న నిత్యను వసంత విసుక్కుంది. “నీతూ... యువార్ వేస్టింగ్ యువర్ టైం లైక్ ఎనిథింగ్”

నిత్య తన రూమ్‌లో కెళ్ళిపోయింది. స్టడీ టేబుల్ ముందు కూర్చుని... పుస్తకం ఓపెన్ చేసింది. అక్షరాల వెంట కళ్ళు పరిగెత్తలేమంటూ మొరాయిస్తుంటే పుస్తకం మూసేసి కిటికీలోంచి బయటకు చూస్తూ కూర్చుంది.

అస్తమిస్తున్న సూర్యుడి కిరణాలుపడి.. ఓ మబ్బు తునక... బంగారు ద్రవంలో ముంచి తేల్చినట్టూ మిలమిలలాడుతోంది.

డ్రాయర్ లాగి... డైరీ అందుకుని పెన్

కేప్ తీసింది.

నాకు రెక్కలు కావాలి. రివ్వుమంటూ ఆకాశంలో పయనిస్తూ వెళ్ళి... ఆ పసిడి మబ్బును తాకాలి. అస్తమిస్తున్న సూర్యుడితో మంతనాలాడి ఆ మబ్బులకద్దిన పసిడి కాంతుల్ని నా రెక్కలకూ అద్దమని వేడుకోవాలి. ఆకాశమంతా ఒలికిపోయిన ఆ నీలిమనంతా నా కనుపాపల్లో నిక్షిప్తం చెయ్యమని నింగిని అభ్యర్థించాలి. వనాంతరాలలో విరబూసిన పేరు తెలియని పూల పరిమళాల్ని... నా ఒంటికి పూయమని చిరుగాలిని ప్రార్థించాలి.

చంద్రోదయాలలోని ఆర్తినీ... సూర్యోదయాలలోని స్ఫూర్తినీ రంగరించి నా మనసుకు పూయమని ఇరు సంధ్యలనీ అర్థించాలి...

"నీతూ!"

తల్లి పిలుపు విని చప్పున డైరీ డ్రాయర్‌లోకి నెట్టేసింది. సీరియస్‌గా క్లాసు పుస్తకంలోకి చూస్తూ కూర్చుంది. ఇంత పొడవు గాజు గ్లాసు నిండా బత్తాయిరసం తెచ్చి టేబుల్‌పైన పెట్టింది. నిత్య ముంగురులు సవరించి నోటికందించింది.

నిత్య తల్లి చేతిలోంచి గ్లాసందుకుని మెల్లగా సిప్ చేస్తోంది. పుల్లగా, తియ్యగా... మహారుచిగా వుంది జ్యూస్.

"విషయం గుర్తుందిగా. చక్కగా చదవాలి. ఒక్క నిముషం కూడా వేస్ట్ చెయ్యకూడదు. నా కలలు నిజం చెయ్యాలి. మీ డాడీ పేరు నిలబెట్టాలి" నిత్య ఖాళీ చేసిన గ్లాసందుకుంటూ ఆమె నుదుటిమీద ముద్దాడింది వసంత.

వసంత వెళ్ళిపోయిన చాలాసేపటి వరకూ చదువుకుంటూ వుండిపోయింది నిత్య. చదువుతూ చదువుతూ అట్లాగే నిద్రలోకి జారిపోయింది.

నిద్రలో ఓ కల.

## రావి కొండలరావు చతురోక్తులు



వెండితెర హాస్యనటుడిగా, పత్రికాసంపాదకుడిగా, రచయితగా, బుల్లితెర ప్రయోక్తగా నిజజీవితంలో విభిన్నపాత్రలను సమర్థంగా పోషిస్తున్న రావికొండలరావు జగమెరిగిన కళాకారుడు. వివిధ సందర్భాలలో ఆయన నుడివిన చతురోక్తులు ఈ నెల 'చతుర' పాఠకులకు ప్రత్యేకం..

### తార

ఒకానొక షూటింగ్ విరామసమయంలో అక్కడున్న కళాకారులు కొందరు పేకాటకు ఉపక్రమించారు. అందులో ఒకాయన 'కొండలరావు గారూ మీరూ ఆడతారా?' అన్నాడు. వెంటనే రావికొండలరావు 'నేను ఆడతారను కాదండీ బాబూ.. మగతారను' అన్నారు తడుముకోకుండా. అంతే అంతా పొట్టచెక్కలయ్యేలా నవ్వారు.

ఆ కలలో ఆమెకు రూమ్ నంబర్ ఫిఫ్టీ ఫైవ్‌లో ఫ్యాన్నుండి వేళ్ళాడుతున్న రాధిక శవం కనబడింది.

★ ★ ★

అలారం మోతకు చివుక్కున కళ్ళు విప్పింది వసంత. పక్కనే నిత్య ఆదమరచి నిద్రపోతోంది. అలారం మోత, ఆమె నిద్రను ఏమాత్రం భంగం చెయ్యలేకపో







యింది. రాత్రి పన్నెండింటిదాకా చదువుకోవడం వల్ల స్పృహలో లేనట్లు పడుకొని వుంది.

"నీతూ..." మెల్లగా తట్టింది వసంత.

"ఊc..." అంటూ ఇటునుంచి అటు తిరిగింది.

మళ్ళీ తట్టింది ఈసారి కాస్త గట్టిగా.

"నిద్రొస్తోంది మమ్మీ" బోర్లా తిరిగి పడుకుంది.

వసంత ఇట్లా కాదని... నీళ్ళు తెచ్చి ముఖాన చిలకరించింది.

నిత్యకి లేవక తప్పలేదు. బుక్స్ ముందేసుకుని... మూసుకుపోతున్న కళ్ళను బలవంతంగా విప్పి చదవటం మొదలెట్టింది.

నిద్రపోకుండా తన ఎదురుగా అట్లాగే కూర్చుని వున్న తల్లితో చెప్పింది నిత్య, "నువ్ పడుకో. నేను చదువుకుంటాలే"

"నథింగ్ డూయింగ్. నేనిట్లాగే కూర్చుంటా. విషయం గుర్తుందిగా" అంది. తన పాటికి తను పడుకుంటే... నిత్య ఎక్కడ నిద్రపోతుందోనని వసంత భయం. ఆరు కావస్తుండగా నిత్య చెప్పింది, "ఇక మేడపైకెళ్ళి చదువుకుంటా మమ్మీ"

నిత్య మేడపైకి వెళ్ళిపోయాక వసంత ఇంటిపనిలో పడింది. పనిచేస్తూనే అప్పుడప్పుడూ మేడపైకెళ్ళి నిత్యను గమనిస్తోంది.

ఎనిమిదింటికి మేడ దిగి స్నానం అదీ కానిచ్చింది నిత్య. వసంత దోసెలు పోస్తుంటే... ప్లేట్ పట్టుకుని పక్కనే చేరింది.

"టిఫిన్... నేను అందిస్తాగా. నువ్వెళ్ళి చదువుకో" చెప్పింది వసంత.

"మమ్మీ" విసుగ్గా చూసింది నిత్య.

"నా తల్లివి కదూ!" నిత్య చేతిలో ప్లేట్ని అందుకుంటూ అంది.

నిత్య వెళ్ళిపోయింది. బుక్ పట్టుకెళ్ళి డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చుంది. వసంత ప్లేట్లో దోసెలు తెచ్చి నిత్య ముందు పెట్టింది.

చదువుతున్న పుస్తకం పక్కనపెట్టి ప్లేటు ముందుకు లాక్కుంది నిత్య. చట్నీ వడ్డించి చెప్పింది వసంత "ఓ గంటసేపు తినక... త్వరగా కానిచ్చి చదువుకో"

నిత్య దోసెలు తింటుంటే మరో రెండు తెచ్చి వడ్డించింది. గ్లాసునిండా బోర్నవిటా కలిపి టేబుల్‌పైన పెట్టి... స్నానానికి వెళ్ళిపోయింది.

వసంత చకచక ఆఫీస్‌కి రెడీ అవుతుంటే "మమ్మీ! డాడీకి ఫోన్ చేస్తా" అంది.

"టైమ్ వేస్ట్. రేపొచ్చేస్తారుగా... చదువుకో"

"చదువుకో" తనలో తనే వ్యంగ్యంగా అనుకుని చదవడం మొదలెట్టింది నిత్య.

తొమ్మిదిన్నర కావస్తుండగా... కేరేజ్ సర్దుకుని హేండ్‌బేగ్ తగిలించుకుని చెప్పులేసుకుంది వసంత.

అప్పటికి నిత్య... వరండాలో కూర్చుని చదువుకుంటోంది.

"ఫ్లాస్కులో పాలున్నయ్. ఫ్రిజ్‌లో బత్తాయి జ్యూసుంది. మధ్యమధ్యలో తాగుతుండేం. అన్నం కూరలూ హాట్‌పేక్‌లో టేబుల్‌పైన సర్దాను. టైం ప్రకారం భోంచెయ్" చెప్పింది వసంత బయల్దేరుతూ.

"జ్యూస్ నే తీసుకుంటా కద మమ్మీ. ఇంత హడావుడిలో నువ్వు తియ్యకుంటే ఏం? " నిత్య అంది.

"ఇంకా నయం. దానికో పదిహేన్నిముషాలు వేస్ట్" అని వెళ్ళబోతూ "నిత్యా... చదువుకుంటావ్ కదూ!" అడిగింది.

అసలామె నిత్య వచ్చిన సందర్భంగా ఓ వారం లీవ్ పెట్టాలనుకుంది. వచ్చేవారం ఇన్‌స్పెక్షనుందీ... పెండింగ్ ఫైల్సన్నీ అప్‌డేట్ చెయ్యమన్నాడు సెక్షనాఫీసర్. లీవ్ పెట్టే అవకాశం లేకుండా పోయింది దాంతో.

"చదూకుంటాను. ఒక్క నిముషం కూడా వేస్ట్ చెయ్యను, సరేనా?" అంది నిత్య.

నిత్యకు మరోసారి జాగ్రత్తలు చెప్పి వెళ్ళిపోయింది వసంత. ఆమె వెళ్ళిపోయిన తర్వాత సుమారు ఓ గంటపైనే చదువుకుంది నిత్య.

ఉన్నట్టుండి... తల నొప్పిగా అన్పించింది. చదివేది తలకెక్కుతున్నట్టుగా అన్పించలేదు. బుక్ మూసేసి తల పైకెత్తింది. ఒళ్ళు విరుచుకుని లేచింది. 'కనీసం... ఒక్క అరగంట రిలాక్స్ కావాలి. అదర్‌వైజ్.... బుర్రపని చెయ్యదు' అన్పించింది. లేచెళ్ళి టి.వి. ఆన్ చేసింది. ఏమీ రావడంలేదు. వసంత... నిన్ననే... డిష్ కనెక్షన్ తీయించేసింది నిత్య స్టడీస్‌కి డిస్ట్రబెన్స్ వుండకూడదని. నిత్య విసుగ్గా స్విచాఫ్ చేసింది. లేచి అటూ ఇటూ పచార్లు చేసింది. ఇంటికి న్యూస్‌పేపర్ రాదు. వసంతకి ఆఫీస్‌లోనే పేపర్ తిరగెయ్యటం అలవాటు. ఇక దివాకర్ ఉద్యోగరీత్యా ఊరూరా తిరుగుతుంటాడు గాబట్టి పర్టిక్యులర్‌గా పేపర్ రాదు. తను ఆఫ్‌లో వున్నప్పుడు... తెచ్చుకుంటాడంతే.

అల్మారాలన్నీ వెదికితే మెడికల్ జర్నల్స్ కన్పించాయి. అవి తిరగేస్తుంటే ఇంకా విసుగన్పించింది. లీలావతి ఆంటీ ఇంటికెళ్దామా అనుకుంది.

బాబోయ్... మాటల్లో... తను వాళ్ళింటికెళ్ళినట్టు చెప్పిందనుకో... మమ్మీ టైం వేస్ట్ చేశావంటూ చిందులు తొక్కుతుంది.

పోనీ మేడపైకెళ్ళి అట్లా పచార్లు చేద్దామా అనుకుంది. ఉదయం పది తర్వాత మేడపైనంటే... మంటల్లో నిలబడ్డమే. మే నెల ఎండలు అదరగొడుతున్నాయ్.

ఉన్నట్టుండి మోగింది ఫోన్. నిత్య రిసీవర్ ఎత్తగానే విన్పించింది అవతల ఎండ్‌లోని గొంతు "నాన్న... చదువుతున్నావురా?"

"యస్ మమ్మీ"

"అందుకేలే చేసింది. ఇప్పుడు జ్యూస్ తాగెయ్"

"ఓ.కె. మమ్మీ"

"సరే, పెట్టేస్తున్నా. టైమ్ వేస్ట్ చెయ్యకు"

"వేస్ట్ చెయ్యను" నిత్య రిసీవర్ క్రెడిల్ చేసింది.

నిత్య... ఫ్రిజ్‌లోంచి జ్యూస్ గ్లాస్ తీసుకుని గటగట తాగేసింది. తల దిమ్ము కొంచెం తగ్గినట్టన్పించి పుస్తకం ఓపెన్ చేసింది.

అయిదు నిముషాల్లో మళ్ళీ మొదలైంది తలనొప్పి.

"నో... తాగటం... తినటం... చదవటం... కాదు. సమ్‌థింగెల్స్ కావాలి"

కిటికీలోంచి బయటకి చూసింది.

"అరె! ఎండేమైంది" ఆశ్చర్యపోయింది. ఆకాశంలో మబ్బులు ముసురుతున్నాయ్. ఆ ఎఫెక్ట్ వల్ల వాతావరణం చల్లగా వుంది. సన్నగా ఈదురుగాలి వీస్తోంది.

అప్పటికప్పుడు చల్లదనం... ఆహ్లాదకరంగా అన్పించింది.

ఆ కాలనీ ఇళ్ళు అక్కడొకటీ... అక్కడొకటీ వుంటాయి. టౌన్ ఎక్స్‌టెన్షన్ ఏరియా అది. అక్కడ స్థలాలు టౌన్‌లో కన్న చవక. చాలా ఇళ్ళు నిర్మాణంలో వున్నాయి. నిత్య ఇంటికి ముందూ, వెనకా, పక్కలా ఇళ్ళు లేవు. లీలావతి ఇల్లు కూడా ఆ ఇంటికి వంద గజాల దూరంలో వుంటుంది. ఎదురుగా మాత్రం ఈమధ్య ఎవరో శంకుస్థాపన చేసి పునాదులు తవ్వారు. ఎందుకనో కట్టుబడి నిలిపేశారు.

'అట్లా చల్లగాలికి మెయిన్ రోడ్ దాకా వాకింగ్ కెళ్తే! జస్ట్ హాఫెనవర్. మమ్మీ రాబోయేది సాయంత్రం ఆరుక్కదా!'

నిత్య ఇక ఆలోచించలేదు. పర్స్ తీసుకుని ఇంటికి తాళం పెట్టి బయలుదేరింది. లీలావతి ఇంటి మీదుగా పోకుండా దారి





మార్చింది.

చల్లని సాయంత్రంలా వున్న ఆ మధ్యాహ్నంవేళ అట్లా ఒంటరిగా రోడ్డంట నడుస్తుంటే... గమ్మత్తుగా వుందామెకు.

ఓ పది నిమిషాల వాక్ తర్వాత బైపాస్ రోడ్ వచ్చింది. రోడ్డెక్కి నాలుగడుగులు వేసిందో లేదో మొదలైంది సన్నటి తుంపర. ఒక్కొక్క చినుకూ ఒయాసిస్సులా ఒంటిని తాకుతోంది. మనసు ఎడారంతా ఖర్జూరపు చెట్లతో నిండిపోతోంది. చిటపట చినుకులు కాస్తా... జోరందుకున్నాయ్.

నిత్య... మనసులోని ఖర్జూరపు చెట్ల కింద నుంచీ కదిలి... రోడ్ పక్కనున్న ఐస్‌క్రీం పార్లర్‌లోకి దూరింది.

'వర్షంలో ఐస్ క్రీం... ఫెంటాస్టిక్' అనుకుంది.

ఐస్ క్రీం చప్పరిస్తూ తిరిగీ... ఒయాసిస్సు ఒడ్డున ఖర్జూర వృక్షపు మొదలు నానుకుని కూర్చుంది.

లాంతర్లు పట్టుకున్న కార్నివాల్ ఒకటి ఒయాసిస్సు వైపు కదలివస్తోంది. రాను రాను... అది దగ్గరవుతోంది.

మరీ దగ్గరగా... మరింత దగ్గరగా... అవి లాంతర్లు కావు... పెట్రోమాక్స్



లైట్లలా కాంతిమంతంగా వున్నాయి.

ఆ కాంతికి నిత్య కళ్ళు చెదిరాయి. కనురెప్పలు రెపరెపలాడిస్తూ పరీక్షగా చూసింది. అవి నిత్య కూర్చున్న టేబుల్ కి అటువైపు... నిత్యకి ఎదురుగా కూర్చుని... ఐస్క్రీమ్ తింటున్న వ్యక్తి తాలూకు కళ్ళు. "హాయ్" అన్నాయా కళ్ళు.

"హలో" అంటూ బదులిచ్చాయి నిత్య కళ్ళు.

కళ్ళతో కళ్ళకు పరిచయమైంది. ఐస్క్రీం తిన్నాక బిల్ పేచేసి బయట కొచ్చింది. వర్షపు జోరు తగ్గలేదు. నిత్య టైం చూసుకుంది. పన్నెండు. అంటే ఆమె ఇల్లు వదిలి గంటయ్యింది.

"మమ్మిగాని ఫోన్ చెయ్యలేదు గదా" నిత్యకు భయంగా అన్పించింది. మళ్ళీ టైం చూసుకుంది. ఆ బైపాస్ రోడ్ మీద ఒక్క రిక్షా లేదు. ఏదైనా ఒకటీ అరా ఆటో కనబడ్డా... ప్యాసింజర్స్ తో స్పీడ్ గా వెళ్తూ కనబడుతున్నాయ్. మరోసారి టైం చూసుకుంది.

"కాస్త ముందుకెళితే ఆటోస్టాండ్ వుంది" ఎప్పుడొచ్చాడో మరి. నిత్య వెనకే నిలబడి వున్నాడతను. నిత్య చప్పున వెనక్కి తిరిగి చూసింది. అంతవరకూ అతని కళ్ళు మాట్లాడాయి. ఇప్పుడు పెదవులు మాట్లాడుతున్నాయి. "స్టాండ్ కి వెళ్ళేలోగా తడిసిపోతారు. తీసుకోండి" గొడుగు ఆఫర్ చేశాడు.

నిత్య తటపటాయిస్తుంటే "నో ప్రాబ్లమ్. మీ అడ్రస్ ఇస్తే నేనే వచ్చి కలెక్ట్ చేసుకుంటా" అన్నాడు.

"ఓహో! అడ్రస్ కోసమా ఈ కటింగ్" అనుకుంది. మౌనంగా వర్షంలోకి చూస్తూ నిలబడింది.

ఓ నిముషం గడిచాక... అతని వంక చూసింది. గొడుగు పట్టుకుని వర్షంలోకి చూస్తూ నించుని వున్నాడతను.

తనవంక చూడకుండా వర్షంలోకి చూడ్డం నచ్చలేదు నిత్యకి.

అతన్నీ... అతని చేతిలోని గొడుగునీ మార్చి మార్చి చూసింది. అవునూ! గొడుగుంచుకుని అతనెందుకూ నిలబడ్డం!

నో డౌట్. తన కోసమే. మరి తన కోసం నిలబడ్డవాడు... వర్షాన్ని చూడ్డమెందుకూ! అనుకుంటుండగానే అతను చప్పున గొడుగు ఓపెన్ చేసుకుని వెళ్ళిపోయాడు.

వెళ్లిపోతున్న అతన్ని నిత్య నిరాశగా చూసి నిట్టూర్చింది.

ఆడపిల్ల కనబడితే చొంగ కార్చుకుంటూ ఏమడిగినా ఇచ్చేసే... అబ్బాయిల కథలూ... హీరోయిన్ల కోసం... అప్పులు చేసి మరీ... ఫైవ్ స్టార్ హోటల్స్ లో డిన్నర్లిప్పించే హీరోల సినిమాలూ...

ఒట్టి ట్రాష్.

సైట్ కొట్టటం... ఫ్రీ ఆఫ్ కాస్ట్... సో... చూస్తారు. బయట వర్షం. లోపల చలి... చలిలో ఐస్క్రీం... ఎదురుగా నులివెచ్చని చలిమంటలా అమ్మాయి. జస్ట్ చూపులతో చలికాచుకున్నాడు. అంతేగానీ వందరూపాయల గొడుగు వదులుకుంటాడా! అమ్మా!

'యూ... కంజూస్... ఇడియట్...' తిట్టుకుంటూ రోడ్డుమీదకొచ్చింది.

"కాస్త ముందుకెళ్తే ఆటోస్టాండ్ వస్తుంది" అతనన్న మాటలు గుర్తొచ్చాయి. న్నో... వర్షంలో తడవాలి... తడుస్తూ నడవాలి. నడుస్తుంటే పెట్రోమాక్స్ లైట్లలాంటి అతని కళ్ళు...

ఆ వర్షంలో... చలిలో వెచ్చగా వెంటాడుతున్నాయ్.









"సత్యం కాలేజ్‌లో చేరేదెటువంటి వాళ్ళు? డబ్బెక్కువై పరుపుల్లో... గోడల్లో దాచుకునేవాళ్ళు. నిన్ను అందులో చేర్పించ డమనేది మా తాహతుకు మించిన పనే. నలుగురూ వద్దన్నా వినకుండా... ఖర్చులు భరించలేమని తెలిసి కూడా... ఎందుకే చేర్పించాం నిన్నక్కడ? నీ తెలివితేటలు చూసి... పొంగిపోయేకదా... మీ నాన్న ఇంత భారం నెత్తిన వేసుకుంది. నువ్విట్లా చేస్తావని తెలుసుంటే అసలు... అసలు..." వసంత గొంతు జీరబోయింది.

"చదివి చదివి విసుగన్పించి... జస్ట్ ఒన్న వర్ మమ్మీ"

"జస్ట్ ఒన్నవరా? ఎంత తేలిగ్గా చెప్పావ్ నీతూ. ఒక్క నిముషం వేస్ట్ చేయకుండా చదవమని నేను చెప్తుంటే... ఒన్నవర్ వేస్ట్ చేసి పైన ఇంతేగదా అంటున్నావ్"

"కాస్త రిలాక్స్ అవ్వాలన్పించింది మమ్మీ"

"కోరిందల్లా తింటూ ఫ్యాను కింద కూర్చుని చదవడానికి విసుగు. రిలాక్సేషన్లూ... రిక్రియేషన్లూ కావాలి నీకు. ఎండనకా వాననకా నీ కోసం... నీ చదువు కోసం అహర్నిశలూ శ్రమించే మాకు మాత్రం రిలాక్సేషన్ అక్కర్లేదు నీతూ! నువ్విట్లాగే చేస్తుంటే... నేనూ ఓ రోజు రిలాక్సవుతా, చూస్తూ వుండు"

'హాచ్..' తుమ్మింది నిత్య.

"వర్షంలో తడిశావుగా. బాగా తుమ్ము. జలుబు తెచ్చుకో, జ్వరం తెచ్చుకో... చద వడం మానేసి హాయిగా రెస్ట్ తీసుకో...." వసంత ధోరణి నిత్యకు కొత్తకాదు. అందుకే మౌనంగా వూరుకుంది. నిత్య లేనప్పుడు రెండుసార్లు ఫోన్ చేసింది వసంత. రెస్పాన్స్ లేకపోవడంతో... చదవకుండా నిత్య నిద్రలో పడిందేమో అనుకుని... లంచ్ బ్రేక్‌లో ఇంటికొచ్చేసిందామె. పట్టుకె ళ్లిన లంచ్ బేగ్‌తో సహా.

ఇంటికి పెట్టిన తాళం చూసి హతాశురా లైంది. లీలావతినీ... మరో ఇద్దరు ముగ్గుర్నీ ఎంక్వైరీ చేసింది. ఏమీ తెలియ కపోవడంతో వరండాలో కూర్చుని ఎదురుతెన్నులు చూడ్డం మొదలెట్టింది. వర్షంలో జల్సాగా తడుస్తూ కూనిరాగాలు తీసుకుంటూ వచ్చిన నిత్య తల్లిని వరండాలో చూసి గతుక్కుమంది.

"రెండుసార్లు ఫోన్ చేశాను. రెస్పాన్స్ లేకపోతే నువ్వు నిద్రపోతున్నావేమో లేపి కూర్చోబెడదామని వచ్చాను. అంతకుమిం చిన షాకే ఇచ్చావ్" అంటూ మొదలెట్టిన ఆమె కోపం... ఏడుపులోకి మారిపో యింది.

'ప్రామిస్ మమ్మీ. ఇంకెప్పుడూ ఇట్లా చెయ్యను. దీన్ని కాంపెన్సేట్ చెయ్యడానికి రాత్రి ఒన్నవర్ ఎక్స్ట్రా చదువుతాను' అని నిత్య మాటిచ్చాక ఆమెకు లంచ్ పెట్టి, తనూ ఏదో అయిందనిపించి ఆదరాబాద రాగా ఆఫీస్‌కి వెళ్లిపోయింది.

వసంత వెళ్లినవైపే చూస్తూ గాఢంగా నిట్టూర్చింది నిత్య. రిలాక్స్ అవడం కాదు కదా మెదడుకి ఇంకాస్త స్ట్రెస్ ఇచ్చిన ట్టయిందామెకు. నీరసంగా పుస్తకాలు ముందేసుకుని కూర్చుంది. దాదాపు గంట సేపు మేథ్స్ వర్కవుట్ చేసుకుంది. వెన్ను నొప్పిగా అన్పిస్తే ఒక్క క్షణం కుర్చీలో వెనక్కి చేరగిలబడి కూర్చుంది.

వర్షం వెలిసిపోయి... బంగారు తెరలా పరచుకుంది. లేత ఎండ ఇందాక కురిసిన వర్షపు జల్లులు ఆకుల చివర్లలో మెరుస్తూ కిటికీలోనుంచి కనబడ్డాయి. ఓ చినుకురాలి

# గోజీ బెర్రీ పళ్లలో అన్నీ అధికమే..!



క్యారెట్ల కంటే అధిక కెరోటిన్, ఆరంజి పళ్ళకంటే అధిక విటమిన్ 'సి', అత్యధిక యాంటీ ఆక్సిడెంట్ విలువలుగల ఆహారం ఒకే పండు రూపంలో లభ్యమవుతోందంటే... తెల్సుకోవాలన్న తహ తహ ఉంటుంది కదండీ ఎవరికైనా.. అవి గోజీ బెర్రీ పళ్ళు. ప్రపంచవ్యాప్తంగా 40 రకాలుగా ఈ పళ్లు లభ్యమవుతున్నా, టిబెట్, హిమాలయాల్లో లభించే గోజీబెర్రీ పళ్ళలోనే అత్యధిక పోషక విలువలు ఉన్నట్టు శాస్త్ర పరిశోధనల్లో తేలింది. అనాదికాలంగా ఈ పళ్లను వైద్యానికి వాడుతూనే ఉన్నారు. దాదాపు 60 రకాల పరిశోధనలు ఇప్పటికే గోజీబెర్రీ పళ్ళమీద నిర్వహించారు. అధిక యాంటీ ఆక్సిడెంట్ విలువలతో బాటు, అమైనో ఆమ్లాల సువాసనలు, విటమిన్ సి, ఇ, బి-కాంప్లెక్స్ పోషకాలు, అవసరమైన కొవ్వు ఆమ్లాలు, కంటి చూపుకు రక్షణనిచ్చే జియాగ్జాంతిన్- ఇలా ఎన్నోరకాల పోషకాలను తనలో నిల్వ ఉంచుకున్న గోజీబెర్రీ పండుని ప్రకృతి ప్రసాదిత వరంగా భావిస్తారెందరో. ఎండిన గోజీబెర్రీ పళ్ళని అలాగే తినొచ్చు లేదా జ్యూస్ తయారు చేసుకోవచ్చు... లేదా టీలో కలుపుకోవచ్చు. రుచితోబాటు సువాసన, ఈ రెంటితోపాటు ఆరోగ్యాన్నందించే గోజీబెర్రీ ఆరోగ్యఫలమని నిపుణుల అభిప్రాయం.

కాంతిరేఖలో కదిలిపోయి ఇంద్రధనుస్సు సృష్టిస్తూ ఆకాశంలో ఏడు రంగుల హోలీ చేస్తోంది.

ఫోన్ రింగయింది.

"మమ్మీనే చెక్కింగ్ కాల్" అనుకుంటూ వెళ్లి రిసీవ్ చేసుకుంది.

"చదూతున్నావా? "

"ఆc"

"ఫ్రిజ్ లో పనస తొనలున్నాయ్ తిను"

"ఆc"

"టైం వేస్ట్ చెయ్యకు. విషయం తెలుసుగా"

"ఆc"

ఫోన్ పెట్టేసింది వసంత. మళ్లీ కిటికీ వైపు తల తిప్పబోయి తమాయించుకుంది నిత్య.

"చదువుకో... టైమ్ వేస్ట్ చెయ్యకు... విషయం తెలుసుగా"

తనకు తను ఆటో సజెషన్ ఇచ్చుకుని చదవడంలో పడింది.

సాయంత్రం వసంత వచ్చేసరిక్కూడా అక్కడే కూర్చుని చదువుతోంది నిత్య.

ఆ రాత్రి... వసంతకిచ్చిన మాట ప్రకారం ఒక గంట ఎక్కువ చదివి ఒంటిగంటకు పడుకొంది.

నిద్రలో కల ఈసారి ఒక్క రాధిక కాదు... వందమంది రాధికల శవాలు... వంద ఫ్యాన్ల నుండి వేళ్లాడుతూ కనబడ్డాయి.

కెవ్వున అరిచి లేచి కూర్చుంది నిత్య.

★ ★ ★

దివాకర్‌కి నాల్రోజులు ఆఫ్ దొరికింది. నిత్య చదువు సంధ్యలన్నీ అతను పర్యవేక్షిస్తుండడంతో వసంత నిశ్చింతగా ఆఫీస్‌కి వెళ్తోంది. చూస్తుండగానే నిత్య వచ్చి వారం గడిచిపోయింది. రేపే హాస్టల్‌కి వెళ్ళిపోవాలి.

నిత్యకు రెండ్రోజులబట్టి అన్నం సయించడంలేదు. నీరసంగా ఉంటోంది. ఒళ్ళంతా నొప్పులు. తను లో ఫీవర్‌తో బాధపడుతున్నానని అర్థమైంది నిత్యకు. వసంతకు చెప్తే హైరానా పడిపోయింది.

దివాకర్... మెడికల్ రిప్రజెంటేటివ్ కాబట్టి... అతనే జ్వరానికేవో బిళ్ళలిచ్చాడు.



జ్వరంలో కూడా నిత్య చదువుకుంటూనే ఉంది. వసంత తృప్తిగా నిట్టూర్చింది.

ఆ రాత్రి నిత్య బట్టలన్నీ ఐరన్‌చేసి బ్యాగ్‌లో సర్దింది వసంత. నిత్య కిష్టమైన కారప్పూస చేసి... ఓ పెద్ద టిన్ను నిండా పోసి పెట్టింది.

"హాస్టల్లో గొడవల గురించి నువ్వేం పట్టించుకోకు. ఆల్వేస్ మనసును చదువు మీద లగ్నం చెయ్" జాగ్రత్తలు చెప్పాడు దివాకర్.

"టైమ్ వేస్ట్ చెయ్యకు. విషయం గుర్తుందిగా" ఎప్పటిలా చూయింగ్‌గమ్ డైలాగ్ వచ్చింది వసంత నోటివెంట.

నిత్య అన్నిటికీ తలూపింది. ఎప్పట్లా ఆరోజు కూడా పన్నెండుదాకా చదువుకుంది. లైటార్పి పడుకుందిగాని నిద్ర పట్టలేదు. ఆమె తన గదిలో ఒంటరిగా పడుకొని ఉంది.

వెండి ధారలా వెన్నెల కురవడం కిటికీ లోంచి కనబడుతోంది. మంద్రంగా వీచే గాలి చప్పుళ్ళు స్పష్టంగా విన్పిస్తున్నాయి. నిద్రపట్టని నిత్య లేచింది. డ్రాయర్‌లోంచి డైరీ తీసింది.

వెన్నెలేటి ఒడ్డున వెండి ఇసుకతో పిచ్చుక గూళ్ళు కట్టాలి. నక్షత్ర దీపాలతో దాన్ని అలంకరించాలి. చందమామతో కలిసి గుజ్జనగూళ్ళు ఉండాలి. మేఘాలతో పడవలు చేసి... వెన్నెలేటి పాయల్లో వదలాలి.

రాస్తూ... రాస్తూ... అట్లాగే నిద్రలోకి జారిపోయింది.

నిద్రలో మళ్ళీ కల... ఈసారి వందలు కాదు... వేలమంది రాధికల శవాలు... వేళ్ళాడుతూ కన్పించాయి.

★ ★ ★

అలారం మోతకు వసంతతో పాటు లేచిన దివాకర్... "ఓ అరగంటాగి లేపు" అంటూ మళ్ళీ పడుకున్నాడు.

వసంత మాత్రం లేచింది. నిత్యను లేపి కాసేపు చదివించి రెడీ చెయ్యాలి. ఆరోజు ఆరుగంటల బస్‌కి వెళ్తోంది నిత్య తండ్రి దివాకర్‌తో కల్సి. రేగిన జుట్టుని సవరించుకుని ముడివేసుకుంది వసంత. బెడ్‌రూమ్ తలుపు తెరుచుకుని హాల్లోకి వచ్చి... లైట్ స్విచ్ వేసింది.

గుప్పుమంటూ వెలిగింది లైటు. ఆ కాంతికి ఒక్కసారి కళ్ళు చిట్లించి ముందుకు నడవబోయిన వసంత... కొయ్యబారిపోయింది. హాలంతా ఎటు చూసినా ఇసకా... రాళ్ళూ... వెదజల్లబడి ఉన్నాయి. ఎవరో కావాలని పనిగట్టుకుని పోసినట్టుగా ఉందక్కడ. అంతేకాదు కుర్చీలూ... సోఫా తిరగబడిపోయి ఉన్నాయి. టీవీ స్టాండ్‌లో లేదు. నేలమీద ఉంది. రిసీవర్ ఫోన్‌నుండి వేళ్ళాడుతోంది.

ఒక్క పరుగున వెళ్ళి భర్తను లేపింది.

నిద్రమత్తులో ఆమె చెప్పింది అర్థంకాక... విసుక్కుంటూ హాల్లోకి వచ్చిన దివాకర్‌కి మత్తు వదిలిపోయింది.

"మైగాడ్... ఏంటిది?" ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేస్తూ అన్నాడతను. ఏదో అనబోతున్న వసంత మాట మింగేసి... నిత్య గదివైపు గబగబ వెళ్ళింది. నిత్యకేమైందోనన్న ఆత్రుతతో.

లోపల బోల్ట్ పెట్టని తలుపులు వసంత తొయ్యగానే తెరుచుకున్నాయి.

బెడ్‌మీద నిత్య లేదు.

గుండె ఝల్లుమందామెకు. వెనకాలే వచ్చిన దివాకర్‌తో "ఏమండీ... నీతూ" అంది బెంబేలెత్తిపోతూ...

"మేడపైన చదువుకుంటోందేమో!" తనలో తను అనుకుంటూ... చకచకా మేడ మెట్లెక్కిపోయాడు. అతన్ని అనుసరించింది వసంత. మేడమీద కూడా లేదు నిత్య. ఇంకా వెలుగురేఖలు పరచుకోని మేడ చీకట్లో నిశ్శబ్దంగా ఉంది.

"నీతూ!" నిశ్శబ్దాన్ని చీలుస్తూ పిల్చాడు

బదులు రాలేదు.

అంతవరకూ చిక్కబట్టుకున్న ధైర్యం జారిపోయింది దివాకర్‌కి. వసంతకైతే అప్పటికే కన్నీళ్ళు తన్నుకొస్తున్నాయ్. మేడమీంచి దిగి పెరట్లో చూశారు. బాత్‌రూమ్‌లో వెదికారు. నిత్యలేదు.

రాత్రి సర్దిన ట్రావెలింగ్ బేగ్ గుర్తుకొచ్చింది వసంతకు. అది ఆమె బెడ్‌రూమ్‌లో ఉంది. వెళ్ళి చూసిందిగాని... అది మాత్రం చెక్కుచెదరకుండా అక్కడే ఉంది.

"నీతూ అండీ... మన నీతూ ఎక్కడికెళ్లిందండీ" వసంత గొంతు వణుకుతోంది.

ఇంట్లోపడిన ఇసకా రాళ్ళూ ఇప్పుడు వాళ్ళ మనసుల్లో లేవు. నిత్య మాత్రమే ఉంది.

"కిచెన్‌లో చూశావా? " ఉన్నట్టుండి అడిగాడు దివాకర్.

అతనట్లా అనగానే బాణంలా వంటింటివైపు పరిగెత్తిన వసంత గుమ్మం దగ్గరే ఆగిపోయి గుండె గోడలు వణికేలా ఒక్కటే కేక పెట్టింది.

ఒక్క వుదుటన వెళ్ళిన దివాకర్‌కి... కిచెన్ సీలింగ్ నుండి వేళ్ళాడుతున్న ఫ్యానుకి ముడివేసిన నిత్య చున్నీ కనబడింది.

చున్నీ ఒక కొస ఫ్యానుకు కట్టేసి వుంది. రెండో కొస మెడకు తగిలించుకునేందుకు వీలుగా ముడివేయబడి వుంది గాని... నిత్య ఉరి పోసుకోలేదు. నేల మీద స్పృహ లేకుండా పడివుంది. వసంత నిత్య ముఖం మీద నీళ్ళు చిలకరించి... ఆదుర్దాగా పిల్చింది, "నీతూ... తల్లీ నీతూ..."

వసంతని హడావుడి చెయ్యొద్దని సైగ చేసి... నిత్య ముఖంమీద ఇంకాసిని నీళ్ళు చల్లాడు దివాకర్. నిత్య కనురెప్పల్లో చలనం వచ్చింది. అతను మూడోసారి నీళ్ళు చల్లగానే కళ్ళు విప్పింది నిత్య.

ఆదుర్దాగా తన ముఖంలోకే చూస్తున్న తల్లిదండ్రుల్ని ఆశ్చర్యంగా చూస్తూ... ప్రయత్నం మీద లేచి కూర్చుంది.

"ఏమైంది డాడీ?"

కిచెన్ పక్కనే వున్న తమ బెడ్‌రూమ్‌లోకి తీసికెళ్ళి కూర్చోబెట్టాక అడిగింది వసంత.

"ఎందుకు చేశావీ పని? " కఠినంగా వుందామె గొంతు.

"ఏ పని? " అయోమయంగా చూసింది నిత్య.

వసంత దివాకర్‌వైపు చూసి, "మీ కూతురికి చేసిన పని గుర్తుకు రావడంలేదట" అంది.

వసంత వెటకారం అర్థమైంది నిత్యకు. "ఓ... అదా...సారీ మమ్మీ, నువ్ లేపుతావనుకున్నా. మెలకువ రాలేదు. ఇప్పుడు వేస్టయిన టయాన్ని రాత్రికి కవర్ చేస్తాగా" అంది.

నిత్య ఉదయాన్నే లేచి చదవలేకపోవటం గురించి మాట్లాడుతోంది. వసంతకు చిర్రెత్తుకొచ్చింది. ఆమె కళ్ళముందు వంటింట్లో ఫ్యాన్నుండి వేళ్ళాడుతున్న చున్నీ కదలాడింది.

"ఏం నాటకాలాడుతున్నావ్ నీతూ! మేం నీకేం తక్కువ చేశామనీ... ఇంత అఘాయిత్యానికి ఒడిగట్టావ్? వేలకువేలు తగలేసి మరీ నిన్ను చదివించేది.. నువ్వు ఉరిపోసుకు చావటానికా? ఏమైంది నీ చదువూ సంస్కారం? "

వసంత అంటున్నదేమిటో నిత్యకు ఒక్క ముక్కా అర్థం కాలేదు. దీనంగా దివాకర్ వైపు చూసింది.

"నువ్వు రాత్రి వంటింట్లో ఫ్యానుకి ఉరి వేసుకోబోయావ్" చెప్పాడు దివాకర్ సూటిగా నిత్య కళ్ళలోకి చూస్తూ.

బెడ్‌మీంచి స్ప్రింగ్‌లా లేచింది నిత్య. రెండు చేతుల్ని గుండెల మీదుంచుకుని కళ్ళింతచేసి చూసింది. "నేనా... ఉరి పోసుకోవడమా? ఏమంటున్నారు డాడీ? ఉరిపో







సుకునే ఖర్మ నాకేంటి? "

నిత్య మాటల్లో సిన్సియారిటీకి దివాకర్ భ్రుకుటి ముడిపడింది.

దురుసుగా ఏదో అనబోతున్న వసంతను వారించి నిత్యతో అన్నాడు.

"నిజంగా నీకేం తెలీదా నీతూ? "

"నాకేం తెలీదు డాడీ... ప్రామిస్" తల మీద చెయ్యి పెట్టుకుంది నిత్య. దివాకర్ నిత్య చెయ్యిపట్టుకుని వంటింట్లోకి లాక్కెళ్ళాడు. అక్కడి దృశ్యం చూసిన నిత్య అవాక్కయిపోయింది.

"మైగాడ్... అది... నా చున్నీ. అక్కడెందుకుంది? " నిత్య కళ్ళు ఆశ్చర్యంతో, భయంతో రెపరెపలాడాయి. ఆమె ముఖంలోని ఎక్స్‌ప్రెషన్స్ చూశాక వసంత కూడా ఒక్క క్షణం ఆలోచనలో పడింది.

"నిజంగా నీకేం తెలీదా? " ఇందాక దివాకర్ అడిగినట్టే అడిగింది.

"ప్రామిస్ మమ్మీ... నాకేం తెలీదు"

"సరే... నువ్వెళ్ళి...ఫ్రెషప్ కా" చెప్పాడు దివాకర్.

అతని ఆలోచనలిప్పుడు హాల్లోని బీభత్సం మీదకు మళ్ళాయి.

"అమ్మో... అయిదున్నరయింది. ఎస్, ఆరుకే కదూ" అంటూ వెళ్ళబోతున్న నిత్యతో దివాకర్ అన్నాడు, "ఇవాళొద్దు... రేపెళ్దాం".




"మమ్మీ... స్నఫ్ కలర్ డ్రెస్ కూడా బ్యాగ్‌లో సర్దేశావా? " స్నానానికి వెళ్ళబోతూ అడిగింది నిత్య.

"పెట్టానేమో... చూసుకో" అంది వసంత వంటింట్లోంచి.

"ప్రయాణం చేసేప్పుడు... ఆ డ్రెస్ హాయిగా వుంటుంది" అంటూ నిత్య... బేగ్ జిప్ తెరిచింది. పైనే కనబడిందది.

డ్రెస్ తీసుకుని భుజాన వేసుకోబోతూ... అనుమానంగా దానికేసి చూసింది. ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవయ్యాయి. డ్రెస్ మొత్తం కత్తిరించబడి వుంది. ఎక్కడిదక్కడ వూడిపోతోంది.

"మమ్మీ" కంగారుగా పిల్చింది.

"ఏంటీ... వస్తున్నా... టయమైంది త్వరగా రెడీకా" అంది వసంత.

బేగ్‌లోని మిగతా డ్రెస్‌లన్నీ చకచక బయటకి తీసింది నిత్య. మొత్తం అన్నిటి పరిస్థితీ అదే...

"చక్కగా సర్దిన బట్టలన్నీ అట్లా చేస్తున్నావేం నీతూ" అంటూ వచ్చిన వసంత నిశ్చేష్టురాలైంది.

అవే కాదు... గాడ్రెజ్ అల్మారాలో వసంత చీరెలూ... దివాకర్ బట్టల పరిస్థితి కూడా దాదాపుగా అంతే. నిన్న ఇల్లంతా పరుచుకున్న ఇసకా రాళ్ళ గురించే తలబద్దలు కొట్టుకుంటుంటే... ఇదేం విపరీతమో అర్థం కాలేదు. దిగాలుగా గోడకానుకుని నిలబడ్డ వసంత మనసులో తెలియని భయం చొరపడింది.

"ఇది దయ్యాల పనేమోనండీ"

"ఎడ్యుకేటెడ్ అయ్యుండీ... మనమట్లా ఆలోచించవచ్చా? "

"మరి వేసిన తలుపులు వేసినట్టే వుండగా ఇంట్లో ఇసకా, రాళ్ళూ పడ్డమేంటీ... బట్టలకు ఈ గతి పట్టడమేంటీ? " వసంత ప్రశ్నకు జవాబు లేదు దివాకర్ దగ్గర.

ఆ రోజు కూడా నిత్య ప్రయాణం వాయిదాపడింది. వసంత సెలవు పెట్టేసింది. జరిగిన దారుణం గురించి ఆ రోజంతా

'వస్త్రం' మానవుని నాగరికతకు చిహ్నం

ఆకర్షణీయమైన వస్త్రధారణ
అందాన్ని పెంచుతుంది, ఆనందాన్ని పంచుతుంది,
సమాజంలో మనకు ఒక మంచి గుర్తింపునిస్తుంది.

**క్షణం క్షణం మారుతున్న నేటి నాగరికతకు అనుకూలంగా**
**రూపుదిద్దుకున్న వస్త్రాలయం... మా మెగా**

# కారొనెట్ జెంట్స్ ఎ.సి. వస్త్రనిలయం

వివాహాది శుభకార్యాలకు
ప్రపంచ ప్రసిద్ధిగాంచిన ప్రముఖ
మిల్లుల సూటింగ్స్ & షర్టింగ్స్
ఎన్నో మరెన్నో రకాల పసందైన
రంగులలో సరసమైన ధరలతో...



ఇక ఆలస్యమెందుకు ఒకసారి
మా వస్త్రాలయమునకు విచ్చేయండి.
గొప్ప అనుభూతిని, ఆనందాన్ని
పొందండి. మీ సంతృప్తియే
మా లక్ష్యం... మాగమ్యం

EXACT 2

**100% కాటన్**
**సూటింగ్స్ & షర్టింగ్స్**
**మా ప్రత్యేకత**

EXACT 1

ప్రొ॥ రేపాల హరిశంకర్

# కారొనెట్

మెగా జెంట్స్ ఎ.సి. షోరూం
& సెలక్షన్స్

చౌరస్తా, హన్మకొండ, వరంగల్ జిల్లా. ఫోన్: 0870-2577538



భార్యాభర్తలిద్దరూ గంటలు గంటలు చర్చిం చుకుంటూనే వున్నారు.

ఆ సాయంత్రం... నిత్య హాస్టల్‌కి ఫోన్ చేసి కల్పనతో మాట్లాడింది. తను మొన్ననే హాస్టల్‌కి వచ్చేసిందనీ... హాస్టల్ బిల్డింగ్‌కి సున్నాలు వేయించి శాంతి పూజలు చేయిం చారనీ... హాస్టల్ కేంపస్‌లో అడుగడుక్కీ ఓ లైట్ వేయించారనీ చెప్పింది. కాపలా ఎక్కువ చేశారని కూడా చెప్పింది.

త్వరగా వచ్చెయ్... సిలబస్ మిస్సవుతా వంటూ సజెస్ట్ చేసింది కల్పన.

నిత్య వసంతతో చెప్పేసింది "మమ్మీ... రేపిక ఆగే ప్రశ్నే లేదు. సిలబస్ రన్నిం గ్‌లో ఉందక్కడ."

వసంత షాపింగ్ చేసి... ఓ అరడజను డ్రెస్‌లు పట్టుకొచ్చింది నిత్యకు.

నిత్యను ఆ రాత్రి ఒంటరిగా పడుకోని వ్వలేదు.

★ ★ ★

ఎవరో తట్టి లేపినట్టు లేచి కూర్చుంది... వసంత పక్కనే పడుకుని ఉండాల్సిన నిత్య లేదు. బాత్‌రూమ్ కెళ్లిందేమోనని ఓ అయిదు నిముషాలు వెయిట్ చేసింది. రాలేదు నిత్య.

వాల్ క్లాక్‌కేసి చూసింది. మూడు కావస్తోంది.

వసంత లేచి బాత్‌రూమ్ తలుపు తట్టింది. తట్టాక గమనించిందామె. అది బయట నుండే బోల్ట్ వేసుం దని. తలుపు తెరిచి లోపలికెళ్లింది. లోపల ఎవరూ లేరు. ఆ బాత్‌రూ మ్‌కి అటునుంచి మరో తలుపుంది. అది తీస్తే... నిత్య బెడ్ రూమ్‌లో కెళ్ళొచ్చు. రెండు బెడ్ రూములకీ కామన్ బాత్‌రూమ్ అది.

ఒకవేళ నిత్య నిద్రలో లేచి తన బెడ్ రూంలోకి వెళ్ళి పోయిందేమోననుకుని... ఆ తలుపు లాగింది వసంత. అటునుంచి బోల్ట్ పెట్టని ఆ తలుపు వెంటనే తెరుచు కుంది. నిత్య బెడ్ రూం చీకటిగా ఉంది, లైట్ స్విచ్చాన్ చేసింది వసంత. బెడ్ ఖాళీగా ఉంది. ఆమె భ్రుకుటి ముడిప డింది. ఒకవేళ హాల్లో సోఫాలో పడుకుందే మోనని చూసింది. అక్కడా లేదు. వంటింట్లో కూడా వెదికి బెడ్ రూమ్‌లో కొచ్చింది. నిత్య జాడ లేదు. అప్పటికే ఆమె నుదురంతా చెమటతో తడిసిపోయింది.



నిన్నా మొన్న జరిగిన సంఘటనలు మన సులో కదలాడుతుంటే... కంగారుగా భర్తను లేపింది.

దివాకర్ నిద్ర మత్తు ఎగిరిపోయింది. వసంత వెదికిన చోటల్లా మళ్లీ వెతికాడు

దివాకర్. పెరటి తలుపు తీసి చూశాడు. అంతటా నిశ్శబ్దం. నిత్య లేదు.

మళ్లీ తలుపు మూసి లోపలికొస్తుంటే... గుమ్మంలోంచి వినబడింది వసంత గొంతు నెర్వస్‌గా. దివాకర్‌ని పిలుస్తోందామె.

పరిగెత్తినట్టువెళ్లాడు.

మెయిన్‌డోర్ అవతల మెట్లమీద బోర్లా పడి ఉంది నిత్య. పెద్దగా ఏడవబోతున్న వసంతను నిశ్శబ్దంగా ఉండమని సైగ చేసి కూతుర్ని రెండు చేతుల్తో ఎత్తుకొచ్చి బెడ్ మీద పడుకోబెట్టాడు దివాకర్.

"ఏమండీ నిత్య బట్టలమీద ఆ మరకలు..." వణికి పోయింది వసంత.

దివాకర్‌కి అర్థమైంది. డ్రెస్ మొత్తం చల్లినట్లుగా ఉన్నాయి రక్తపు చుక్కలు. దివాకర్‌ని చుట్టేసి బావురుమంది వసంత.

★ ★ ★

"ఈ ఇంట్లో దయ్యం ఉంది"

వీధి గుమ్మం మీద నెత్తుటితో తల్లకిందులుగా కన్పిస్తున్న ఆ అక్షరాల్ని... చుట్టుపక్కల వాళ్లొచ్చి ఆసక్తిగా చూసిపోతున్నారు. అందరికంటే ముందు చూసింది లీలావతి. ఇక వార్త దావానలంలా వ్యాపించింది ఆ







కాలనీ మొత్తానికి. ఇళ్లు దూరంగా ఉన్నా వార్త... దగ్గర చేసింది అందర్నీ.

"ఎవరో గిట్టని వాళ్ళు చేశారా పని దెయ్యమా... గియ్యమా" అన్నారు కొందరు.

"సరేలే... వారం రోజుల్నుండీ... ఈ ఇంట్లో వింతలు జరిగి పోతున్నాయట" ఇంకొందరు అన్నారు.

దివాకర్నీ, వసంతనీ... ఎవరెవరో ఏమేమో అడుగుతున్నారు. అందరికీ దివాకర్ ఒక్కటే మాట చెప్తున్నాడు, "అది ఎవరో చేసిన ఆకతాయి పని"

ఉదయం పదకొండింటి వరకూ వాళ్ళు... వీళ్లు వచ్చి చూస్తూనే ఉన్నారు.

టౌన్ ఎక్స్‌టెన్షన్ ఏరియాలో స్థలాలు

**పొదుపు చేసుకున్న డబ్బుతో, స్థలం మీద తీసుకున్న లోనూ... ఆఫీసులో తీసుకున్న లోనూ కలిపి టు బెడ్ రూమ్డ్ హౌస్ క్రితం సంవత్సరమే కట్టుకొన్నారు. ఆ అప్పులింకా తీరుస్తూనే ఉన్నారు. అంత కష్టపడి కట్టుకున్న ఇంట్లో... జరిగే ఈ సంఘటనలు చూస్తుంటే... మతి పోతోంది దివాకర్‌కి.**

చవగ్గా ఉంటే... రెండేళ్ళ క్రితమే కొన్నారా ముప్పయి మూడున్నర అంకణాల ప్లాట్ ని. పొదుపు చేసుకున్న డబ్బుతో, స్థలం మీద తీసుకున్న లోనూ... ఆఫీసులో తీసుకున్న లోనూ కలిపి టు బెడ్ రూమ్డ్ హౌస్ క్రితం సంవత్సరమే కట్టుకొన్నారు. ఆ అప్పులింకా తీరుస్తూనే ఉన్నారు. అంత కష్టపడి కట్టుకున్న ఇంట్లో... జరిగే ఈ సంఘటనలు చూస్తుంటే... మతి పోతోంది దివాకర్‌కి. వసంతయితే ఏడుస్తూనే ఉంది.

ఆ రోజెవరూ భోంచెయ్యలేదు. నిత్య హాస్టల్ ప్రయాణం మాటే ఎత్తలేదు. అసలు నిత్యని చదుకోమని కూడా చెప్పలేదు వసంత.

జరుగుతున్న సంఘటనల్నే పదే పదే తల్చుకుంటూ నిస్సత్తువగా కూర్చుండిపోయారు, ఎక్కడి వాళ్లక్కడ.

వసంత పరిస్థితిని గమనించి... దివాకర్ ఆ రాత్రికి భోజనం హోటల్నించి తెచ్చాడు. వసంతనీ... నిత్యనీ... బుజ్జగించి తినిపించి తనూ తిన్నాడు. అంతా కాస్త తేరుకున్నారు.

తల్లి చెప్పకపోయినా... ఆ రోజు రాత్రి పదకొండుదాకా చదువుకుంది నిత్య. నిత్య వచ్చి పడుకున్నాక... వసంత అడిగింది. "నీతూ మీ హాస్టల్ గది తలుపుమీద ఇట్లాగే రక్తంతో తల్లకిందులుగా రాశారన్నావ్ కదూ!"

"అవును మమ్మీ... అది మాత్రం పోకిరీ పనే" నిత్యకింకా దెయ్యం ఉనికి మీద నమ్మకం కలగడం లేదు.

"అయితే ఈ పని? " అడిగింది వసంత.

"ఇది కూడా పోకిరి పనే" నిత్య చెప్పింది.

"మరి... ఇంట్లో జరుగుతున్న సంఘటనలు? "

తల్లి ప్రశ్నకు బదులివ్వలేనట్టూ మౌనంగా ఊరుకుంది నిత్య.

ఆ రాత్రి నిత్యను తెల్లవారుజామున స్టడీస్‌కి కూడా లేపకుండా అలసిపోయి ఆదమరచి నిద్రపోయింది వసంత.

ఆరు గంటలకి పాలమ్మాయ్ బెల్ కొడితే మెలకువ వచ్చింది వసంతకి. తల్లిమీద చెయ్యి వేసుకుని గాఢంగా నిద్ర పోతోంది నిత్య.

ఆమె చేతిని సున్నితంగా తొలగించి బెడ్ రూంలోంచి హాల్లోకి వచ్చింది. కిచెన్‌లోకెళ్ళి గిన్నె తీసుకుని మెయిన్ డోర్ తెరిచి పాలు పోయించుకుంది వసంత. అప్పుడప్పుడే...

ఉదయిస్తున్న సూర్యకిరణాలు తెరిచిన గుమ్మంలోంచి.. హాల్లోకి పరుచుకుంటు న్నాయి. పాలగిన్నె పట్టుకుని... ఇటు తిరి గిన వసంత కళ్ళు... హాలంతా చిందరవం దరగా పడివున్న కాగితాల మీద పడ్డాయి.

పాలగిన్నె పక్కనపెట్టి వంగి ఓ కాగి తాన్ని అందుకుంది. తలకిందులుగా రాయ బడిన ఎర్రటి అక్షరాలు.

నిత్య నాక్కావాలి.

వెన్ను ఝల్లుమంటుండగా మరో కాగి తాన్ని అందుకుంది.

రా... హాస్టల్ కి... రా...

మరో కాగితం అందుకుంది. నిన్ను వదల్ను... నాతో తీసుకుపోతా...

ఇంకో కాగితం అందుకుంటుండగానే వసంత కళ్ళు తిరిగినట్టయి నేలమీద దబ్బున పడిపోయింది.



"ఖచ్చితంగా... ఆ హాస్టల్లో తిరుగాడే దెయ్యమేనే వసూ! మన పిల్ల వెనకబడి వచ్చినట్టుంది"

సౌభాగ్యమ్మ తేల్చి చెప్పేసింది. సౌభా గ్యమ్మ వసంత తల్లి. దివాకర్‌కి డ్యూటీ పడ్డంతో... ఒంటరిగా నిత్యతో వుండాలంటే భయమేసి తల్లిని పిలిపించుకుంది వసంత. ఆమెతోపాటూ వసంత తమ్ముడు నందగో పాల్ కూడా వచ్చాడు.

వసంత ఆఫీస్‌కి లాంగ్ లీవ్ పెట్టేసి...ని త్యను అంటి పెట్టుకునే వుంటోంది. కిచె న్‌లో... ఉరేసుకోబోయిన సంఘటనా... గుమ్మంలో నేలమీద బొక్కబోర్లా పడివున్న నిత్య రూపం... ఆమెను కుదిపేశాయి.

కాగితాల మీద పిచ్చిరాతలు.. చూశాక... నిత్యను ఒక్కక్షణం కూడా వదిలి వుండకూ డదని గట్టిగా నిర్ణయించుకుంది. తల్లీ తమ్ముడూ మేం చూసుకుంటాం ఆఫీస్‌కి వెళ్ళమన్నా ఆమె వెళ్ళలేదు.

వచ్చిన రోజే సౌభాగ్యమ్మ నిత్యని కూర్చో బెట్టుకుని హాస్టల్లో జరిగిన సంఘటలన్నీ ఆరా తీసింది. అంతా విన్నాక... ఆమె హాస్టల్లో దెయ్యమే నిత్య వెంటబడి ఇంటికి వచ్చేసిందని తేల్చేసింది.

"ఇదే ఒక దయ్యమైతే... దీనికో ఫ్రెండా?" నందగోపాల్ నిత్యని ఆట పట్టించాడు.

"చూడు మమ్మీ... నందూ మామయ్యా" అంటూ గారాలు పోయింది నిత్య.

"అయితే చదువు కొండెక్కినట్టేనా?" అడి గాడు నందూ.

"లేదు... లేదు...ఇంట్లో ప్రిపేరవుతోంది. మీ బావగారు కరస్పాండెంట్‌తో మాట్లాడి వచ్చారు. అమ్మాయికి ఆరోగ్యం బాగాలే దనీ.. హోమ్‌స్టడీ చేస్తుందనీ చెప్తే వాళ్ళు సరేనన్నారు. నిత్యకి ఇంటి దగ్గర ఓ ట్యూటర్ని కూడా పెట్టాం. ఎగ్జామ్‌కి ఖచ్చి తంగా అప్పియరవుతుంది" చెప్పింది వసంత.

నిత్య నందూకేసి గర్వంగా చూసింది. "నేన్నీలాగా బడిదొంగననుకున్నావా?"

నందూ అయిదేళ్ళక్రితమే.. ఇంటర్ ఫెయిలై... చదువుకి గుడ్‌బై చెప్పి వూళ్ళో వ్యవసాయం చేసుకుంటున్నాడు. పొలం కూడా పెద్దగా ఏం లేదు. మూడెకరాల మాగాణి...రెండెకరాల మెట్టా వుందంతే... ఆ మాగాణిలో ఓ ఎకరం పెళ్ళప్పుడు వసంత పేర్న పెట్టేశారు. దానిమీద వచ్చే రాబడిని నందూ నిత్య పేరుమీద బ్యాంక్‌లో వేస్తున్నాడు. ఏడాదికి సరిపడా బియ్యం పంపిస్తారు వసంతకి. నందూకింకా పెళ్ళి కాలేదు. సంబంధాలు చూస్తున్నారు.







"ఇంట్లో శాంతి చేయిస్తే మంచిది" అంది సౌభాగ్యమ్మ. వసంతకు ఆ ఆలోచన నచ్చింది.

నిత్య మాత్రం ముఖం అయిష్టంగా పెట్టింది. "సిల్లీగా వుంటుంది మమ్మీ? " అంది.

"దెయ్యం తన అభిప్రాయాన్ని చెప్పింది" అన్నాడు నందూ.

"చంపుతా" అంది నిత్య.

"నీ ఫ్రెండ్‌ని చంపు" ఆటపట్టించాడు నందూ.

"నిన్నూ" అంటూ నిత్య మీదకి రాబోయింది. నందూ అక్కడ్నుంచి పారిపోయాడు.

ఆ రాత్రి... వద్దంటున్నా వినిపించుకోకుండా చల్లగాలి కావాలంటూ ఒంటరిగా మేడపైకి వెళ్ళి పడుకున్నాడు నందగోపాల్.

"ప్చ్.. వీడికి ఆషామాషీగా వుంది" వసంత నిట్టూర్చింది.

ఉదయం లేచి కిందికి వచ్చి చదువుకుంటున్న నిత్యతో అన్నాడు, "నీ ఫ్రెండొస్తే లైనేద్దామనుకున్నా... ప్చ్ రాలేదు"

"నువ్వంటే దానికి డోకు" అంది నిత్య.

నిత్య తలమీద గట్టిగా మొట్టి... దొరక్కుండా పెరట్లో కెళ్ళిపోయాడు.



సౌభాగ్యమ్మ, నందు వచ్చాక... మూడు రోజులు సజావుగానే గడిచాయి. వసంత మనసు కాస్త స్థిమితపడింది.

నిత్య ఒక్క క్షణం వృథా చెయ్యకుండా చదువుకుంటోంది.

"అమ్మనుంచేసి నే వెళ్తానక్కా.. పొలాలకి నీళ్లు పెట్టడం నాన్న ఒక్కడివల్ల అయ్యేపని కాదు" అన్నాడు నందూ.

"ఇంకో రెండు రోజులుండరా నందూ... మరీ అందరం ఆడాళ్ళమే" అంది వసంత కాస్త భయంగా.

"ఏం కాదులే... శేఖర్ బాబాయ్ వున్నాడుగా. మీ నాన్నకు సాయం చేస్తాళ్ళే" అంది సౌభాగ్యమ్మ.

నందూ... అట్లా తిరిగొస్తానని బయటికి బయలుదేరాడు. వెళ్తుంటే నిత్య "మామయ్యా పాలకోవా తీసుకురావా" అంది.

"ఆవు పాలకోవానా? " కన్ను గీటాడు.

"అహ... గాడిద పాలకోవా" నిత్య కోపంగా అంది.

"మీ వూరి స్పెషలా... తెస్తాలే" అంటూ వెళ్ళిపోయాడు.



సౌభాగ్యమ్మ నేలమీద చతికిలబడి కత్తిపీట ముందేసుకుని కూరలు తరుగుతోంది.

"నందూకి... ఆ ఉలవపాడు సంబంధం ఖాయం చెయ్యకూడదూ... పిల్ల బాగుంది" అంది వసంత.

"ఈ వెధవాయికి నచ్చేడిస్తేగా" సౌభాగ్యమ్మ నిట్టూర్చింది.

"కొత్తపేటమ్మాయి? "

"నాకు నచ్చలేదు" ముఖం విరిచింది సౌభాగ్యమ్మ.

"బాగుంది వరస... వాడికి నచ్చితే... నీకు నచ్చదూ. నీకు నచ్చితే.. వాడికి నచ్చదూ. ఇక అయినట్టే ఈ నందూగాడి పెళ్లి" విసుగ్గా అని, "ఆ ముక్కలిట్లా ఇవ్వు" అంది వసంత సౌభాగ్యమ్మ తరిగిన వంకాయలకేసి చూస్తూ.

ముక్కలందించడానికని... సౌభాగ్యమ్మ నేలమీంచి లేవలేక అవస్థ పడుతుంటే "ఆగు, నే తీసుకుంటాలే" అంటూ తరిగిన వంకాయల్ని అందుకుని అంది వసంత.

"కూర్చుంటే లేవలేవు. లేస్తే కూర్చోలేవు. కోడల్ని త్వరగా తెచ్చుకుంటే... తిప్పలు తప్పుతాయిగా"

ఊళ్లో ఇంటెడు చాకిరీ చేసేది సౌభాగ్యమ్మే. అందుకే వసంత అట్లా అంది.

"కోడలొస్తుంటే నేనడ్డుపెడుతున్నానా ఏంటే... అది నట్టింట అడుగుపెట్టేరోజు రావద్దూ!" అంది.

# గేటెడ్ కమ్యూనిటీ ఇళ్లు

(ఖమ్మంలో ప్రప్రథమంగా)

గొప్ప అవకాశం



**మీ ఇల్లే మీ ధనం**

హుషారైన కమ్యూనిటీ జీవనం



★ యూరోపియన్ ఆర్కిటెక్చర్, వాస్తుకు అనుగుణంగా మార్చబడినది. ★ విశాలమైన రూమ్‌లు, ఆధునిక వసతులు ★ ఇండిపెండెంట్, డూప్లెక్స్ ఇళ్లు ★ విశాలమైన B.T. రోడ్లు ★ ఆట స్థలాలు, ఈత కొలను, ★ పిరమిడ్ మెడిటేషన్ సెంటర్, కమ్యూనిటీ హాల్ ★ దేవాలయం, తోట, ఇంటర్నెట్ కనెక్టివిటీ, బ్రౌసింగ్ సెంటర్ ★ 24 గం. నీరు వగైరా సౌకర్యాలు కలవు. ★ హై సెక్యూరిటీ, చెక్-ఇన్ ఎంట్రీ (చుట్టూ ప్రహరీ గోడ) ★ కమ్యూనిటీ జీవనానికి సరికొత్త భావన ★ మధ్య-ఆదాయ వర్గాలకు అందుబాటు ధర ★ సగర్వ యజమానికండి

■ వివరాలకు సంప్రతించండి ■ స్వంతం చేసుకోండి & ఆనందించండి

## చావా కన్‌స్ట్రక్షన్స్ - ఖమ్మం

Cell: 9949125050

మే.పా. చావా శివ B.E

డైరెక్టర్స్: చావా బోస్‌బాబు, చావా సిద్ధార్థ B.E.

*Best Compliments From:*

## చావా ప్రతాప్‌బాబు - ఖమ్మం



మాట్లాడుతుండగానే వంట పూర్తయిపోయింది.

"ఇంకా దాన్ని చదువాపి రమ్మనకపోయావూ... ఓ ముద్ద తింటుంది" అంది సౌభాగ్యమ్మ.

"వెళ్లి పిలువ్... వడ్డిస్తుంటా. ఈ నందూ గాడెక్కడ బలాదూర్ తిరుగుతున్నాడో" వసంత డైనింగ్ టేబుల్ మీద అన్నీ సర్దడం మొదలెట్టింది. సౌభాగ్యమ్మ లేచి... నిత్య గది వైపు వెళ్లబోతుండగా... వచ్చాడు నందూ.

పాలకోవా ప్యాకెట్ని వెనుక దాచుకుని మెల్లగా... నిత్య గదిలోకి అడుగుపెట్టిన నందూ. అక్కడి దృశ్యం చూసి కొయ్యబారి పోయాడు.

"ఎక్కడ బలాదూర్ తిరుగుతున్నావ్‌రా ఇంత సేపూ... కాళ్లు కడుక్కురా... భోంచేద్దువుగాని" అంది సౌభాగ్యమ్మ.

"చేస్తాగాని... నిత్యేదే? " అడిగాడు జేబులోంచి కోవా ప్యాకెట్ బయటికి తీస్తూ...

"గదిలో చదూకుంటోంది" చెప్పిందామె.

నందూ నిత్య గదిలోకి వెళ్లబోతుంటే "అట్లాగే దాన్ని పిల్చుకురా... భోజనానికి" అంది.

పాలకోవా ప్యాకెట్ని వెనుక దాచుకుని మెల్లగా... నిత్య గదిలోకి అడుగుపెట్టిన నందూ. అక్కడి దృశ్యం చూసి కొయ్యబారి పోయాడు.

★ ★ ★

నిత్య క్లాసు పుస్తకాలన్నీ చించి పోగులు పెట్టి ఉన్నాయి. గదంతా... ఫ్యానుగాలికి విచ్చలవిడిగా ఎగురుతున్న కాగితాల మధ్య... రాతిబొమ్మలా కూర్చుని వుంది నిత్య.

"నిత్యా" పిల్చాడు.

"నిత్యా" మళ్లీ పిల్చాడు. ఆమెలో కదలికే లేదు. దగ్గరగా వెళ్లి... నిత్యభుజం మీద చిన్నగా తట్టాడు, మళ్లీ పిలుస్తూ.

అట్లాగే వెనక్కి వాలిపోయింది.

నందూ వసంతకీ, సౌభాగ్యమ్మకీ విషయం చెప్పాడు.

వసంత నిత్య ముఖాన నీళ్లు చిలకరించింది. మెల్లగా కళ్లు తెరిచింది నిత్య. సౌభాగ్యమ్మ మనుమరాలి తలను ఒళ్లోకి తీసుకుంది.

అయిదు నిముషాల్లో తేరుకున్న నిత్య... తన పుస్తకాలకు పట్టిన గతి చూసి... షాక్ తిన్నది. ధారాపాతంగా కారిపోయినయ్ ఆ అమ్మాయి కళ్లవెంట కన్నీళ్లు.

"పోతే పోయినయ్‌లే నిత్యా... నీకు మళ్లీ కొనిపెడతాగా" ఓదార్చాడు నందూ.

"అది కాలేజ్ వాళ్లిచ్చిన మెటీరియల్. బయట దొరకదు" వెక్కుతూ చెప్పింది నిత్య.

"కాలేజీకి వెళ్లి... మీ కరస్పాండెంట్‌తో మాట్లాడి నే తెస్తాను... సరేనా" హామీ ఇచ్చాడు.

అందరూ తాత్కాలికంగా ఆకలి మరిచి పోయారు.

"చూశావామ్మా... ఇదీ వరస. ఈ యింటికేదో శనిపట్టింది" వసంత తల్లి భుజంమీద తల ఆన్చి నిస్త్రాణగా కళ్లు మూసుకుంది.

"ఇవి గాలి చేష్టలే" స్థిరంగా చెప్పింది సౌభాగ్యమ్మ.

"గాలంటే దెయ్యమా అమ్మమ్మా" నిత్య

అట్లా అడుగుతుంటే... మామూలుగా ఆట పట్టించే నందు, ఈసారి కిమ్మనలేదు. తీవ్ర మైన ఆలోచనలో పడిపోయినట్టుగా నిశ్శ బ్దంగా వుండిపోయాడు.

ఓ గంట గడిచాక వసంతే ముందు తేరుకుని ముగ్గురికీ వడ్డించింది. వసంతను కూడా అందరితోపాటూ కూర్చోమని సౌభాగ్యమ్మ బలవంతం చేసింది.

ఆకల్లేదంటూ అయిష్టంగా కూర్చుంది వసంత. ఎంతసేపటికీ వసంత తినే ప్రయత్నం చెయ్యటంలేదు. అన్నమట్లా కెలుకుతూనే ఉంది.

"అన్నం మానితే సమస్య తీరుతుందా వసూ? తరుణోపాయం చూద్దాంగా, అన్నం తినమ్మా" అంది సౌభాగ్యమ్మ.

ఒక్కసారిగా బావురుమంది వసంత. "ఎందుకు తినాలి? ఏం సాధించటానికి ఈ అన్నం తిని బతకాలి. నా ఆశలన్నీ నిత్య మీదే పెట్టుకున్నాను. పోయింది... అంతా అయిపోయింది. నా ఆశలన్నీ కుప్పకూలిపోయినయ్. ఇక నాకు దేనిమీదా ఇంట్రస్ట్ లేదు. నాకన్నం వద్దూ. నీళ్లొద్దూ.... అసలీ బతుకే వద్దు"

వసంతను ఓదారుస్తున్న సౌభాగ్యమ్మనీ... నందూనీ బిక్కముఖం వేసుకుని చూస్తుండిపోయింది నిత్య.




నిత్యకు మాటిచ్చినట్టే... ఆ మర్నాడే కాలేజ్‌కి వెళ్లి మెటీరియల్ కొనుక్కొచ్చాడు నందూ. నిత్య పరిస్థితి గురించి అడిగిన మేనేజ్‌మెంట్‌కి... 'ఆమెకు జాండీస్... విశ్రాంతి కావాలన్నాడు డాక్టర్. అందుకే ఇంట్లో ఉండి చదువుతోంది' అని చెప్పాడు.

నందూ తెచ్చిన పుస్తకాలు చూసి... లాటరీ వచ్చినంత సంబరపడింది నిత్య. "థేంక్స్ మామయ్యా" అంది హృదయపూర్వకంగా.

నిత్య మళ్లీ చదువులో పడింది. ఆమెను ఆ పరిస్థితిలో చూశాక మేడమీద పడుకోవడం ఆపేసిన నందూ... మూడురోజులు ప్రశాంతంగా గడవడంతో మళ్లీ ఆ రాత్రి మేడమీద పక్కేసుకున్నాడు. వసంతా... సౌభాగ్యమ్మా ఎంత వారించినా విన్లేదు.

"దెయ్యాల్ని ఇంటర్వ్యూ చెయ్యాలన్నది నా జీవిత ధ్యేయం. అది రావాలేగానీ, నా అదృష్టంగా భావిస్తాను" అంటూ పైకెళ్లిపోయాడు.

"అదొస్తే చెప్పు మావయ్యా. కాఫీ పట్టుకొస్తా" అంది నిత్య.

"నీ చేతి కాఫీ తాగితే దెయ్యం కూడా చస్తుందే" అన్నాడు నందూ.

"మామయ్యా మనిషి చస్తే దెయ్యమవుతాడు. మరి దెయ్యం చస్తే...?"

"నిత్యవుతుంది" చెప్పాడు.

మూడీగా వున్న వసంత కూడా నవ్వేసింది.

"ఏం మామా కోడళ్లే. అసలు వీళ్లిద్దరికీ చేసేస్తే..." సౌభాగ్యమ్మ అంది.

"అమ్మా" వసంత స్వరం కోపంగా వుంది.

"అట్లాంటి ఆలోచనెప్పుడూ మనసులోకి రానివ్వకు. నిత్యంటే ఎవరనుకున్నావ్. కాబోయే సాఫ్ట్‌వేర్ ఇంజనీర్. ఇండియా... గిండియా కాదు, ఫారిన్‌లో సెటిల్ కావాలి. నా నిత్య" గర్వంగా వున్న వసంత గొంతు హఠాత్తుగా మార్దవంగా మారింది.

"నా కలలూ, కోరికలూ అన్నీ దానిమీదే నమ్మా. నిత్య సాదాసీదా అమ్మాయి కాదు. పెళ్లి చేసుకుని పిల్లల్ని కంటూ యంత్రంలా బతికే సగటు పిల్ల కానేకాదు నిత్య.







నిత్యంటే ఒక..."

"ఒసి... నీ దుంపతెంచ... మాటవరస కన్నాలేవే. నువ్విచ్చి చేస్తానన్నా నందూ చేసుకోడు. దానిమీద వాడికా అభిప్రాయమే లేదు" అంది సౌభాగ్యమ్మ.

నిత్య చదువుతున్నంతసేపూ... వసంత మేలుకునే వుంది. మొన్నటి సంఘటన తర వాత నిత్యను ఒక్క నిముషం కూడా ఒంట రిగా వదలటం లేదామె.

నిత్య పన్నెండుదాకా చదువుకొని... అమ్మమ్మ పక్కలో దూరింది. వసంత కూడా లైటార్పి నడుం వాల్చింది.

పక్కన నిత్య పడుకున్న అలికిడికి నిద్ర పోతున్న సౌభాగ్యమ్మకు మెలకువ వచ్చింది.

"చదువైపోయిందా నిత్యమ్మా?" అంది.

"అయిపోయిందమ్మమ్మా" అంది నిత్య, ఆమె మీద ఓ కాలు, చెయ్యివేసి పడు కుంటూ.

"నాన్న రేపొస్తాడా తల్లీ" అంది.

"రావచ్చు" అని, "ఏం అమ్మమ్మా?" అంది.

"ఏం లేదే... తాతయ్య కల్లో కొచ్చాడు. మీ నాన్నొస్తే... వూరెళ్దామని"




"వద్దమ్మమ్మా... నువ్విక్కడే వుండు. నా దగ్గరే వుండు" మారాం చేసింది నిత్య.

"నేన్నీదగ్గరే వుంటే... మీ తాతయ్య దగ్గరెవరుంటారే..." నవ్వింది సౌభాగ్యమ్మ.

"తాతయ్య కింకో పెళ్ళి చేద్దాంలే"

"ఆ కర్రేదీ" సౌభాగ్యమ్మ కోప్పడుతుంటే కిలకిల నవ్వింది నిత్య.

"అబ్బబ్బ... అర్థరాత్రిపూట ఈ అంకమ్మ శివాలేంటి? పడుకో నిత్యా... మళ్ళీ నాలుగ్గంటలకే లేచి చదువుకోవద్దూ" వసంత విసుక్కుంది.

నిత్య గప్‌చిప్‌గా పడుకుంది. కాసేపట్లో గాఢనిద్రలోకి జారిపోయింది. అర్థరాత్రి దాటిపోయి రెండు కావస్తుండగా పైనేదో వస్తువు పడ్డట్టనిపించి దిగ్గున లేచి కూర్చున్నాడు మేడమీద నిద్రపోతున్న నందూ.

పక్కమీదంతా తడిమి చూశాడు. ఉండలా చుట్టబడిన ఓ కాగితం అతని చేతివేళ్ళకు తగిలింది. మేడమీద లైటు లేదు. కనెక్షన్ లాగారు గాని, ఇంకా హోల్డర్ ఫిట్ చేయలేదు.

పుచ్చ పువ్వులా కాస్తోంది వెన్నెల. కాగితపు ఉండని చేత్తో చదరంగా సర్ది వెన్నెల వెలుగులో పరీక్షగా చూశాడు. అక్షరాలు నల్లగా ఇంతింత లావున కనబడ్డాయిగాని... చదవటానికి ఆ వెలుతురు చాల్లేదు. ఉదయం చదవొచ్చులే అనుకున్నాడుగాని... మనసాగలేదు.

గబగబ కిందికి దిగివచ్చి.. పెరట్లో లైటేసుకుని... వేపచెట్టు మొదట్లో కూర్చుని కాగితంలోకి చూశాడు.

వెన్నెల వెలుగులో నల్లగా కనబడ్డ అక్షరాలు ఇప్పుడు ఎర్రగా కనబడుతున్నాయి. తలకిందులుగా వున్న ఆ అక్షరాలను కూడ బలుక్కుంటూ చదివాడు.

నందూ... ఆశలు తీరకుండానే... అధోలోకాలకు వెళ్ళిపోయి అల్లాడుతున్న ఆత్మను. కోర్కెలు తీరకుండానే అకాల మరణం పొంది గాఢాంధకారంలో కొట్టుమిట్టాడుతున్నా. ఒంటరితనంతో కాలిపోతూ... ఓదార్పు కోసం అర్రులు చాస్తూ... విసిగి వేసారిపోతున్నా. నాకో తోడు కావాలి. అసరా కావాలి. అందుకే నిన్ను నాతో తీసుకుపోతా!

నిన్ను ఆర్తిగా... నాలో కలిపేసుకుంటా!

నువ్వు రావాలి... నాతో రావాలి... తప్పదు... నిన్ను వదలను...

ఉత్తరం చదవడం పూర్తయ్యేసరికి







నందూ శరీరం... నూట నాలుగు డిగ్రీల జ్వరంతో పేలిపోతోంది.

★ ★ ★

అదురు జ్వరం కావటాన ఒక్కరోజులో తగ్గిపోయింది నందూకు. జ్వరం తగ్గాక ఆలోచనలో పడ్డాడతను.

ఇది నిజంగా దెయ్యం రాసిన ఉత్తర మేనా? దెయ్యాలు ఉత్తరాలు రాయటానికి కాగితాలు ఉపయోగిస్తాయా?

ఇవేరకమైన రాతలు... సంఘటనలూ హాస్టల్లో జరిగినట్లు చెబుతోంది నిత్య. మళ్ళీ తిరిగి ఈ ఇంట్లో!

ఎక్కడో ఏదో వుంది. సమ్‌థింగ్ రాంగ్...

ఆలోచనల్లో కొట్టుకుపోతున్న అతనికి మెరుపులా తట్టిందో వూహ. హుషారుగా అన్పించింది. అటో ఇటో తేల్చెయ్యాలని నిర్ణయించుకున్నాడు. ఈలోపు నిత్య కదలి కల్ని అనుక్షణం కనిపెట్టసాగాడు. ఈలోపు దివాకర్ వచ్చాడు. జరిగిన సంఘటనల్ని ఒకరు మార్చి ఒకరు వర్ణించి వర్ణించి చెప్పారతనికి.

అంతా విని ఒంటరిగా స్తబ్దుగా కూర్చుని వున్న దివాకర్‌ని కదిలించాడు నందూ.

"బావా... నాదో చిన్న అనుమానం" అంటూ మొదలుపెట్టి తన మనసులోని మాట బయటపెట్టాడు.

ముందు అతని సందేహాన్ని విని దివాకర్ చప్పరించేశాడు గానీ... ఆలోచించగా ఆలోచించగా... నందూ చెప్పినదాన్లో కూడా రీజన్ వుందేమో అన్న అనుమానం అతనిక్కూడా కలిగింది.

అయితే... ఆ ఇద్దరి అనుమానాల్ని పటాపంచలు చేస్తూ వచ్చిందా సాయంత్రం... హాస్టల్ నుంచి ఓ ఫోన్.

అది... సాదియా నిత్యకు చేసిన ఫోన్. ముందుగా కాల్ రిసీవ్ చేసుకున్న నందూ... "నిత్యా నీకు ఫోన్... హాస్టల్నుండి. సాదియా అట"

చదువుకుంటున్న నిత్య పరిగెత్తుకొచ్చి నందూ చేతిలోంచి రిసీవర్ లాక్కుంది. తన రూమ్మేట్స్‌ని పేరు పేరునా అడిగి క్షేమసమాచారాలు తెలుసుకున్న నిత్య వున్నట్టుండి "మైగాడ్! నిజమా? " అంది.

సాదియా అవతల ఏమన్నదో మరి, "పాపం... రాజమ్మ..." అంది నిత్య.

మళ్ళీ వెంటనే "అవునూ... ఓసారి కల్పనకి ఫోన్ చేస్తే... హాస్టల్లో ఇప్పుడట్లాటి సంఘటనలేమి జరగడం లేదు. అంతా ఓకే అందే" అంది.

కేజువల్‌గా... నిత్య సంభాషణ వింటున్న నందూ... ఆమె మాటలతో అలర్ట్ అయిపోయాడు.

"అయ్యో! పన్లోంచి తీసేశారా! పూర్ ఉమెన్" నొచ్చుకుంది నిత్య.

"అయినా ఇందులో ఆమె తప్పేం వుంది? ఆ దెయ్యాన్ని అనాలిగాని" అంటూ జోక్ చేసింది.

ఇంకాసేపు మాట్లాడి ఫోన్ పెట్టేసి ఇటు తిరిగింది నిత్య.

"ఫోన్ ట్యాపింగా" అంది నందూని చూస్తూ.

"అద్సరే గాని... ఏంటి, రాజమ్మా... దెయ్యం అంటున్నావ్. ఏం జరిగింది? "

"నీకు ప్రేమలేఖ రాసిన దెయ్యం... మా రాజమ్మ దగ్గరికెళ్ళి... పెళ్ళి పెత్తనం వెళ్దాం రమ్మందట. రాజమ్మ జడుసుకుని గగ్గోలు పెట్టిందట."

"ఏహె... సరిగా చెప్పు" కోపంగా చూశాడు.

నందూ సీరియస్‌గా అడుగుతున్నాడని గమనించి చెప్పింది నిత్య.

"అప్పుడు చెప్పాగా... మా హాస్టల్లో రాజమ్మని ఒక వంటమనిషి వుందనీ... రాధిక అనే అమ్మాయి ఆత్మ... ఆమెను పూనిందనీ..." ఆమె ఆగింది.

"ఆc... ఆc... ఇప్పుడేమైంది...? "

"మళ్ళీ మొన్న అర్ధరాత్రి పూనకం వచ్చి వూగిపోయిందట రాజమ్మ. హాస్టల్లో అందర్ని హడల గొట్టేసిందట. దాంతో మేనేజ్‌మెంట్... ఆమెను పన్లోంచి తీసేశారట. ఎంత అన్యాయమో చూడు నందూ... తప్పు ఆవిడదా? ఇద్దరు కొడుకులూ, ఓ కూతురు వున్నా... తననెవరూ చూడరని మాతో చెప్పుకుని ఏడ్చేది ఇప్పుడైనా. ఏదో ఈ పని దొరకబట్టి గౌరవంగా బతుకుతోందట పాపం. ఇప్పుడేం చేస్తుందో ఏంటో? "

నిత్య నిట్టూర్చుతూ... స్టడీ రూమ్‌లో కెళ్తుంటే... ఇంతక్రితం తనకు కలిగిన అనుమానానికి సిగ్గుపడ్డాడు నందూ.

"సారీ... బావా... నిత్యను అనుమానించాను" అంటూ హాస్టల్ ఇన్సిడెంట్‌ని గురించి చెప్పుకొచ్చాడు.

ఇంట్లో... హాస్టల్లో... ఒక టైపు సంఘటనలు ఎదురవడంతో నిత్యమీద సందేహం కలిగిందతనికి.

మొన్న హాస్టల్లో ప్రశాంతంగా వుందంటూ ఎవరో నిఖిత అనే పిల్ల ఫోన్ చెయ్యడం, ఇంట్లో తలాతోక లేని సంఘటనలు... జరుగుతుండడంతో.... నందూ ఆలోచనలో పడ్డాడు.

హాస్టల్లో నిత్య లేదు... ప్రశాంతంగా వుంది.

ఇంట్లో నిత్య వుంది... ప్రశాంతత లేదు అన్న కోణంమీద ఆలోచించాడు.

ఇప్పుడు హాస్టల్లో... జరిగిన సంఘటన ఫోన్ ద్వారా తెలియగానే తనెంత తెలివితక్కువగా ఆలోచించాడో తెలిసొచ్చింది నందూకి.

అంతకంటే చిత్రమైన సంఘటన ఆ రాత్రి మరొకటి జరిగింది. భోజనాలయ్యాక సౌభాగ్యమ్మ దివాకర్‌తో "ఏం బాబూ... నీకు సెలవలే కదా! వూరిదాకా వెళ్ళిరానా? " అంది.

"సెలవేం లేదండీ. ఎల్లుండి ఉదయాన్నే వెళ్ళాలి. మీరుంటే వసంతకి కాస్త ధైర్యంగా వుంటుంది."

సౌభాగ్యమ్మ మౌనంగా తలూపింది.

"లేదు... ఖచ్చితంగా వెళ్ళిరావాల్సిందేనంటే... మా అమ్మకు... ఫోన్..."

"అక్కర్లేదు" అంటూ లోపల చేస్తున్నపని ఆపేసి దురుసుగా వచ్చింది వసంత.

"అది కాదు... వసూ..." అతనేదో అనబోయాడు.

"ఏది కాదు? అత్తని మామని రాచి రంపాన పెట్టే కోడల్నా నేను? కాదని మీకు తెలుసు. వాళ్ళనెందుకు వద్దంటున్నానో కూడా మీకు తెలుసు. తెలిసి తెలిసీ నన్నెందుకండీ బాధ పెడతారు? " వసంత కళ్ళలో గిర్రున తిరిగాయి కన్నీళ్ళు.

సౌభాగ్యమ్మ కల్పించుకుంది "అబ్బాయినట్లా సతాయించకే వసూ... నేను వెళ్తానంటే ఆ ఆలోచన చేశాడు పాపం..."

"వెళ్ళిపో. మాకు ఎవరి తోడూ అక్కర్లేదు సరేనా? బయల్దేరు"

వసంత విసురుగా వెళ్ళిపోయింది.

"ముక్కు మీదుంటుంది నాయనా దానిక్కోపం. ఏమనుకోకు"

అల్లుడికి సర్దిచెబ్తుంటే నవ్వాడతను. "వసూ కోపం గురించి మీరు చెప్పాలా అత్తయ్యా నాకు!"

సౌభాగ్యమ్మ భర్తకు ఫోన్ చేసి పరిస్థితులు వివరించి... తనిప్పట్లో రానని చెప్పింది. వసంతను ఫోన్లోకి రమ్మన్నాడామె తండ్రి. సౌభాగ్యమ్మ చెప్పిన విషయాల్నే మళ్ళీ అడిగి చెప్పించుకున్నాడు. అన్నీ వివరంగా విన్నాక "నువ్వేం భయపడకమ్మా. వచ్చే ఆదివారం మనూరి భూత వైద్యుడ్ని వెంట బెట్టుకుని నేనొస్తా... ఆ పిశాచం అంతు చూస్తా" అన్నాడు.

"ఏదో ఒకటి చెయ్యండి నాన్నా! ఈ బాధలు పడలేకుండా వున్నాం. ముఖ్యంగా





# నొప్పులకు 'నత్త' విషం...




"నత్త విషంతో నొప్పులు మాయం..." వింతగా ఉందని ఆశ్చర్యపడకండి. ఏ పుట్టలో ఏముందో అన్నట్టు... క్షణానికో కొత్త రోగం పుట్టుకొస్తుంటే, మందుల కోసం చెట్లు చేమలు, రసాయనాలేకాక, నత్తల మీద కొత్తగా పరిశోధనలు జరిపారు మరి. క్యాన్సర్, ఎయిడ్స్ రోగుల నొప్పులకి 'నత్తవిషం' అద్భుతమైన ఉపశమనం కల్గిస్తుందని అమెరికన్ శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. సాధారణంగా నత్త తను తినబోయే ఆహారంపై ముందు విషాన్ని ప్రసరింప చేసి, తనకు ఆహారం కాబోయే కీటకాలకు నొప్పి తెలియకుండా చేస్తాయి. అంటే నాడీ కణాన్ని మొద్దుబారుస్తాయి. ఇది పసిగట్టిన శాస్త్రజ్ఞులు నత్త విషంతో "జింక్ టైడ్" అనే మందు కనుగొని, దానిని క్యాన్సర్, ఎయిడ్స్ రోగులపై ప్రయోగించి ఫలితాలు సాధించారు. ఎయిడ్స్, క్యాన్సర్ రోగులు గణనీయంగా పెరిగిపోతున్న దేశాల్లో... 'జింక్ టైడ్' మందుకీ డిమాండ్ పెరిగిపోతోంది. మనదేశంలో... ఊఁ... వేరే చెప్పాలా!

నిత్య చదువు గురించే నా దిగులంతా. పరీక్ష దగ్గర పడుతోంది. జీవన్మరణ సమస్యగా వుంది నాకు" అంది.

ఆయన ధైర్యం చెప్పాడు.

"అట్లాగే నాన్నా" అంటూ రిసీవర్ పెట్టేసి కళ్ళు తడుచుకుని వెనక్కి తిరిగేంతలో... "భూత వైద్యుడ్ని పిలిపిస్తావే? " అంటూ హూంకరించిందో స్వరం.

ఉలిక్కిపడి వెనక్కి చూసింది వసంత.

తల విరబోసుకుని గడగడ వణికిపోతోంది సౌభాగ్యమ్మ. కళ్ళు గుండ్రంగా తిప్పుతోంది. మెడ భయంకరంగా తిరిగిపోతోంది.

"నన్ను తరమడానికి వాడెవడే? ఈ ఇల్లు నాది. దీన్ని వదిలి నేనెక్కడికీ పోను. తరమాలని చూశారో... అందర్నీ మింగేస్తా... అందర్నీ మింగేస్తా..." అంటూ... అంటూనే ఘోరంగా పడిపోయింది.




ఓ రోజు ఓ ప్రముఖ దినపత్రికలో ఒక వార్త చదివాడు డాక్టర్ అలోక్.

అది... టౌన్ ఎక్స్‌టెన్షన్ ఏరియాలో ఫోర్త్‌టౌన్ పోలీస్‌స్టేషన్ పరిధిలోని ఒక భూత గృహానికి సంబంధించిన న్యూస్.

దివాకర్... వసంత... వారి ఏకైక కుమార్తె నిత్య... ఆ ఇంటి సభ్యులు... వారి బంధువులు ఇద్దరు కూడా వారితో వున్నారు. ఆ ఇంట్లో ఒక ఈవిల్ స్పిరిట్ వుంది. ఆ దుష్టాత్మ గత కొన్నాళ్ళనుండీ వాళ్ళ జీవితాన్ని నరకం చేస్తోంది. ఆ ఇంట్లోనే ఒక పెళ్ళికాని అబ్బాయికి ప్రేమ లేఖలు రాస్తూ వుంది. అంతుబట్టని అనేక

సంఘటనలు ఆ ఇంట్లో చోటు చేసుకున్నాయి.

ఇసుక... రాళ్లు ఎక్కడపడితే అక్కడ పడ్డాయి. కప్పులు, సాసర్లు, గాజు గ్లాసులు గాల్లో ఎగురుతూ వచ్చి నేలమీద పడి ముక్కలైపోయాయి. మనుషులెవరూ దగ్గర లేకుండానే కొవ్వొత్తి ఆరిపోయింది. అదృశ్య హస్తాలు అమ్మాయి జుట్టు కత్తిరించేశాయి. దెయ్యం రాసిన ప్రేమలేఖలు ఎగిరివచ్చి ఇంట్లో పడ్డాయి. అల్మారాలో దాచిన బట్టలు కత్తిరింపబడ్డాయి. గోడలమీద చిత్ర విచిత్రమైన రాతలు రాయబడ్డాయి. ఆ దయ్యం ఒక్కోసారి ఆ ఇంట్లోని వస్తువుల్ని బయట పారేసేది. ఇంకోసారి ఇరుగు పొరుగు ఇళ్ళలోని వస్తువుల్ని ఆ ఇంట్లో పెట్టేది.

కొన్నిసార్లు వాళ్లు నిద్రపోతున్నప్పుడు కత్తులు, కటార్లు వాళ్ళ గొంతుల దగ్గర వుండేవి. ఓసారి దివాకర్ భార్యని ఆ దెయ్యం బయటకు రమ్మని పిలిచింది. ఆమె బయటకు రాగానే మాయమైంది. ఒక రోజు దివాకర్ అత్తగార్ని పక్కమీంచి కిందికి లాగిపారేసింది.

ఆ ఇంటి గుమ్మం మీద 'ఈ ఇంట్లో దెయ్యం వుంది' అని రక్తంతో తలకిందులుగా రాస్తుంది. ఆ ఇంట్లోవాళ్ళు దాన్ని ఎన్నిసార్లు చెరిపేసినా మళ్ళీ మళ్ళీ రాస్తూనే వుంటుంది.

వాళ్ళ జీవితాల్లో విషాదాన్ని నింపుతున్న ఆ పిశాచిని పారదోలడానికి వాళ్ళు మూడుసార్లు మంత్ర తంత్రాలు నిర్వహించారు. పూజలు చేసినపుడు నాల్రోజులు బయటకు పోతుంది. అయిదోనాడు మళ్ళీ వచ్చి కూర్చుంటుంది.

డాక్టర్ అలోక్ ఆ సిటీలో పేరుమోసిన సైకియాట్రిస్ట్. ఓ కాలేజ్‌లో సైన్స్ డిపార్ట్‌మెంట్ అధిపతిగా చేసి రిటైర్ అయ్యారు.



గొప్ప హేతువాది.

ఆయన ఏ విషయాన్నయినా... శాస్త్రీయ దృక్పథంతోనే కాదు, మానవతా దృష్టితో చూస్తారు. హేతుబద్ధంగా ప్రతి విషయాన్ని పరిశీలిస్తారు. హేతువాదిగా, సైకియా ట్రిస్ట్‌గా పేరు పొందాడు. సైకిక్, పారాసై కిక్ విషయాల మీద ఆయన చేసిన పరిశో ధనలకు... అమెరికాలో ప్రఖ్యాతిగాంచిన ఓ యూనివర్సిటీ ఆయనకు డాక్టరేట్ ఇచ్చి సత్కరించింది. ప్రస్తుతం ఆయన భారత హేతువాద సంఘ అధ్యక్షుడు.

మంత్రాలు... మహిమలు... దెయ్యాలు... భూతాలు వున్నాయని చాటు కునే వాళ్ళకు ఛాలెంజ్ విసిరిన వ్యక్తి ఆయన.

కొన్ని అద్భుతాలని పట్టికలాగా ఇచ్చి.. ఈ అద్భుతాల్లో ఏ ఒక్కదాన్నయినా గురు వులు... స్వాములు... అవతార పురు షులు... ఎవరైనా సరే ఎలాంటి గారడీలు, మోసాలు లేకుండా చెయ్యగలిగినా లక్ష రూపాయలు బహుమతి అందుకోవచ్చని ప్రకటించారు. ఎవళ్ళూ ఆ ఛాలెంజ్ ఎదు ర్కొనే ప్రయత్నం చెయ్యలేదు. ఒకరిద్దరు వచ్చినా డిపాజిట్ పోగొట్టుకున్నారు.

అటువంటి ఆయన కంట్లో పడిందీ వార్త. ఆ సాయంత్రమే మీటింగ్ ఏర్పాటు చేసి హేతువాద సంఘ సభ్యులతో చర్చిం చాడాయన.

ముందుగా... ఆ న్యూస్ పడిన పేపర్ ఎడిటర్ని కలవాలని నిర్ణయించుకున్నారు. సంఘ సభ్యుల్లో 'మీరా' అనే సైంటిస్ట్‌ని వెంటబెట్టుకుని ఎడిటర్ని కలిశాడు.

"ఈ వార్త అక్కడ ఇక్కడ విని రాసింది కాదు, స్వయంగా కళ్ళతో చూసి నిర్ధారించు కున్నాకనే ప్రచురించే సాహసం చేశాం" చెప్పాడు ఎడిటర్.

"నేను ఇంట్లో ఒక గదిలోంచి మరో గది లోకి ఎగురుతున్న ప్లాస్టిక్ వస్తువుల్ని చూశాను. దెయ్యం నా మీదకి కూరగా యలు కట్ చేసే కత్తి విసిరింది. అదృష్టవ శాత్తూ అది పక్కకు వెళ్ళి గోడకు తగిలిపడి పోయింది" ఒక విలేఖరి చెప్పాడు.

"నా బేగ్‌లోంచి దయ్యం డైరీ, పెన్నూ దొంగిలించింది. నే చూస్తుండగానే గాలి చొరబడని గదిలో తలుపులు బంధించి వెలి గించిన కొవ్వొత్తిని అదృశ్యంగా వున్న ఒక నోరు వూదేసింది" లేడీ రిపోర్టర్... ఆ సంఘటనల్ని గుర్తు చేసుకుంటూ అబ్బు రంగా చెప్పింది.

"నేను నమ్మలేక... స్వయంగా ఆ ఇంటికి వెళ్ళి చూశాను. అప్పుడు నా మీదక్కూడా ప్రేమలేఖ విసిరింది దెయ్యం" చెప్పాడు ఎడిటర్.

"ఆ లేఖ మీ దగ్గరుందా?" అడిగింది మీరా.

"భద్రంగా దాచాను" చెప్పాడాయన.

"ఓ సారివ్వగలరా?" అడిగాడు అలోక్.

"ష్యూర్" ఎడిటర్, సబ్ ఎడిటర్‌తో ఇంటర్‌కమ్‌లో మాట్లాడాడు.

ఓ అయిదు నిమిషాల్లో సబ్‌ఎడిటర్ శర త్‌కుమార్ ఆ లెటర్ తెచ్చి అలోక్‌కి అందిం చాడు.

తల్లకిందులుగా వున్న ఎర్రటి అక్షరాలు.

నందూ!

నిర్భాగ్యురాలిని. నిస్సహాయను. చీకటి లోకాల్లో తోడుకోసం అలమటిస్తున్నా. నా ఆర్తినంతా నీ కోసం దాచి వేచి చూస్తున్నా. నా కోసం... రావూ?

అక్షరాలు అప్‌సైడ్ డౌన్‌గా వుండటమే కాక... వాక్యాలు ఒంకరటింకరగా... చింద రవందరగా వుండటంతో కూడబలుక్కుని... కూడబలుక్కుని చదివాడాయన.

మీరా అందుకుని చూసి అంది "అక్ష రాల్లో అందం లేకపోయినా భావుకత వుంది"

"కెన్ ఐ టేక్ దిస్ లెటర్?" అడిగాడు

ఎడిటర్ని అలోక్.

"వైనాట్? మీ పరిశోధనలకి ఉపయోగి స్తుందంటే... తప్పకుండా తీసుకోండి"

'మీరా' దాన్ని తన వెంట తెచ్చుకున్న జిప్ బ్యాగ్‌లో దాచుకుంది.

ఇంకాసేపు మాటలు జరిగాయి.

ఆ న్యూస్ పేపర్నుండి... ఇద్దరు విలేఖ రులు ఇన్వెస్టిగేషన్ టైమ్‌లో అలోక్... మీరాలకు సహకరించడానికి ఏర్పాటు జరి గింది.

అంతాకలిసి ఎప్పుడు ఆ భూత గృహాన్ని విజిట్ చెయ్యాలో నిర్ణయం తీసుకున్నారు.

★ ★ ★

దివాకర్ ఇంటి చుట్టూ వున్న ఖాళీ స్థలంలో రకరకాల పూల మొక్కలున్నాయి. వెనక పెరట్లో శాఖోపశాఖలుగా విస్తరించిన రెండు వేపచెట్లు వున్నాయి. స్థలం కొనేటప్పటికే వున్న ఆ చెట్లని దివాకర్ కొట్టించలేదు. చెట్లంటే అతనికున్న మమ కారం వల్ల... వాటిని వదిలేసి ఇల్లు కట్టు కున్నాడు.

డాక్టర్ అలోక్... సైంటిస్ట్ మీరాలు ఇద్దరు విలేఖరుల్నీ, ఒక ఫొటోగ్రాఫర్‌నీ వెంట బెట్టుకుని రెండొందల కిలోమీటర్లు రాత్రంతా ప్రయాణం చేసి... ఉదయానికి దివాకర్ ఇంట్లో దిగారు.

ముందుగా వాళ్ళు గమనించిన విషయం సింహద్వారం మీద తల్లకిందులుగా రాయ బడిన 'ఈ ఇంట్లో దెయ్యం వుంది' అన్న నెత్తుటి అక్షరాలు. ఫొటోగ్రాఫర్ ఆ అక్ష రాల్ని కెమెరాలో బంధించాడు.

దివాకర్ కుటుంబ సభ్యులు... ఆ అయి దుగురు సభ్యుల బృందాన్ని సాదరంగా లోనికి ఆహ్వానించారు. ముందుగానే తెలి యచేయడం వల్ల వారికి అవసరమైన అన్ని ఏర్పాట్లు చేశాడు దివాకర్.

వాళ్లు రిఫ్రెష్ అయి... కాఫీలు, టిఫిన్లూ ముగించాక... అలోక్ అప్పటికే తాను పేపర్లో చదివిన సంఘటనల్ని మళ్ళీ అడిగి నిర్ధారించుకున్నాడు. తరువాత ఆ అయిదు గురు కల్సి ఆ ఇంటి పరిసరాల్ని పరిశీలిం చారు.

హాస్టల్లో జరిగిన సంఘటనలు ఆయన అడక్కుండానే నిత్య చెప్పింది. అవసరమైన ఇన్ఫర్మేషన్ నోట్ చేసుకుని కొన్ని

## అన్నగారితో ఛలోక్తి



ఎన్టీఆర్ దర్శకత్వం వహిస్తున్న ఒకానొక సినిమాలో రావికొండల రావు ఠీవిగా సిగార్ తాగుతూ మేడ మెట్లు దిగాలి.

పని విషయంలో సీరియస్‌గా ఉండే ఎన్టీఆర్ అంటే దాదాపు అందరికీ గౌరవంతో కూడిన భయం. అలాం టిది ఆయన దర్శకత్వం అంటే ఇక చెప్పేదేముంది? మొత్తానికి షాట్ మొదటి టేక్‌లోనే ఓకే అయిపోవ డంతో కొండలరావు హమ్మయ్య అనుకున్నారు.

'కనీసం ఐదు టేకులన్నా తీయాల్సి ఉంటుందని ఐదు సిగార్లు తెప్పించా. అవన్నీ ఖరీదైన విదేశీ సిగార్లు. అంచేత మిగిలిన నాలుగింటి ఖర్చు కొండలరా వుగారి ఖాతాలో రాయించండి' అన్నారు ఎన్టీఆర్ నవ్వుతూ.

'అన్నగారూ! ఐదు టేకులకయ్యే ముడి ఫిలుం ఖర్చుతోపాటు విలువైన మీ సమయాన్నీ ఆదాచేశాను గనుక మీరే అదనంగా ఇవ్వాల్సి ఉంటుంది' అని చమత్కరించారు కొండలరావు.

అన్నగారు కూడా నవ్వేశారు.







ఫొటోలు తీసుకున్నారు. వసంత తన తమ్ముడికి దెయ్యం రాసిన లేఖలిచ్చింది అలోక్‌కి.

అప్పటికే ఆ ఇంటి ముందు మెల్లమెల్లగా చుట్టుపక్కలవాళ్లు పోగవుతున్నారు.

ఆ ఇంట్లో దెయ్యాన్ని తరిమికొట్టడానికి వచ్చిన వ్యక్తుల్ని చూడాలన్న ఆసక్తి వారిది. అందర్నీ సాయంత్రం రమ్మని... ఇప్పుడు వాళ్లు విశ్రాంతి తీసుకుంటారని జనానికి నచ్చజెప్పి పంపిస్తున్నాడు దివాకర్. మధ్యాహ్నం పన్నెండున్నరైంది. అందర్నీ భోజనాలకు కూర్చోమని రిక్వెస్ట్ చేశాడు దివాకర్. దివాకర్‌ని కూడా వాళ్ళతో పాటు కూర్చోమన్నాడు అలోక్.

వసంత, నిత్య వంటకాలన్నీ టేబుల్ మీద అమర్చిపెట్టారు.

"సర్! మీరేంచేస్తారో నాకనవసరం. ఈ దెయ్యం బారినుండి మమ్మల్ని కాపాడండి" దివాకర్ దీనంగా అన్నాడు.

నిత్య... డైనింగ్ టేబుల్ మధ్యలో శుభ్రంగా కడిగి దొంతరగా అమర్చిన పింగాణీ ప్లేట్స్‌ను ఒక్కొక్కటి ముందు వుంచుతోంది.

"యువార్ ఎడ్యుకేటెడ్, యునో!" అంది మీరా దివాకర్‌తో.

ఆమె అట్లా ఎందుకడిగిందో దివాకర్‌కి అర్థమైంది. "మా ఇంట్లో జరిగే సంఘటనలు నా ఎడ్యుకేషన్‌కి అందటం లేదు మేడమ్" అన్నాడు.

"డోంట్ వర్రీ. అణువణువూ పరిశీలించి, పరిశోధించి అసలు విషయాన్ని బయట పెట్టే పూచీ మాది" చెప్పాడు అలోక్ దివాకర్ భుజం తడుతూ.

నిత్య... వాటర్ జగ్‌లోంచి గ్లాసుల్లోకి నీళ్ళు వంపడం పూర్తి చేసింది. అంతటితో తన పని అయిపోయినట్టూ వసంత వైపు చూసింది.

వసంత... రైస్ వుంచిన కేసరోల్ మీద మూత తీసి గరిటతో వడ్డించబోతూ కళ్ళు చిట్లించి చూసింది, కేసరోల్‌లోని అన్నం వైపు.

అన్నంలో సన్నసన్న రాళ్ళు... ఇసుకా...

కంగారుగా అన్ని పదార్థాల మీద మూతలు తీసి చూసింది.

ఆశ్చర్యం...!

రసంలో ఎండుటాకులు తేలుతున్నాయ్. పెరుగు ఎర్రగా వుంది. వంకాయ ఫ్రైలో ఓ డబ్బా పసుపు దిమ్మరించి వుంది.

పాయసం నిండా సాల్ట్. సాంబార్ నిండా ఆవాలు తేలుతున్నాయి.

ప్రతి గారెకూ... ఒక మేకు గుచ్చి వుంది.

ఒక్కక్షణం అవాక్కయ్యారు అందరూ. అందరిలోకీ ముందుగా తేరుకున్న అలోక్ అన్నాడు "మొత్తానికి మీ దెయ్యం మహా చిలిపిదిలా వుందే"

దివాకర్ నొచ్చుకున్నాడు. హడావుడిగా పరిగెత్తి హోటల్నుండి భోజనాలు తెప్పించాడు. వసంత పాడైన భోజనాన్ని పారబొయ్యబోతుంటే వారించాడు అలోక్.

ఆయనా... మీరా కూర్చుని... ఆ పదార్థాల్ని పరిశీలిస్తూ వుండిపోయారు. ఈలోపు ఫొటోగ్రాఫర్ కెమెరా కనబడటం లేదంటూ హడావుడి చేశాడు.

అందరూ వెతగ్గా... వేపచెట్టు వెనక పడి వుంది... ఫిల్మ్ తీసేసిన కెమెరా. ఫిల్మ్ కోసం వెతుకుతుంటే నిత్యా, నందు ఒకేసారి కనిపెట్టారు... వేప కొమ్మల్లో చిక్కుకుని వేళ్ళాడుతున్న ఫిల్మ్ రోల్‌ని.



సాయంత్రం రమ్మన్న దివాకర్ అభ్యర్థనని తోసిపుచ్చుతూ, మళ్ళీ పెద్ద గుంపే తయారైంది ఇంటి ముందు. ఇంట్లోకి తోసుకువస్తున్న జనాన్ని కంట్రోలు చెయ్యడం కష్టమైపోయింది.

అలోక్ దెయ్యాన్ని ఎట్లా తరమబోతున్నాడో చూడాలన్నది వారి కోరిక.

దివాకర్‌ని మెయిన్‌డోర్ వేసెయ్యమన్నాడు అలోక్. ఆయన లోపల గదిలో కూర్చుని పరిశోధన మొదలు పెట్టాడు. ఆయనతోపాటు సైంటిస్ట్ మీరా... ఒక విలేఖరి మాత్రం గదిలో వున్నారు.

కుటుంబసభ్యుల్ని ఒక్కొక్కరిగా పిల్చి ప్రశ్నించడం మొదలుపెట్టాడు. ప్రశ్నించబోయే ముందు ఆయన విధించిన షరతు స్వయంగా చూసినవి మాత్రమే చెప్పమని... ఇతరుల ద్వారా విన్నవీ... నలుగురూ అనుకునేవీ చెప్పకూడదని.

దివాకర్‌తో మొదలుపెట్టి



మొత్తం అందర్నీ ప్రశ్నించాడు. వాళ్ళు చెప్పే విషయాలన్నిట్నీ మీరా నోట్స్ రాస్తోంది. విలేఖరి తనకవసరమైన సమాచారాన్ని సేకరించుకుంటున్నాడు. సాయంత్రం ఆరవుతుండగా అలోక్ పరిశోధన ముగించాడు.

కుటుంబ సభ్యులందర్నీ ఒక్కచోట సమావేశపరిచి చెప్పాడు- "ఇన్నాళ్ళుగా జరుగుతున్న సంఘటనలన్నీ మీరనుకుంటున్నట్టూ దెయ్యాల పనికాదు. మీలోనే ఒకరు చేస్తున్న గమ్మత్తులు"

అలోక్ మాటలకి అందరూ ముఖాముఖాలు చూసుకున్నారు. నమ్మశక్యంగా లేని నిజమేదో వింటున్నట్టూ ఆశ్చర్యంతో తడిసి ముద్దయిపోయారంతా.

ముందుగా తేరుకున్న వసంత "మాలో ఒకరా! ఎవరు సర్?" అంది.

"అది పూర్తిగా రహస్యం. ఆ పేరు ఎవరికీ తెలియజెయ్యనని ఆ వ్యక్తికి మాటిచ్చాను. ఇక మీదట ఆ చిలిపి పనులు చెయ్యననే వాగ్దానాన్ని ఆ వ్యక్తినుండి తీసుకున్నాను. అయితే ఆ వ్యక్తి ఈ పనులను మామూలు పరిస్థితుల్లో చెయ్యలేదు. చిత్త భ్రమణంలో... తనేమిటో... తనకే తెలియని స్థితిలో చేసిన పనులు. మానసిక దౌర్బల్యం... నిగూఢమైన భయం దానిక్కారణాలుగా కన్పిస్తున్నాయి. ఒకవేళ ఆ వ్యక్తి ఇచ్చిన హామీని నిలబెట్టుకోలేకపోతే మాత్రం ట్రీట్‌మెంట్ ఇవ్వక తప్పదు"

"కానీ... కొన్ని సంఘటనలు మామూలు మనిషి చేయగలిగే రేంజ్‌లో లేవు కద్సార్. ఫరెగ్జాంపుల్... వస్తువులు గాల్లో ఎగరటం మా అమ్మకు పూనకం రావటం... లాంటివి. మనుషులెలా చేస్తారు? నందూ ఆశ్చర్యంగా అడిగాడు. ఇంట్లో దెయ్యాలున్నయ్... అని ఎప్పుడైతే మీరు నమ్మడం ఆరంభించారో ఆ క్షణం నుండే మీరు భయం చేతిలో పావులైపోయారు. అందుకే... జరిగిన ప్రతి సంఘటననీ దెయ్యానికి అంటగట్టి... హేతురహితంగా ఆలోచించారు. విపరీతమైన భయాందోళనలతో చిత్తచాంచల్యానికి గురైనపుడు స్థిరంగా వున్న వస్తువులు గాల్లో కనబడ్డంలో వింతేమీ లేదు. మీ అమ్మగారు హిస్టీరికల్‌గా పూనకం వచ్చినట్టూ ప్రవర్తించడానికి కారణం దెయ్యం పట్ల ఆమెకు గల విపరీతమైన విశ్వాసంలోంచి పుట్టిన మతిభ్రమణమే కారణం. ఆమె వూహల ద్వారా పూనకం తెచ్చుకుంది. దట్సాల్" అన్నాడు అలోక్.

అలోక్, మీరా బయటకు వచ్చారు. ఆసక్తిగా చూస్తున్న జనాన్ని ఉద్దేశించి చెప్పాడాయన.

"ఈ ఇంట్లో వున్న సమస్యని శాస్త్రీయంగా వెళ్ళగొట్టాను. ఇక దానివల్ల వీళ్ళకుగాని... చుట్టూ పక్కల వున్న మీకుగాని... ఎటువంటి కష్టం వుండదు. ఇట్లాంటివి సంభవించినప్పుడు మోసగాళ్ళయిన మంత్రగాళ్ళ మాటలు నమ్మి డబ్బు వృథా చేసుకోకండి. నాగరిక పౌరునిగా మీకున్న ప్రాథమిక బాధ్యతల్లో ప్రతి పౌరునిలోనూ శాస్త్రీయ బుద్ధిని, మానవతను, పరిశీలన, సంస్కరణ స్ఫూర్తి పెంపొందించే బాధ్యత ఒకటి... ఆ బాధ్యతను నేను సక్రమంగా నిర్వర్తించానన్న భావనతో... సెలవు తీసుకుంటున్నాను" అన్నాడు.

ప్రజలు హర్షధ్వానాలు చేశారు.

దివాకర్ కుటుంబసభ్యుల్ని ఉద్దేశించి, "ఇటువంటి పనులు ఇక చెయ్యనని నాకు మాటిచ్చిన వ్యక్తి... ఆ హామీని నిలబెట్టుకుంటారని మనస్ఫూర్తిగా నమ్ముతున్నాను" అన్నాడు.

దివాకర్ కృతజ్ఞతలు తెలియజేశాడు డాక్టర్ అలోక్‌కీ, మిగిలిన సభ్యులకీ.

ఏదైనా సమస్య వస్తే తనని కాంటాక్ట్ చెయ్యమని చెప్పాడు అలోక్ దివాకర్‌కి.



# శ్రీకాళహస్తీశ్వర స్వామి వారి దేవస్థానము

## శ్రీకాళహస్తి, చిత్తూరు జిల్లా

శ్రీజ్ఞానప్రసూనాంబ సమేత





శ్రీకాళహస్తీశ్వర స్వామి వార్లను

## దర్శించి తరించండి



### వజ్ర కిరీటం

శ్రీజ్ఞానప్రసూనాంబ వారికి కోటి రూపాయలతో వజ్ర కిరీటము చేయదలచినాము. భక్తులు విరివిగా విరాళములు ఇచ్చి శ్రీ అమ్మవారి కృపకు పాత్రులు కాగలరని మనవి. 80(జి) ప్రకారము ఆదాయపు పన్ను మినహాయింపు కలదు.

### రాహుకేతు పూజాఫలం





సకలదోష నివారణం.

పూజారుసుము: రూ. 250. ప్రత్యేక రాహుకేతు పూజ రూ. 500. దోష నివారణ ఆశీర్వచనం రూ. 1000. పూజా వస్తువులన్నియు దేవస్థానము వారు అందచేయుదురు



### నిత్యాన్న దాన పథకము

స్వామివారి అన్నదాన పథకమునకు విరివిగా విరాళాలు ఇవ్వండి. విరాళాలపై 80(జి) ఆదాయపు పన్ను మినహాయింపు కలదు




### కాటేజీల నిర్మాణం

శ్రీకాళహస్తి క్షేత్రాన్ని సందర్శించే యాత్రికులకు వసతి సదుపాయములను భక్తుల ఆర్థిక సహకారంతో ఒక్కో గది 2 లక్షల రూపాయలతో నిర్మించ దలచినాము. కైలాసనాధుని కోవెల సమీపంలో కాటేజీల నిర్మాణం మోక్షానికే మార్గం

పాలక మండలి సభ్యులు: జె.హరినాధబాబు, డి.దశరథరామయ్య, కె.ఈశ్వరయ్య, వి.ఎల్.నారాయణ, జి.రాజేంద్రప్రసాద్, అన్నపూర్ణమ్మ, వి.మస్తానయ్య, ముద్దుకృష్ణమరాజు

**శ్రీకాళహస్తీశ్వర స్వామి దేవస్థానం**



**కోలా ఆనంద్**
చైర్మన్, శ్రీకాళహస్తీశ్వర స్వామి దేవస్థానం

**జి.వి.నరసింహమూర్తి** B.Sc., LLB
ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ మరియు జాయింట్ కమీషనర్
శ్రీకాళహస్తీశ్వర స్వామి దేవస్థానం





వాళ్ళ కారు కదిలిపోయాక గమనించాడు దివాకర్... వసంత ముఖంలో సమస్య తీరిందన్న సంతోషం మచ్చుకైనా లేకపోవ డాన్ని.

"ఏం వసూ! అట్లా వున్నావ్. మన కొంపకి పట్టిన దెయ్యాన్ని డాక్టర్‌గారు వది లించారుగా" నవ్వుతూ అన్నాడు, ఆమె మనసు తేలికపరచటానికి ప్రయత్నిస్తూ.

వసంత కుటుంబ సభ్యులందరివైపూ చురుగ్గా చూసి అన్నది "దెయ్యాన్ని గురించి కాదండీ నేనాలోచిస్తున్నది. దెయ్యంలాంటి ఆ మనిషి గురించి. అనవసరంగా మన మనసుల్ని కలత పెట్టి... మన నిత్య చదువుకి గండికొట్టి ఆనందించిన ఆ మనిషెవడో నాకు తెలియాలి. నేను తెలుసుకుని తీరాలి"

**"దీనికంతటికీ... నువ్వే... నువ్వే... కారణం అయివుంటావ్. నువ్ హాస్టల్లో వుంటే... హాస్టల్ తగలబెట్టావ్... ఇంట్లో వుంటే ఇల్లు తగలబెట్టావ్"**

"ఒకవేళ నువ్వే నేమో... ఓడిపోతా నన్న పిరికితనంతో ఆత్మహత్య చేసుకోవాల్సి వస్తుందేమోనన్న భయంతో ఇట్లా చేశావేమో"

సహనం హద్దులు దాటిన దివాకర్ నోటి వెంట అనకూడని మాటలు వచ్చేసినై.

అలోక్ ఇన్‌వెస్టిగేషన్‌లో ఆ ఇంట్లోని అనర్థాలన్నిటికీ కారణం దెయ్యం కాదనీ, మనిషనీ తేలడాన్ని... దివాకర్ అర్థం చేసు కోగలిగాడు.

కానీ...వసంత అర్థంచేసుకోలేకపోతోంది. ఇంట్లోని ప్రతి ఒక్కరినీ... అనుమానిస్తూ, అవమానిస్తూ నాలుగురోజులకల్లా మానసి కరోగిలా తయారైంది. ఆ చేష్టలు దయ్యా నివే అనుకున్నన్నాళ్ళూ కూడా ఆమె అంతలా కుంగిపోలేదు.

భర్తనీ... బిడ్డనీ... తల్లినీ... తమ్ముడ్నీ చివరికి దూరాన వున్న అత్తగారి కుటుం బాన్ని కూడా... చీటికి మాటికి నిందిం చడం ఆరంభించింది. ఇవాళ ఉన్నట్టుండి "లీవిట్ మమ్మీ" అన్న నిత్య చెంపల్ని వాయించేసి "దీనికంతటికీ... నువ్వే... నువ్వే... కారణం అయివుంటావ్. నువ్ హాస్టల్లో వుంటే... హాస్టల్ తగలబెట్టావ్... ఇంట్లో వుంటే ఇల్లు తగలబెట్టావ్" అంటూ రంకెలేసింది. అడ్డు వచ్చిన నందూని కూడా చెంప చెళేల్ మన్పించబోయేసరికి దివాకర్ చప్పున ఆమె చెయ్యి పట్టుకుని వారించి ఆవేశంలో వసంతను అట్లా అనేశాడు.

వసంత దెబ్బతిన్న ఆడపులిలా చూసింది దివాకర్ కేసి. "ఏమన్నారు? ఆత్మహత్య చేసుకోవాల్సి వస్తుందన్న భయంతో నేనే ఈ ఘోరాలన్నీ చేశానా? ఇప్పుడే... ఈ క్షణమే ఉరేసుకు చస్తాను. చచ్చాక డిసైడ్ చెయ్యండి, నేను పిరికిదాన్నో కానో"

ఆమె ఏం చెయ్యబోతోందో దివాకర్ వూహించేలోపే.. హఠాత్తుగా బెడ్‌రూమ్‌లో దూరి చటుక్కున తలుపు మూసింది.

దివాకర్ నిలువెల్లా కంపించిపోయాడు. వసంత ఎంత ఆవేశపరురాలో బాగా తెలు సతనికి. అన్నంత పనీ చేసితీరే మనస్తత్వం ఆమెది. దివాకర్, నందూ తలుపులు బద్ద లయ్యేలా బాదుతున్నారు.

సౌభాగ్యమ్మ నిత్యని వాటేసుకుని ఘొల్లు మంటోంది.

లోపల వసంత ట్రాన్స్‌లో వున్నట్టుగా వుంది. చీర ఒక కొసని ఫ్యాన్‌కి ముడేసి రెండో కొసని మెడకు తగిలించుకుంది.

"అక్కా... అక్కా" అంటూ తలుపులు బాదుతున్న నందూకి చప్పున ఓ ఐడియా వచ్చింది. గబగబ వంటింట్లో కెళ్ళి మూల

నున్న చిన్న గ్రైండర్‌లోని పాత్రాన్ని తీసుకుని నిత్య బెడ్‌రూమ్‌లో కెళ్ళాడు. అదృష్ట వశాత్తూ ఆ వైపునుంచి తెరిచే వుంది తలుపు..

బాత్‌రూమ్ లోపలికెళ్ళి... వసంత బెడ్ రూమ్‌లోకి తెరుచుకునే తలుపుని పాత్రంతో ఒక్క బాదు బాదాడు. రెండు మూడుసార్లు ప్రయత్నించగానే... తలుపు మధ్యలో బద్ద లవడమే కాకుండా అటువైపు పెట్టివున్న బోల్ట్ లూజైపోయి తలుపు తెరుచుకుంది.

నందూ వెనకాలే నిలుచుని వున్న దివాకర్ ఒక్క వుదుటున లోపలికెళ్ళాడు. దివాకర్ లోపలికెళ్ళడం... వసంత స్టూల్‌ని తన్నడం ఒక్కసారి జరిగాయి.

అమాంతం ఆమె కాళ్ళను ఒడిసి పట్టుకున్నాడు. నందూ... వసంత మెడకున్న వురి తాడును తొలిగించాడు.

"ఆ హేతువాదులకేం తెల్సు... దెయ్యాలే కాదు. దేవుళ్ళు కూడా లేరంటారు. వాళ్ళు లక్షణంగా వున్న పిల్ల వురేసుకోబోయిందంటే... ఇది దెయ్యాల పనికాక మరేంటి? చిన్న చిన్న పన్లు వదిలేసి ప్రాణాలు తీసే పని పెట్టుకుందని మన మధ్య మనకు కలహాలు పెడుతోంది" అంటూ వాపోయింది సౌభాగ్యమ్మ.

ఆ రాత్రి వెక్కివెక్కి ఏడుస్తున్న వసంతకు దివాకర్ సారీ చెప్తుంటే వారించిందామె.

"మీరన్నారని కాదులెండి. నామీద నాకే రోత పుట్టింది. రేపు మీ వాళ్ళ ముందు ఏ ముఖం పెట్టుకుని నిలబడగలను? నా కలలన్నీ కల్లలైపోయాయి. ఇక ఏ ఆశతో బతకాలి నేను?" ఆమె కళ్ళలోంచి ధారాపాతంగా కారిపోతున్నాయి కన్నీళ్ళు.

"ఇప్పుడేమైందని వసూ! భవిష్యత్తే లేనట్టు మాట్లాడతావ్"

"భవిష్యత్ వుందో లేదో... ఈ వర్తమానాన్ని పాడుచేసిన ఆ మనిషి ఎవరో నాకు తెలియాలి. తెలిసి తీరాలి"

"తెలుసుకొని ఏం చేస్తావ్?"

"నా కలల సౌధాన్ని కూల్చిన ఆ మనిషి ప్రాణం తీస్తాను"

"అందుకే మనమంత బార్బేరియస్‌గా ఆలోచిస్తామనే ఆయన ఆ మనిషి ఎవరో బయటికి చెప్పలేదు. మానసిక దౌర్బల్యంతో ఆ వ్యక్తి ఆ పనులు చేశారని ఆయన ఒకవంక చెప్తూనే వున్నారుగా. సైకలాజికల్‌గా అప్‌సెట్ అయిన వాళ్ళని క్షమించాలి... గాని... శిక్షించకూడదు వసూ..." ఆమె ముంగురులు సవరిస్తూ అన్నాడు దివాకర్.

బదులివ్వకుండా కాసేపు వూరుకున్న వసంత ఉన్నట్టుండి అంది. "ఒకవేళ ఆయన... మనల్ని భయం నుండి బయట పడెయ్యడానికి.... దెయ్యంలేదు, గియ్యం లేదు. ఇదంతా మనిషిపనే అంటూ మనకి సైకలాజికల్ ట్రీట్‌మెంట్ ఇచ్చాడేమో..."

"అంటే నీ ఉద్దేశం.... దెయ్యం వుందనేనా?"

"అమ్మ కూడా అంటోంది."

"పిచ్చి వసూ! పడుకో."

"నాకేం పిచ్చిలేదు. ఆయన్తో మరోమారు కన్సల్ట్ అయి... ఈ అనర్థాలకి కారణం దెయ్యమా... మనిషా తేల్చి చెప్పమనాలి"

"ఓ... కె"

"మనిషే గనక అయితే... ఆ వ్యక్తి ఎవరో తెలుసుకోవాలి"

"సరేనన్నాగా... ఇక నిద్రపో. రేపే కాంటాక్ట్ చేస్తాను"

దివాకర్ అనుకున్నాడు మనసులో. తమకు పూర్తిగా ఫ్యాక్ట్స్ తెలియడం మంచిదనీ... లేదంటే వసంత మానసిక దౌర్బల్యానికి లోనయ్యేలా వుందనీ.

అయితే అలోక్ పరిశోధనల్ని సవాలు చేస్తూ ఆ రాత్రి.... దివాకర్ ఇంట్లో బీభత్సం జరిగింది.

గాఢ నిద్రపోతున్న నిత్య... అర్ధరాత్రి







దాటి ఒంటిగంట అవుతుండగా... రాళ్ళు పడుతున్నాయంటూ గగ్గోలుగా లేచింది.

ఇల్లంతా అక్కడక్కడ అర్ధ ఇటుక పరిమాణంలో వున్న రాళ్ళు పడివున్నాయి. వేసిన తలుపులు వేసినట్టే వున్నాయి.

బెడ్‌రూమ్, కిటికీ తలుపులు తెరిచివున్నాయి.

ఆ రాళ్ళసైజు... కిటికీ గ్రిల్స్‌లో పట్టేది కాదు. నిత్య తలగడ దగ్గరగా పడివున్న రాయిని చూస్తూ వసంత గుండెలు బాదుకుంది. ఇది నిత్య తలకు తగిలుంటే అన్న భావనతో నిలువెల్లా వణికిపోయిందామె.

ఇదంతా చూశాక దివాకర్‌కి కూడా వసంత కొచ్చిన అనుమానం లాంటిదే కలిగింది. మామూలు మనిషి చెయ్యగలిగిన పనులేనా ఇవి! ఉహూ... ఏదో అదృశ్య శక్తి మమ్మల్ని పట్టి వేధిస్తోంది.



"దెయ్యం వుందీ అని నమ్మినప్పటి కంటె... లేదని తెలిశాక మనశ్శాంతి కోల్పోయారు వాళ్ళు" మీరా అంది అలోక్‌తో.

" ఎగ్జాట్లీ మేడమ్" చెప్పాడు దివాకర్.

వెంటనే అంది వసంత "దెయ్యం వుందని ఇప్పటికీ నేను నమ్ముతాను"

అలోక్ చప్పున వసంతకేసి చూశాడు. ఆయన చూపులు "ఐ పిటీ యు"అన్నట్టుగా వుండటంతో వసంత కళ్ళు తిప్పుకుంది.

డాక్టర్ అలోక్ ఇంటి ముందున్న గార్డెన్‌లో కూర్చుని వున్నారు వసంతా,దివాకర్లు. వాళ్ళ సమస్య విన్న తరువాత సైంటిస్ట్ మీరాని కూడా పిలిపించాడాయన అక్కడికి.

"అది కాదు డాక్టర్... మీరు... మా ఇంట్లో జరిగే వింతలకు కారణం దెయ్యం కాదూ... మనిషని చెప్పారు. పైగా ఆ మనిషి ఇకమీదట అట్లాంటి పనులు చెయ్యనని మీకు హామీ ఇచ్చినట్టు కూడా చెప్పారు. అయినా నిన్న రాత్రి ఇంట్లో రాళ్ళు పడ్డాయి. హౌ...టు... డైజెస్ట్ దిస్? మూసివున్న తలుపుల్లోంచి రాళ్ళు వచ్చిపడ్డం మనిషికి సాధ్యమయ్యే పనేనంటారా? " అలోక్ తన అజ్ఞానానికి జాలిపడుతున్నవాడిలా చూడ్డం భరించలేని వసంత అడిగింది.

"సాధ్యమే" ఆయన కూల్‌గా అన్నాడు.

"అబ్సర్డ్... నేన్నమ్మను..." అన్నది వసంత.

పనికుర్రాడు ఒక పెద్ద ట్రేలో స్నాక్స్ సర్దిన ప్లేట్లూ, కాఫీ కెటిల్... కప్పులు పట్టుకొచ్చాడు. అందరికీ స్నాక్స్ అందించి... కెటిల్‌లోని కాఫీని కప్పుల్లోకి ఒంపి తలో కప్పు ఆఫర్ చేశాడు. తరువాత కెటిల్ వున్న ట్రేని అతను పట్టుకెళ్ళబోతుంటే "శివా దాన్ని ఇక్కడే వుంచు. ఎవరైనా మరో కప్పు తాగుతారేమో!" అన్నది మీరా.

వెళ్ళబోతున్నవాడల్లా "యస్ మేడమ్" అంటూ ట్రేని... అందరి మధ్యన వున్న టేబుల్‌పైన వుంచి తను కాస్త దూరంలో చేతులు కట్టుకొని నిలబడ్డాడు. అందరూ స్నాక్స్ తింటూ, కాఫీ సిప్ చేస్తున్నారు.

"అయితే... మీ ఇంట్లో ఆగడాలు చేసేది ముమ్మాటికీ దెయ్యమేనంటారు" అడిగాడాయన వసంతను.

"కాదనేందుకు ఆస్కారం కన్పించడంలేదు" అంటున్న వసంత దిగ్గున కుర్చీలోంచి లేచింది. ఆమే కాదు... అక్కడున్న అందరూ లేచి కంగారు పడిపోతూ దూరంగా జరిగారు.

పని కుర్రాడు టేబుల్‌పైన పెట్టిన ట్రేలోంచి ఇంతెత్తున లేచాయి మంటలు.

# మీ చిన్నారుల ఉజ్వల భవిష్యత్ కోసం...





# శ్రీ బాలసాయి

## రెసిడెన్షియల్ ఇంటర్నేషనల్ స్కూలు

మునగాలపాడు, కర్నూలు. ఫోన్: 08518 - 278737, సెల్: 98660 74951/952

భగవాన్ శ్రీ బాలసాయి గారి దివ్య ఆశీస్సులతో గత 7 సంవత్సరాలుగా
ఆధునిక విద్యతోపాటు ఆధ్యాత్మిక, మానవతా విలువలతో కూడిన విద్యనందిస్తూ,
అతి తక్కువ ఫీజులతో సాటిలేని సౌకర్యాలు అందిస్తున్న ఏకైక విద్యా సంస్థ
శ్రీ బాలసాయి రెసిడెన్షియల్ ఇంటర్నేషనల్ స్కూల్.

## శ్రీ బాలసాయి రెసిడెన్షియల్ ఇంటర్నేషనల్ స్కూల్ విద్యార్థుల ప్రతిభలు

| మా విద్యార్థుల ప్రతిభ | |
|---|---|
| హాజరైన వారు | - 123 |
| 500 పైగా | - 55 |
| 450 - 500 లోపు | - 30 |
| 400-450 లోపు | - 17 |

| సాధించిన అత్యధిక మార్కులు | |
|---|---|
| మ్యాథ్స్ | - 100 |
| సైన్స్ | - 100 |
| సోషియల్ స్టడీస్ | - 98 |
| తెలుగు | - 96 |
| హిందీ | - 95 |
| ఇంగ్లీషు | - 84 |

**Highest Marks in Optional Subjects 298/300**

| % of Marks (In Optionals) | No. of Students |
|---|---|
| 95% above | 5 |
| 90-95% | 28 |
| 80-90% | 47 |

**అడ్మిషన్లు జరుగుచున్నవి**

సాధారణ విద్యార్థులతో అసాధారణ ఫలితాలను సాధించడం
మా సంస్థ యొక్క ప్రత్యేకత.

## మా ప్రత్యేకతలు

★ నిష్ణాతులైన బోధనా సిబ్బంది మరియు సైన్స్ ల్యాబ్, మేథ్స్ ల్యాబ్, ఎల్.సి.డి. వంటి ఆధునిక బోధనా పరికరాలు. ★ వర్క్‌షాప్స్, సెమినార్స్, గెస్ట్ లెక్చర్స్ వంటి వినూత్న బోధనా పద్ధతులు. ★ 8వ తరగతి నుండి IIT ఫౌండేషన్ కోర్సు. ★ స్పోకెన్ ఇంగ్లీషు క్లాసులు, హ్యాండ్ రైటింగ్‌లో ప్రత్యేక శిక్షణ. ★ ఆహ్లాదకరమైన వాతావరణంలో విశాలమైన గదులతో కూడిన డార్మెటరీలు.



జస్ట్.... కాసేపే... చూస్తుండగానే చప్పున చల్లారి పోయాయి.

వసంత వణికిపోతూ... దివాకర్‌కి దగ్గరగా జరిగి కళ్ళు మూసుకొని నిలబడి వుంది. మంటలు ఆరిపోగానే అందరికంటే ముందు అలోక్ టేబుల్ దగ్గరకొచ్చాడు.

"ఖాళీ ట్రేలో మంటలా?" అన్నాడు మీరాకేసి చూస్తూ.

"ఆశ్చర్యంగా వుంది డాక్టర్" అంది మీరా.

అలోక్ పనికుర్రాడికేసి చూశాడు. వాడు ట్రేకేసే దిగ్భ్రాంతిగా చూస్తున్నాడు.

తేరుకున్న వసంత మెల్లగా అంది దివాకర్‌తో "ఒకవేళ ఇది... మనింట్లో దెయ్యం పనేమో!"

"ఏమంటారావిడ" అడిగాడు అలోక్ దివాకర్‌ను. దివాకర్ చెప్పటానికి తటపటాయిస్తుంటే వసంతే అన్నది "ఖాళీ ట్రే...లో మన కళ్ళెదుటే కారణం లేకుండా మంటలు లేచాయంటే... నాకేదో అనుమానంగా వుంది డాక్టర్"

"మీ వూరి దెయ్యం మీ వెంటపడి ఈ వూరికి వచ్చిందేమో!"

అలోక్ తనను ఎగతాళి చేస్తున్నాడనుకొంది వసంత.

"కళ్ళముందు ఇంత వింత సంఘటన జరిగినా మీరింకా ఇంత తేలిగ్గా మాట్లాడుతున్నారంటే..." అంటూ ఆపేసింది, ఇంకే మనాలో మాటలు దొరక్క.

"నేను జోక్ చెయ్యటం లేదు" అలోక్ స్వరం సీరియస్‌గా వుంది.

వసంత విజయగర్వంతో చూసింది దివాకర్‌వైపు. దెయ్యం ఉనికిపట్ల భయం కన్నా... తన అనుమానం నిజమైందన్న ఆనందం ఎక్కువైంది ఆమెలో.

డాక్టర్ అలోక్ మీరాకేసి చూస్తూ, " మీరా! మీరేమంటారు?" అన్నాడు.

"నన్నెందుకు డాక్టర్ అడగటం? ఇదెంత వరకు నిజమో నేరుగా దెయ్యాన్నే అడగండి" చెప్పిందామె.

వసంతా, దివాకర్లు ముఖాముఖాలు చూసుకున్నారు.

"ఓకే... కాల్ ది డెవిల్" అన్నాడాయన.

మీరా అటూ ఇటూ చూస్తుంటే... వసంత ఊపిరి బిగపట్టింది. మీరా ఓ దిశగా చేతిని చాపి రమ్మనట్టు పిల్చింది.

దివాకర్ కూడా టెన్షన్‌గా చూశాడా వైపు.

శివ నవ్వుకుంటూ మీరా దగ్గరకొచ్చాడు.

"దిసీజ్ అవర్ డెవిల్" అలోక్ వసంతకు చెప్పాడు శివాని వేలితో చూపిస్తూ.

ఏదో అడగబోతున్న వసంతను వారించి శివాతో అన్నాడాయన "మైడియర్ డెవిల్... ఖాళీ ట్రేలో మంటల్నెలా సృష్టించావో కాస్త వివరించు"

శివ గొప్పగా చెప్పాడు "ఖాళీ ట్రేలో పచ్చ భాస్వరం పొడిని



చల్లాను సర్"

అలోక్ వసంత వంక చూశాడు.

"ఎల్లో ఫాస్ఫరస్... హైలీ ఇగ్నిషియస్. దాన్ని ఎక్కడ చల్లినా ఇమ్మీడియెట్‌గా వాతావరణంలోని ఆక్సిజన్‌తో రియాక్టయి భగ్గున మంటలు లేస్తాయ్. ఆ ప్రదేశంలో ఫైర్ రేజ్ చేయగల వస్తువులు అంటుకో వచ్చు. ఏమీ లేకపోతే ఎంతగా గుప్పుమం టుందో అంత చప్పున చల్లారిపోతుంది. అమాయకుల్ని మోసగించటానికి ఉపయో గించే చీప్ ట్రిక్ ఇది"

ఆసక్తిగా వింటున్న వసంతకేసి మీరా నవ్వుతూ చూసింది. "ఇప్పుడు చెప్పండి... దెయ్యం మీ వెంటబడి వచ్చిందంటారా? "

"నేనెవరి వెంటబడీ రాలేదండీ... ఇదే మా వూరు" శివా నవ్వుతూ ఖాళీ కప్పులని, స్నాక్స్ సర్వ్ చేసిన ప్లేట్లనీ ట్రేలో పెట్టుకుని వెళ్ళిపోయాడు.

మౌనంగా వున్న వసంతతో డాక్టర్ అలోక్ అన్నాడు "సో... మీ ఇంట్లోని చిలిపి దయ్యానికి ఈ రకమైన ట్రిక్స్ చాలా తెలుసుండాలి. అయితే ఆ వ్యక్తి పూర్తిగా ఆ పనుల్ని స్పృహలో లేకుండా చేస్తాడు. వాళ్ళు ఇలాంటి పనులన్నిటినీ ఒక విపరీత మానసిక స్థితిలో చేస్తారు. ఎంత లాఘ వంగా చేస్తారంటే... ఎవరూ వాళ్ళని కని పెట్టలేరు. అసలా పరిస్థితుల్లో చేసిన పనులు వాళ్ళకి గుర్తు వుండవు కూడా"

డాక్టర్ చెప్పేదాన్ని అబ్బురంగా వింటు న్నారు వసంతా, దివాకర్.

"ఆ విపరీతమైన మనస్థితి అసలెందుక్క లుగుతుంది డాక్టర్!" దివాకర్ అడిగాడు.

"మనసు వికలమైన వాళ్ళలో ఇలాంటి అసాధారణ పరిస్థితి వస్తుంది. ముఖ్యంగా బాల్యం దాటి ఎదిగే పిల్లల్లో ఇది ఎక్కువ. అఫ్‌కోర్స్... పెద్దవాళ్ళూ... ఎక్సెప్షన్ కారు"

"మనసు వికలమైన వాళ్ళా?" ఆశ్చ ర్యంగా చూసింది వసంత దివాకర్‌వైపు.

"డాక్టర్ ఆర్థికంగా మేము ఉన్నతస్థితిలో లేకపోయినా... డబ్బుకోసం వెదుక్కునే పరి స్థితి కాదు మాది. మా ఇద్దరి పుట్టిళ్ళ





పరిస్థితి కూడా అదే. పెళ్ళయిన నాటినుండీ హాయిగానే బతుకుతున్నాం. ఒక్కగానొక్క కూతురు. ఆరోగ్యపరంగా గానీ... చదువు పరంగా గానీ ఆమెతో ఏ సమస్యా లేదు. అందరి కాపురాల్లో సహజంగా వుండే చిలిపి తగాదాలేగానీ మా జీవితాల్లో గాలి దుమా రాలేం లేవు. అటువంటి మా కుటుంబంలో ఎవరి మనసూ వికలం కావడానికి ఆస్కా రమే లేదు నో...వే" అన్నాడు దివాకర్.

"దేరీజ్ ఎ వే" అన్నాడు అలోక్.

వసంత సస్పెన్స్ భరించలేనట్టు అడి గింది. "ఓ.కె. డాక్టర్... మీ మాటలు నేను మనస్ఫూర్తిగా నమ్ముతున్నా. దయచేసి మా కుటుంబంలోని ఆ వ్యక్తెవరో చెప్పండి"

"చెబితే మీరా వ్యక్తిని అసహ్యించుకుం టారు. దాంతో ఆ వ్యక్తి మానసిక రుగ్మత మరింత పెరుగుతుంది. దానివల్ల నష్టమే గానీ లాభం వుండదు."

"నెవర్ డాక్టర్... అసహ్యించుకోం, ప్రామిస్"

"ఆ వ్యక్తి పేరు ఎవరికి చెప్పనని నేనూ వాగ్దానం చేశాను" డాక్టర్ ఇబ్బందిగా చూశాడు.

"అటువంటి పనులు ఇకమీదట చెయ్య బోనని ఆ వ్యక్తి కూడా మీకు వాగ్దానం చేశా రన్నారు. కానీ ఆ వ్యక్తి ఆ వాగ్దానాన్ని నిల బెట్టుకోలేదుగా!" అడిగిందామె కాస్త సీరి యస్‌గా.

"ఒకరి మీద ఒకరికి అనుమానం పెంచు కుని మనసుల్ని నరకం చేసుకునేకన్నా తెలు సుకోవటమే మేలని నా ఉద్దేశం డాక్టర్" దివాకర్ కూడా వసంతని సమర్థించాడు.

"వాట్ డూయు సే మిసెస్ మీరా?" అలోక్ మీరా వంక చూశాడు.

"బెటర్ టు రివీల్" అందామె.

"మీరావ్యక్తిని అపార్థం చేసుకోరుగా" ఇద్దర్నీ మార్చి మార్చి చూశాడు.

"నో డాక్టర్..."

"దయచేసి అప్‌సెట్ కావద్దు"

"ప్లీజ్ డాక్టర్" ఉద్వేగంతో కొట్టుకుపోతు న్నాయి వాళ్ళ గుండెలు.

"ఆ వ్యక్తి... నిత్య."




"చూస్తాను ఆ డాక్టర్ చెప్పింది అబ ద్ధమని తేలిందో... ఆయనమీద పరువు నష్టం దావా వేస్తాను"

"ఏదో చేద్దాం. నువ్వు ఎగ్జయిట్ కాకు" చెప్పాడు దివాకర్ వసంతకి.

ఇద్దరూ ట్రైన్‌లో రిటర్న్ జర్నీ చేస్తు న్నారు. డాక్టర్ అలోక్ చెప్పిన పేరు విన గానే మ్రాన్పడి పోయారు వసంతా, దివా కర్లు.

"నో... ఇట్ కాన్ట్ బి ట్రూ".. హిస్టీరిక్‌గా అరిచేసింది వసంత.

మీరా ఆమె భుజం తట్టి ఓదారుస్తూనే నెమ్మదిగా, "బట్... ఇట్స్ ట్రూ" అంది.

"మా నిత్య గురించి మీకేం తెల్సు! వెరీ యాక్టివ్..ఎప్పుడూ సంతోషంగా వుంటుంది. చక్కగా చదువుకుంటుంది. ఇంటర్ సెకెండియర్. తనకెన్ని మార్కులొ చ్చాయో తెలుసా? తొమ్మిది వందలా అరవై మార్కులు. ఇరవై తొమ్మిదో ర్యాంక్. ఎమ్‌సెట్‌లో మొదటి పది ఫస్ట్ ర్యాంకుల్లో ఒకటి తెచ్చుకుంటానని నాకు వాగ్దానం చేసింది. అటువంటి నిత్య... ఇటువంటి పనులు చేస్తుందంటే జస్ట్ ఐ కా న్ట్ బిలీవ్" వసంత పెదవులు రోషంతో అదురుతున్నాయ్.

"బట్ యు మస్ట్ బిలీవ్" ఆమె భుజం

మీంచి చెయ్యి తియ్యకుండా చెప్పింది మీరా.

"లేదు. మీ పరిశోధనలో ఎక్కడో లోపం ఉంది" ఆమె ఆరోపణకు అలోక్ బాధగా నవ్వాడు. "మా పరిశోధనల్లో కాదమ్మా, అమ్మాయి మనసులో ఉంది లోపం. అదెందుకో వికలమైంది"

"నిత్య మనసు వికలమవడమా!" ఆశ్చర్యపోయాడు దివాకర్.

"పుష్టిగా తింటుంది. చక్కగా చదువుతుంది. సరదాగా గడుపుతుంది. ఇదే మీకు తెలిసిన నిత్య. అవునా? " అడిగాడు అలోక్.

"ఎగ్జాక్ట్లీ. నిత్య దేనికీ దిగులు పడదు."

"దిగులు పడదు కాదు, దిగులు పడ్డట్టు కనబడదు... అనండి. మనసులోని వ్యాకులతని ఎక్స్‌పోజ్ చేస్తే ఏ సమస్యా ఉండదు. అట్లా చెయ్యని వ్యక్తుల్లోనే ఈ విపరీత ధోరణి కనబడేది"

"అయితే మా ఇంట్లో జరిగిన అనర్థాలన్నిటికీ కారణం మా అమ్మాయేనంటారు" వసంత ఓ నిర్ణయానికి వచ్చినదాన్లా అడిగింది.

"నేననటం ఎందుకు? ఇవాళ్టినుంచీ ఆ అమ్మాయిని అబ్జర్వేషన్‌లో పెట్టుకోండి. నిజం మీకే తెలుస్తుంది"

వసంత లేచింది. "ఓకే డాక్టర్. మళ్ళీ కలుస్తాం. ఎందుకో తెలుసా నిత్య అటువంటిది కాదు అని చెప్పడానికి"

దివాకర్, వసంతలు అలోక్, మీరాకి నమస్కారం చేసి బయటికి నడిచారు.

దివాకర్ హోటల్లో భోంచేసి ట్రైన్ ఎక్కుదామన్నా వసంత విన్లేదు. ఆమెకు దేని మీదా లేదు. ఆమె ధ్యాసంతా నిత్య మీదే. భోజనం తినకుండా రైలెక్కేశారు.

"వెళ్ళీ వెళ్ళగానే నిత్యను నిలదీస్తావా ఏంటి? " దివాకర్ భయంగా అన్నాడు.

"నిలదీస్తే నిజం బయటికి రాదని నాకు తెలుసు" చెప్పింది వసంత.

దివాకర్ వూపిరి పీల్చుకున్నాడు.

దివాకర్ వెండర్స్ దగ్గర అవీ ఇవీ కొన్నాడు గానీ... వసంత ముట్టుకోలేదు. కాఫీ మాత్రం వద్దనకుండా తాగింది.

ఊరు దగ్గర పడుతుండగా చెప్పాడు దివాకర్.

"వసూ! ఒకవేళ... నిత్య విషయంలో డాక్టర్ చెప్పింది ప్రూవ్ అయినా, సరే... నిత్యకీ విషయం ఎప్పటికీ తెలియకూడదు"

మౌనంగా తల ఊపుతున్న వసంత కళ్ళలో తిరిగిన కన్నీళ్ళు దివాకర్ గుండెల్ని వెచ్చగా తాకాయి.

★ ★ ★

"నేనడిగిన ఏ ప్రశ్నకీ ఆ డాక్టర్ సమాధానం చెప్పలేకపోయాడమ్మా. ముందా మనిషెవరో చెప్పమని నిలదీశా. నీళ్ళు నమిలేశాడు. అది దయ్యాల పనో, మనుషుల పనో నిజానికి తనకు తెలీదన్నాడు. మనం సైకలాజికల్‌గా దెయ్యం భయాన్నుండి బయటపడాలని అట్లా కల్పించి చెప్పాడట. నువ్వన్నట్టూ ఈ హేతువాదులకేం తెలుస్తుందీ దెయ్యాల గురించీ... దేవుళ్ళ గురించీ" అంది వసంత, 'ఇంతకీ ఎవరి పేరు చెప్పాడే డాక్టరు' అని ఆరా తీసిన సౌభాగ్యమ్మతో.

"ఓస్... దీని పేరు చెప్తాడేమోనని కలలు కన్నా కదక్కా" అంటూ నిత్యకేసి చిలిపిగా చూశాడు.

వసంత ఉలిక్కి పడింది.

"ఛ... ఏం మాటల్రా నందూ. నిత్య పేరెందుకు చెబ్తాడు? అట్లా జరుగుంటే అక్కడే ఆయన గొంతు పిసికేసి వచ్చేదాన్ని. ఇంకెప్పుడూ అట్లా అనకు"

తనేదో జోక్ చేస్తే... అక్క అంత సీరియస్ అయ్యిందేమిటా అని ఓ క్షణం విస్తుపోయాడు నందూ.

"అయితే మమ్మీ... ఈ ఇంట్లో దెయ్యం



ఉన్నమాట నిజమేనా?" అడిగింది నిత్య ఆలోచనగా.

వసంత నిత్య ముఖంలోకి నిశితంగా చూసింది. ఏ కల్మషమూ కనబడలేదామెకు ఆ ముఖంలో.

"డాక్టర్... ఐ విల్ ప్రూవ్ యు... రాంగ్" అనుకుందామె.

మళ్లీ అంతలోనే... "వాళ్ళు స్పృహలో లేని స్థితిలో ఆ పనులు చేస్తారు. మామూలుగా ఉన్నప్పుడు వారికవి గుర్తుండే అవకాశం లేదు" అన్న అలోక్ మాటలు గుర్తుకొచ్చాయామెకు.

"వసూ! మనమిక ఈ ఇల్లు ఖాళీ చెయ్యటం ఉత్తమం" సౌభాగ్యమ్మ అంది.

"ఇన్నాళ్ళు ధైర్యం చేసి కాపురముండటమే గొప్ప" అని కూడా అంది.

వసంత కళ్లలో నీళ్ళు తిరిగాయి. "ఈ ఇంటి కోసం తీసుకున్న లోన్ కూడా ఇంకా తీరలేదమ్మా"

"అమ్మేసి కట్టేద్దాంలే అక్కా" ఓదార్పుగా అన్నాడు నందూ.

"దెయ్యాల కొంపని పేరు పడ్డాక ఎవర్రా కొంటారు? ఉంటే ప్రాణాలకి తెగించి మనమే ఉండాలి లేదా పాడుబెట్టాలి" కళ్ళు తుడుచుకుంది వసంత.

"ఇక డిస్కషన్స్ ఆపుతారా" దివాకర్ విసుగ్గా అన్నాడు.

ఎక్కడి వాళ్ళక్కడ గప్ చుప్ అయిపోయారు. దివాకర్ ఎవరికో ఫోన్ చెయ్యాలని చూసి... అది డెడ్ అయి ఉండడం గమనించాడు.

నందూ అన్నాడు "బావా... మీరు వూరెళ్లిన దగ్గర్నుండీ అది పనిచెయ్యటం లేదు. నిన్న మన నిత్య కూడా ఫ్రెండెవరికో ఫోన్ చెయ్యాలని- రోడ్ మీదకెళ్ళి చేసుకుంది పాపం"

"అవును డాడీ... మా ఫ్రెండ్ కల్పనకు చేశాను. షార్ట్ టర్మ్ ఎగ్జామ్స్ అటెండ్ చెయ్యలేదుగా నేను. మళ్ళీ లాంగ్ టెర్మ్ కోచింగ్ ఎప్పట్నుంచి స్టార్టవుతుందో తెలుసుకుందామని చేశా" చెప్పింది నిత్య.

దివాకర్ ఫోన్ వైర్‌ని చెక్ చేస్తే... బయటవైపు ఓ చోట కట్ చేయబడి ఉంది.

"కోతులు కొరుకుంటాయ్ డాడీ..." చెప్పింది నిత్య.

ఆరోజు రాత్రి నిద్రపోకుండా... రెండు దాకా... అలర్ట్‌గా ఉన్నారు వసంతా దివాకర్లు. నిత్యలో ఏ కదలికా లేదు. ఆదమరచి నిద్రపోతోంది. ఆ రాత్రికాదు. అయిదారు రాత్రులు ఏ విపరీతం జరగలేదు.

సౌభాగ్యమ్మ... "నందూని వుంచి నేవెళ్తానే" అంది.

"ఇంకొక్క నాల్రోజులాగు, ఇద్దర్నీ పంపేస్తా" చెప్పింది వసంత.




"ఎంత విచిత్రమైన మనుషులుంటారో ఈ లోకంలో నీకూ నాకూ ఏం తెల్సు వసూ? ఒక కరోడ్‌పతి షాపింగ్ చేసేప్పుడు... ఎంత ఖరీదైన వస్తువునైనా కొంటాడట గానీ... లిప్‌స్టిక్ మాత్రం దొంగతనం చేసి తన ప్రియురాలికి కానుకగా ఇస్తాడట.

ఒక వ్యక్తి తన మూడేళ్ళ కొడుకుని సుత్తితో తలపై కొట్టాలనే కోరిక పదేపదే తనను వెంటాడుతున్నదనీ... ఆ భావనను తనలోంచి తొలగించమనీ ఒక సైకియాట్రిస్ట్ దగ్గరకు వెళ్ళాడట. ఇట్లాంటి వింతలు ఎన్నో ఈ లోకంలో.

సో... మన నిత్యే ఇటువంటి పనులు

చేస్తోందని డాక్టర్ చెప్పిన మాటల్ని కొంత వరకైనా నమ్మాలి మనం"

అలోక్ చెప్పిన విషయాన్ని తలుచు కొని... తలుచుకొని బాధపడుతున్న వసంతతో అన్నాడు దివాకర్.

"ఎందుకు నమ్మాలండీ... మీరు చెప్పిన మనుషులు పిచ్చొళ్ళయి వుంటారు. నా కూతురు పిచ్చిది కాదండీ" వసంతలో ఉద్రేకం.

ఆమెను ఓసారి ఎగాదిగా చూసి గాఢంగా నిట్టూర్చాడు దివాకర్.

"అయితే మనింట్లో దెయ్యం వుందంటావ్"

"వుండే వుంటుంది. నా కూతురు ఒక్క నాటికీ అట్లాంటి పనులు చెయ్యదు"

"నిత్య నీకే కాదు... నాక్కూడా కూతురే"

"ఆ విషయం గుర్తుంటే మీరిట్లా మాట్లాడరు"

ఇక వసంతతో వాదించి లాభంలేదని బ్రౌన్ పేపర్‌లో ప్యాక్ చేయబడి వున్న ఒక పుస్తకాన్ని టేబుల్‌మీద పెట్టి కాళ్ళు కడుక్కుందుకు బాత్‌రూమ్‌కెళ్ళాడు.

వసంతకి చిరాగ్గా వుంది.

తన బంగారు తల్లిని... తన గారాలపట్టిని వీళ్ళంతా ఎందుకిట్లా అంటున్నారు?

ఆలోచిస్తోన్న ఆమె దృష్టి యాదాలాపంగా దివాకర్ టేబుల్‌మీద పెట్టిన ప్యాక్‌పైన పడింది. అందుకుని విప్పదీసి చూసింది. దివాకర్‌కి అప్పుడప్పుడూ అట్లా బుక్స్ కొని చదవడం హాబీ. 'మనసు మర్మం' అని రాసుంది ఆ పుస్తకం మీద.

బాత్‌రూమ్‌లోంచి బయటకొచ్చిన దివాకర్ వసంత చేతిలో పుస్తకాన్ని చూస్తూ అన్నాడు.

"నీకు మల్లే... నేను కూడా... నిత్యని అనుమానించలేక... ఇదేదో అదృశ్యశక్తే అనుకొన్నాను. బుక్‌స్టాల్‌లో కొత్త బుక్స్



ఏమైనా వచ్చాయేమో చూస్తుంటే అనుకోకుండా కంటపడిందీ పుస్తకం. పేజీలు తిరగేస్తుంటే మనం ఖచ్చితంగా చదవాల్సిన బుక్ ఇది అన్పించింది. అందుకే కొన్నాను. మనసునీ... దాని తీరు తెన్నుల్నీ రచయిత అద్భుతంగా ఆవిష్కరించినట్టున్నాడిందులో"

అందరూ భోజనాలు చేసి పడుకున్న తర్వాత ఓపెన్ చేసింది బుక్. ముందుమాటలో డాక్టర్ సంజీవ్‌దేవ్ రాసిన ఒక వాక్యం వసంత మనసుకు హత్తుకుపోయింది.

"మనిషి మనసుకు మించిన శక్తివంతమైనది మరొకటి లేదు. 'చేయి' చేస్తుందేగాని మరేమీ చేయలేదు. 'కన్ను' చూస్తుందీ... చెవి వింటుందీగానీ మరొకటి చేయలేవు.

కానీ... మనసు ఆలోచిస్తుంది... అనుభూతినిస్తుంది... కల్పిస్తుంది... స్వప్నిస్తుంది. కంటిని చూడకుండా చేయగలదు. చెవిని వినకుండా చేయగలదు. చివరకు జీవాన్ని జీవించకుండా కూడా చేయగలదు... జీవించేటట్లూ చేయగలదు."

"ఎంత అద్భుతమైన విశ్లేషణ" అనుకోకుండా వుండలేకపోయింది వసంత.

ఆ పుస్తకాన్ని రాత్రి పన్నెండింటివరకూ చదువుతూనే వుందామె. అందులో ఉదహరించిన కొందరు మనుషుల చిత్రాతిచిత్రమైన ప్రవర్తన... ఆమెను ఆశ్చర్యంలో ముంచెత్తింది.

బానిసత్వాన్ని గురించి తానొక సర్వే జరుపుతున్నాననీ... ఆ సర్వేలో పాల్గొనవలసిందిగా కొంతమంది స్త్రీలను ఆహ్వానించాడట ఒక లాయర్. ఆ సర్వేలో పాల్గొన్న స్త్రీలను అతడు తాళ్ళతో బంధించి కొరడాలతో కొట్టాడు... విషయం బయటికి చెబితే... క్రిమినల్ కేసులు బనాయించి కోర్టుకు లాగుతానని బెదిరించేవాడట. ఒకసారి పాల్గొన్న ఏడుగురు స్త్రీలలో పద్దెనిమిది సంవత్సరాల యువతి కూడా వుంది. ఆమె ఈ విషయాన్ని తల్లిదండ్రులకు చెప్పడంతో అసలు విషయం బయటికి వచ్చింది. న్యాయవాది కోర్టులో నేరం అంగీకరించాడట.

"అందరి కళ్ళూ నీ మీదే! అందరూ నీ అందాన్నే చూస్తూ మైమరచిపోతున్నారు" అని ప్రియుడొకడు అసూయతో తన అందాల ప్రేయసితో అన్నప్పుడు అతని ప్రేమను నిలుపుకోవడానికి ఆమె బ్లేడుతో ముఖం నిండా గాట్లు పెట్టుకొని వికృతంగా చేసుకుందట.

హెర్క్యులీజ్‌కు తెరలుగా వచ్చేవట మార్పులు. ఆ సమయంలో అతనిలోని హత్యా ప్రవృత్తి మేల్కొనేది. యురిపిడీస్... హెర్క్యులీజ్ ఉన్మత్తతను వర్ణిస్తూ "అతని కళ్ళు గుండ్రంగా తిరిగేవి. పెదవి మూలల నుంచి నురుగు కారేది... మనసు మేఘావృతమయ్యేది. దారినబోయేవాళ్ళను చావబాదేవాడు" అని చెప్పాడు. ఆ తెర తొలగిన తరువాత తాను చేసినదేదీ అతనికి గుర్తు వుండేది కాదు. ఆ తెరలో తన బిడ్డలిద్దరినీ... సోదరుని బిడ్డల్ని, స్నేహితుణ్ణి, గురువును చంపుకున్నాడు.

హోమర్ రచించిన 'ఇలియడ్' అనే పుస్తకంలోని అజాక్స్... తాను శత్రువులను చంపుతున్నానన్న భ్రమలో... గొర్రెలమందను నరికాడు. పాశ్చాత్య దేశాలకు చెందిన మహావిజేత 'టామర్‌లీన్' మానవ కపాలాలతో పిరమిడ్లు నిర్మించాడు.

ప్రఖ్యాత చిత్రకారుడు వాన్‌గాగ్ తన కాలిని కోసి ఒక వేశ్యకు పంపాడు. చదవటం ఆపి... ఎన్ని విషయాల్ని సేకరించాడీ రచయిత అంటూ మెచ్చుకుంది వసంత.

నిద్రొస్తున్నట్టుగా అన్పిస్తుంటే... పుస్తకం మూసి దిండుకింద పెట్టుకుని పడుకుంది.

కళ్ళు మూసుకుంటే కనురెప్పల కింద

నిత్య రూపం కదిలిపోతోంది. అంటే... నిత్య కూడా... ఆ రచయిత ఉదహరించిన మనుషుల కోవలోకి వస్తుందా!

డాక్టర్ అలోక్ అన్నట్టూ... మనసు వికలమై... విపరీత ధోరణిలో తనేం చేస్తోందో తనకే తెలియని స్థితిలో...

నో... నా నిత్య... వాళ్ళలో ఒకతె కాదు... కాకూడదు.

వసంత ఇక ఆలోచించే శక్తి లేనట్టూ నిద్రలోకి జారిపోయింది.

★ ★ ★

"ఎక్కడికెళ్లావ్?" దురుసుగా అడిగింది వసంత.

"నువ్వేగా మమ్మీ షుగరైపోయింది తెమ్మన్నావ్" ఆశ్చర్యంగా అంది నిత్య.

వసంత తల గోక్కొని "ఆ... అవున్లే... మర్చిపోయాను" అంది, నిత్య అందించిన పంచదార పొట్లం అందుకుంటూ.

"ఇక నే వెళ్ళి చదువుకోనా?" అడిగింది నిత్య.

షార్ట్ టర్మ్ ఎగ్జామ్స్ రాయకపోయినా... లాంగ్ టర్మ్‌కి ప్రిపేరవుతూ ఉంది నిత్య.

వసంత తలూపింది. నిత్య తన రూంలోకి వెళ్ళి స్టడీస్‌లో మునిగిపోయింది.

బెడ్‌రూం కిటికీ బయట వైపుకుంది. చదువుతున్న నిత్యకు... తన్నెవరో అదే పనిగా గమనిస్తున్నట్టు అనుమానం వచ్చింది. వెంటనే తలెత్తింది. కిటికీ దగ్గర ఉన్న ఆకారం ఏదోగానీ... ఆ ఆకారాన్ని నిత్య పోల్చుకునేలోపే మాయమైంది.

"తన భ్రమేమో!" అనుకున్న నిత్య మళ్లీ చదువులో మునిగిపోయింది.

తిరిగీ అదే అనుభూతి. ఎవరివో కళ్ళు తనను వెంటాడుతున్నట్టు.

ఇందాకటిలా ఇప్పుడు చటుక్కున తలెత్తలేదు నిత్య. అసలు గమనించనట్లు... తన ధ్యాసలో తను చదువుతున్నట్టు కాసేపు ఉండిపోయింది.

## దక్కని పేపర్



ఓసారి ఏదో మీటింగ్‌కు వెళ్లారు రావికొండలరావు. అదింకా మొదలు కాకపోవడంతో పక్కనున్న షాపులో దక్కన్ క్రానికల్ పేపర్ కొనితెచ్చి చదువుకుంటున్నారాయన. కొంచెం సేపయ్యాక ఎవరో పిలిస్తే పేపర్‌ను కుర్చీలో ఉంచి బయటకు వెళ్లారు. కానీ వచ్చేసరికి పేపర్ మాయం.. కుర్చీలకింద అటూ ఇటూ మిత్రులంతా వెదికారు. దొరకలేదు. 'ప్చ్ పోన్లెండి అది నాకు దక్కని క్రానికల్ అనుకుంటాను' అన్నారాయన ఛలోక్తిగా.

ఆ కళ్ళింకా తనని గమనిస్తూనే ఉన్నాయని నిత్యకు స్పష్టంగా తెలుస్తోంది.

కేజువల్‌గా చూసినట్టూ తలుపువైపో సారీ... బెడ్ వైపోసారీ చూసింది. కిటికీ నంటిపెట్టుకున్న కళ్ళు కాస్త తటపటాయించి వెనక్కు వెళ్లడం... నిత్య తనను గమనించటం లేదన్న భరోసాతో మళ్లీ యధాస్థానానికి రావటం... ఏవీ... నిత్య చూపు దాటి పోలేదు.

మూడోసారి... అంతే కేజువల్‌గా కిటికీ వైపు చూసింది. ఆ కళ్ళు జంకాయి. ఆ కళ్ళ తాలూకూ తల... ఒక్క ఉదుటున వెనక్కి జరిగింది.

ఇంకాలస్యం చెయ్యలేదు. నిత్య హడావుడిగా లేచి కిటికీ దగ్గర కెళ్ళింది. ఆ ఆకారం అంతకంటే హడావుడిగా మాయమైంది.

ఆ ఆకారం అంత వేగంగా వెళ్ళిపోయినా ఒక అస్పష్టమైన అనుమానాన్ని... నిత్య మనసులో రేపింది.

వెనువెంటనే లేచింది నిత్య... తన అనుమానాన్ని నిర్ధారణ చేసుకునేందుకు నిశ్శబ్దంగా లేచి... తొందర తొందరగా



నడుస్తూ... కిచెన్‌లో కెళ్ళి తలుపు వారగా నిలబడింది.

నిత్య మనసులో అనుమానం నిజమైంది. వెనక్కి వెనక్కి తిరిగి చూసుకుంటూ వంటింట్లోకి వచ్చింది వసంత.

అక్కడ కూడా గుమ్మం దగ్గర తటపటాయించినట్టుగా నిలబడి... చప్పున లోపలకు దూరింది.

స్టౌ వైపు వెళ్ళబోతూ... తలుపు దగ్గర ఏదో అలికిడైనట్టుగా అన్పిస్తే తల తిప్పి చూసింది.

"ఇక్కడెందుకున్నావ్?" వసంత స్వరంలో తేడాని పసిగట్టింది నిత్య.

"మంచి నీళ్ళ కోసం వచ్చా మమ్మీ" చెప్పి వెళ్ళిపోయింది నిత్య.

ఇక స్టడీస్ మీద మనసు నిలవలేదు నిత్యకు. ఇవాళే కాదు... నిన్న కూడా అంతే... మమ్మీ ఎందుకో తనని పట్టి పట్టి

**"నీ మనసు బాధపడేలా మేమెప్పుడైనా నడుచుకున్నామా?" ఉన్నట్టుండి తల్లి అట్లా అడగటం చిత్రంగా అన్పించింది నిత్యకు.**

చూస్తోంది.

ఎందుకనీ?

చాలా సేపు ఆలోచించిన మీదట తట్టింది నిత్యకు. ఒకవేళ... తను శ్రద్ధగా చదవటం లేదేమోనని అనుమానం వచ్చి సీక్రెట్‌గా అబ్జర్వ్ చేస్తోందేమో!

ఆ రాత్రి భోజనాలయ్యాక పడుకునే ముందు నిత్య బాత్‌రూంకి వెళ్ళి వస్తుంటే...

"ఇంతకు ముందే వెళ్లావ్? మళ్లీ ఎందుకు?" అన్నది వసంత.

అది అర్థం పర్థం లేని ప్రశ్నగా తోచింది నిత్యకు. "నిన్నట్నుండీ చూస్తున్నా... నేనే పని చేస్తున్నా... ప్రశ్నిస్తున్నావ్"

నిత్య ముఖం నల్లగా అవటం గమనించింది వసంత.

వసంత ఏదో అనబోతుంటే దివాకర్ అన్నాడు. "మీ అమ్మకి కాస్త పైత్యం చేసిందిలే"

తండ్రి మాటలకు నిత్య నవ్వుకుంటూ పడుకొంది. నిత్య నిద్ర పోయిందన్న నమ్మకం కుదిరాక అన్నాడు దివాకర్ "వసంతా... నిత్యకు దొరికిపోతున్నావ్. అది హర్ట్ కాకుండా చూసుకో."

వసంత నిట్టూర్చింది. "ఏం చెయ్యనండీ... ఆ డాక్టర్ నిత్య గురించి అట్లా చెప్పినప్పటినుండీ నాకు మనసు మనసులో లేదు" అంది.

"అయినా వసూ! ఏ అర్ధరాత్రో, అపరాత్రో జరుగుతున్నాయ్ ఇన్నాళ్ళబట్టీ ఆ సంఘటనలు. రాత్రింబవళ్ళు కాపలా ఎందుకు? నైట్స్ అలర్ట్‌గా ఉంటే చాలదూ!"

నిజమే అన్పించింది వసంతకు. అయినా అనుక్షణం మనసులో ఆ ఆలోచనే. ఆమె ప్రమేయం లేకుండానే నిత్యను ఆమె కళ్లు వెంటాడుతున్నాయ్.

అయితే ఆమె మనోవాంఛ ఒక్కటే.

ఆ సంఘటనకు కారణం నిత్య కాకూడదు.

ఆ మరుసటిరోజు అనవసరంగా నిత్యను పిల్చి "సూటిగా నేనో మాట అడుగుతాను చెప్తావా?" అంది.

"అడుగు మమ్మీ" అంది నిత్య.

"నీ మనసు బాధపడేలా మేమెప్పుడైనా నడుచుకున్నామా?" ఉన్నట్టుండి తల్లి అట్లా అడగటం చిత్రంగా అన్పించింది నిత్యకు.

"లేదే" అంది.

"మరి నీ మనసెందుకు వికలమైంది?"

"నా మనసు వికలమైందని ఎవరన్నారు

మమ్మీ" తల్లి వేసే ప్రశ్నలు నిత్యకు అయోమయంగా ఉన్నాయ్.

"మనసు వికలమైన వాళ్ళు... ఓ విపరీత మనస్థితిలో ఇట్లాంటి పనులు చేస్తారు" అంటున్న డాక్టర్ అలోక్ వసంత మస్తిష్కంలో మెదిలాడు.

"ఒకరన్నారని కాదు- అట్లాంటి సిచ్యుయేషన్ ఎప్పుడైనా వచ్చిందా? " అడిగింది వసంత.

నిత్య తదేకంగా తల్లి కళ్లలోకి చూసింది.

వసంత భయపడింది. "నేనేమైనా పరిస్థితిని సీరియస్ చేస్తున్నానా? " అనుకుంటుండగా నిత్య అమాంతం తల్లిని చుట్టుకుపోయింది.

"స్వీట్ మమ్మీ! నువ్వు నా ప్రాణం. నీలాంటి మమ్మీ దొరకడం నా అదృష్టం. ఐ యామ్ వెరీ లక్కీ" పలవరిస్తున్నట్టుగా అంటోంది నిత్య.

వసంత అలాగే నిత్యను గుండెలకు హత్తుకుంది.

"నో... నిత్య అలాంటిది కాదు. ఖచ్చితంగా కాదు... కాకూడదు"

★ ★ ★

ఆరోజు కల్పన ఫోన్ చేసింది.

ఎమ్ సెట్ లో... నిఖితకూ... సాదియాకూ సీట్ వచ్చిందనీ... తనూ... తేజస్వినీ... లాంగ్‌టెర్మ్ కోచింగ్‌లో చేరబోతున్నామనీ... అయితే సత్యం రెసిడెన్షియల్ కాలేజ్ కాకుండా... వేరే కాలేజ్ లో చేరుతున్నామని చెప్పింది. నిత్య ద్వారా విషయం విన్న వసంత ఆ రోజంతా మూడీగా వుండిపోయింది.

"ఇప్పుడేమైంది వసంతా! అమ్మాయికి లాంగ్ టెర్మ్ కోచింగ్ ఇప్పిద్దాం. దాని ఫ్రెండ్సేదో కొత్త కాలేజ్ అంటున్నారుగా. అక్కడే చేరుద్దాం... నిత్యను కూడా" అన్నాడు దివాకర్.

"దాన్ని బయటకు పంపాలంటే భయంగా వుందండీ"

వసంత కళ్ళముందు రెండుసార్లు ఉరి వేసుకోబోయిన నిత్య కదలాడింది.

"ఏంకాదు... నువ్వు అనవసరంగా భయపడుతున్నావ్" దివాకర్ అన్నాడు. వసంత అటూ ఇటూ చూసి అక్కడ నిత్యగానీ మరెవరూ లేరని నిర్ధారించుకున్నాక మెల్లిగా అన్నది. "అది కాదండీ... నిత్యను రెండుసార్లు ఉరితాడు దగ్గరగా చూశాం. ఒకవేళ అది మనం అనుకుంటున్నట్టు దెయ్యం పని కావచ్చు.. లేదా డాక్టర్ చెప్పినట్టూ నిత్య పనికావచ్చు రెండిట్లో ఏదైనా... ప్రమాదం మన బిడ్డకే కదండీ" అన్నది. ఆమె చెప్పే దాంట్లో అక్షర సత్యాలున్నాయని దివాకర్‌కి తెలుస్తూనే వుంది. అయినా చెప్పాడు "అట్లా అని... మనం దాన్ని వదిలేస్తే..."

"ఉహు...వదలమని కాదు. అది ఖచ్చితంగా... స్టేట్‌ర్యాంక్ తెచ్చుకొని తీరాల్సిందే"

"పోనీ... ఈ ఊళ్ళో ఏదైనా మంచి కాలేజ్ చూసి డే స్కాలర్‌గా వేద్దామా? "

"అబ్బే... ఇక్కడి కాలేజెస్.. మన నిత్య తెలివితేటలకి న్యాయం చెయ్యలేవు. అసలీ ఇంట్లో వుంటే దాని చదువు సాగదు"

"మరేం చేద్దాం? " అడిగాడు.

వసంత ద్వైదీభావంతో కొట్టుకుపోతోందని దివాకర్‌కి అర్థమైంది. "సరే... ఇంకో నాలుగురోజులు అబ్జర్వ్‌చేసి... డిసైడ్ చేద్దాం" చెప్పింది వసంత.

★ ★ ★

మరో నాల్రోజులు గడిచినా ఏ సంఘటనా చోటుచేసుకోలేదా ఇంట్లో.

అందరి ప్రాణాలూ కాస్త తెరిపిన పడ్డట్టనిపించింది. వసంత తండ్రి వీలు చూసుకుని... సౌభాగ్యమ్మను పంపమనీ... నందూని మాత్రం వుంచేసుకోమనీ ఫోన్ చేశాడు. ఆయనట్లా నోరు తెరిచి అడిగాడంటే అదెంత అవసరమో వసంతకు అర్థమైపోయింది.







పొలం పనులు ముమ్మరంగా సాగుతున్నాయ్. ఇంట్లో ఆడదిక్కు లేకుంటే కష్టమే మరి.

"నీకు తోడుగా వుండాలనే వుందే అమ్మాయ్. అక్కడ ఎంతో ఇబ్బంది వుంటేగానీ మీ నాన్న..."

సౌభాగ్యమ్మ మాటల్ని మధ్యలోనే అందుకుంది వసంత.

"నాకు తెలుసులేమ్మా. నీ కూతుర్నేగా నేను. ఏంఫర్లేదు... నందూ వుంటాడుగా, నిశ్చింతగా వెళ్ళు. అసలు మీ అల్లుడికి ఆఫ్ అయివుంటే నందూని కూడా నాల్రోజులు నాన్నకి సాయంగా పంపేదాన్నే"

"ఇంతలో దివాకర్ ఓ మాటన్నాడు. పోనీ... ఓ పన్చెయ్యకూడదు వసూ!" ఏంటన్నట్టు చూసింది వసంత. సౌభాగ్యమ్మ కూడా అల్లుడేం చెబుతాడా అని ఆసక్తిగా చూసింది అతని వంక.

"శుభ్రంగా... నువ్వూ... నిత్యా... అత్తయ్యగారితో వెళ్ళిపోయి ఓ వారం వుండి రండి. నేను వచ్చి... మిమ్మల్ని తీసుకొస్తాను"

ఎగిరి గంతేశాడు అక్కడే వున్న నందూ.

"థేంక్స్ బావా! నైస్ ఐడియా". సౌభాగ్యమ్మ కూడా సంబరపడిపోయింది.

నిత్య మమ్మీ ఏం చెబ్తుందోనని చెవులు రిక్కించి వింటోంది. వసంత జాబ్‌హోల్డర్ కావడంవల్ల ఎప్పుడోగాని పుట్టింటికి పోదు. ఒకవేళ వెళ్ళినా శనివారం సాయంత్రం వెళ్ళి సోమవారం ఉదయం ఆఫీస్ సమయానికి వచ్చేసేలా వుంటుంది ఆవిడ ప్రోగ్రాం. అందుకే అందరూ అంత ఆసక్తి కనబరుస్తున్నారు.

"వెళ్ళొచ్చు కానీ..." వసంత నాన్చింది.

"ప్లీజ్ అక్కా... లాంగ్ లీవ్ ఆల్రెడీ పెట్టేవున్నావ్‌గా" నందూ అన్నాడు.

"అది కాదురా... నిత్య స్టడీస్..."

"మమ్మీ... ప్లీజ్ మమ్మీ... నా బుక్సన్నీ తెచ్చుకుని అక్కడ చదూకుంటా... ప్రామిస్" నిత్య తలమీద చెయ్యి పెట్టుకుంది.

"దాన్ని చెవులు పిండి చదివించే పూచీ నాది" నందూ చెప్పాడు. చెవులు తడుముకుంటూ నందూవైపు కొరకొర చూసింది నిత్య. "నువ్వు చెవులు పిండితే నేన్నీ ముక్కూ...గెడ్డం...నోరూ అన్నీ పిండుతా" అన్ని అర్థం వచ్చేలా సైగచేసి చూపించింది.

"అమ్మాయ్... పెద్దదాన్ని చెబ్తున్నా. అసలు మీరీ ఇల్లు వదిలి నాల్రోజులు దూరంగా వుంటేగాని మనసులు కుదుట పడవు. మనూళ్ళో... గుళ్ళూ గోపురాలూ చానా వున్నాయ్‌గా. అన్నీ తిరిగి దండం పెట్టుకున్నావంటే శని విరగడవుతుంది" చెప్పింది సౌభాగ్యమ్మ.

వసంత ఆలోచనలో పడింది.

ఆమె ఒంటరిగా వున్నప్పుడు దివాకర్ అన్నాడు "స్థలం మార్పిడి... నిత్య ఒంటికీ, మనసుకీ కూడా అవసరం"

"అంటే... మీరా డాక్టర్ మాటల్ని నమ్ముతున్నట్టేనా? " కోపంగా అంది.

"అది కాదు వసూ... ఇంకోవారం పదిరోజుల్లో మళ్ళీ దాన్ని హాస్టల్లో పడేస్తాం. కాస్త అదీ రిఫ్రెష్ అవుతుందని నా ఆశ... అయినా పుట్టింటికి వెళ్ళమంటే... ఆనంద భాష్పాలు రాలుస్తూ వెళ్ళే ఆడాళ్ళని చూశాగాని నీలా మీనమేషాలు లెక్కించే వాళ్ళని నేనెక్కడా చూళ్ళేదు" అన్నాడు.

"నా నుదుట దేవుడట్లా రాశాడు మరి. నిత్య గురించి ఆ డాక్టర్ లేనిపోని అనుమానం పెట్టాడా? ఒకవేళ... ఇదక్కడ ఏదైనా..."

"అంటే డాక్టర్ మాటలు నువ్వు నమ్ముతున్నావన్నమాట" ఇందాక వసంత తన్నడిగిన ప్రశ్నే ఇప్పుడు దివాకర్ ఆమెనడిగాడు నవ్వుతూ.

వసంత కూడా నవ్వింది "రిపార్టీ ఇస్తున్నారా? " ఆమె గోరంత నవ్వులో వున్న

కొండంత దిగుల్ని ఇట్టే పసిగట్టాడు దివాకర్.

"దేవుడు మనకు అన్యాయం చెయ్యడు వసంతా" అన్నాడామె చుబుకాన్ని మునివేళ్ళతో ఎత్తి కళ్ళలోకి చూస్తూ. ఆమె కళ్ళ నిండా నీళ్ళు.

"నా మాట విను. ఈ భయాలకూ... దెయ్యాలకు... దూరంగా నిత్యను నాలుగు రోజులు గడపనీ"

వసంత తలూపింది. తల్లి ఒప్పుకుందని తెలియగానే ఉప్పొంగిపోయింది నిత్య.

అమ్మమ్మగారి ఊళ్ళో తననెప్పుడూ పట్టుమని పదిరోజులు ఉంచలేదు వసంత. చదువు విషయంలో వసంత మహాస్ట్రిక్ట్. నిత్య కడుపులో వున్నప్పుడే... తన బిడ్డ ఏం చదవాలి... ఎట్లా చదవాలి... ఏ జాబ్ చెయ్యాలి... ఎక్కడ వుండాలి అనేది నిర్ణయించుకుందామె.

అందుకే ఎప్పుడూ నిత్యను తన కనుసన్నలలోనే పెంచింది. అమ్మమ్మ గారాబం... తాతయ్య అనురాగం నిత్యను చెడగొడతాయని ఆమె ప్రగాఢ నమ్మకం. పెద్దవాళ్ళ నిష్టూరం భరించలేక ఎప్పుడైనా వెంట తీసుకెళ్ళినా వెంటనే తీసుకొచ్చేది. దానికి తగ్గట్టూ సెలవులని పేరేగాని... కోచింగ్ క్లాసులపేర స్కూలు అనునిత్యం జరుగుతూనే వుండేది.

ఇక టెన్త్‌కొచ్చాక నిత్యకు అస్సలు తీరికే లేకుండాపోయింది. పరీక్ష ఫలితాలు రాకముందే కార్పొరేట్ కాలేజీల్లో అడ్మిషన్లు స్టార్టయిపోయాయి. మొదటి సంవత్సరం ఇంటర్మీడియట్ కోర్స్ అవగానే... సెకండియర్ సిలబస్ స్టార్టయిపోయింది. నో హాలిడేస్. సీనియర్ ఇంటర్ అయిపోగానే... షార్ట్ టెర్మ్ కోచింగ్ మొదలైంది. ఇదవగానే లాంగ్ టెర్మ్ కోచింగ్ మొదలవుతుంది.

ఆ తర్వాత... ఇంజనీరింగ్ కోర్స్ చెయ్యాలి. విదేశాల్లో ఉద్యోగం సంపాదించాలి. ఆ తర్వాత ఉద్యోగం... చేసుకుంటూ అక్కడే వుండాలి. అందుకే ఈ ఆటవిడుపు ఆనందంగా వుంది నిత్యకు.

ఎంతటి ఆనందం అంటే...

ఆమె డైరీ ఒక పేజీలో ఇట్లా రాసుకుంది.

ఆకాశంలో పయనిస్తున్నా. భుజాన తీపి స్వప్నాల మూటను మోసుకుంటూ కలల బేహారి ఎదురొచ్చాడు. వెదికి వెదికి కొన్నాను ఒక అపూర్వ స్వప్నాన్ని. దాని ఖరీదెంతో తెలుసా? నా జీవితం.




**తా**తయ్య మీసాల ఉయ్యాలలూగేను...

అమ్మమ్మ కళ్ళతో దోబూచులాడేను...

ఆడిన ఆటా అల్లరి... పాడిన పాటా పల్లవి...

మా జ్యోతి చిందులే... అందాల విందులు...

సన్నజాజి పువ్వులు... చందమామ కాంతులు...

సాయం సమయం... సన్నజాజి పందిరి... నులక మంచం... పక్కనే స్టూలు మీద రేడియో... రేడియోలో... ఘంటసాల, సుశీల పాట.

"పాట బాగుంది తాతయ్యా" నిత్య తన్మయంగా అంది.

"తాతా మనవరాళ్ళు... ఇవి తింటూ వినండి. పాటింకా వినసొంపుగా వుంటుంది" సౌభాగ్యమ్మ నేతి సున్నుండల ప్లేటు తెచ్చి... రేడియో పక్కనే స్టూల్ మీద పెట్టింది.



## చోరుడు

విశాఖలోని స్టీల్‌ప్లాంట్‌కు మిత్రులతో వెళ్లారోసారి కొండలరావు. తిరిగొచ్చే టప్పుడు కంపెనీవారు చూడకుండా ఒక చిన్నమొక్కను వేళ్లతో సహా పీకి జేబులో పెట్టేసుకున్నారు. మిత్రులు అది చూశారు. 'అదేంపని సార్? తప్పు కాదూ? ' అన్నారొ కాయన. 'ష్' అంటూ నోటిమీద వేలువుంచి పక్కనున్న బోర్డు చూడమని ఆయన సైగ చేశారు. అంతా చూశారు. దానిమీద స్టీల్ ప్లాంట్' అని ఉంది. 'స్టీల్ ప్లాంట్ అంటే మొక్కను దొంగిలించు అనేకదా అర్థం..' అన్నారాయన లోగొంతుకతో.

నిత్య తనొకటి తీసుకుని తాతయ్యకొకటి అందించింది.

"తాతయ్య మీసాల ఉయ్యాలలూగేను..." ఆ లైను హమ్‌చేస్తూ చప్పున ఆగి, "తాతయ్యా... నీ మీసాలతో చిన్నప్పుడు నేను వుయ్యాల వూగానా? " అంది.

"మీ అమ్మ నిన్ను ఉయ్యాల కూడా వూగ నిచ్చిందా? పాలసీసా ఇచ్చి.. నర్సరీలో కూర్చోబెట్టిందిగాని"

"అయితే ఇప్పుడు వూగనా తాతయ్యా"

"ఈ మీసాలు నావికావు తల్లీ. మీ అమ్మ మ్మవి. ఒక్క వెంట్రుక రాలినా విడాకులి స్తుందది"

"ఇస్తే ఇవ్వనీ తాతయ్యా... నువ్వు కో... అంటే... కోటిమంది అమ్మాయిలు క్యూలో నిలబడరూ. యూ ఆర్ టూ గ్లామరస్ తాతయ్యా" నిత్య ఆయన బుగ్గమీద ముద్దు పెట్టుకుంది.

"అదేదో మాకు పెట్టకూడదూ" అంటూ ఎంటరయ్యాడు నందూ, "చూడు తాతయ్యా' గారాలు పోయింది నిత్య.

టీవీ చూడ్డానికేమో... పదిమందిదాకా పోగయ్యారు. అయిదారుమంది పిల్లలూ... ముగ్గురు నలుగురు పెద్దవాళ్ళు వున్నారు.

సౌభాగ్యమ్మ "కాస్త దారి వదిలి కూర్చోం డర్రా" అని కసురుకుంది పిల్లల్ని. "ఏమే సీతమ్మా... కూతురి మనువు కుదిరిన ట్టేనా? " అంటూ ఓ స్త్రీని పలకరించింది.

"యాడమ్మా... వాళ్ళకి మరీ డబ్బు యావెక్కువ. మాటలు జరుగుతున్నయ్" అందామె.

సౌభాగ్యమ్మ బయటకి వచ్చి జాజిపందిరి కింద కూర్చుని వున్న నిత్యతో అంది. "వెళ్లి... నువ్వు కూడా టీవీ చూడవే. నాగే శ్వర్రావ్ సినిమా వస్తోంది"

"మమ్మీ తిడుతుంది" చెప్పింది నిత్య.

"దాని మొహంలే... చదివేప్పుడు చద వాలి. ఆడేప్పుడు ఆడాలి. చూడు పోమ్మా" నిత్యతో తాతయ్య అన్నాడు.

నిత్య వెళ్ళి టీవీకి కాస్త దూరంలో ఎదు రుగా వున్న మంచం మీద బోర్లాపడుకుని చూస్తోంది. నాగేశ్వర్రావ్... రాధిక 'మల్లె పూలు ఘొల్లుమన్నవీ' అంటూ స్టెప్పులేస్తు న్నారు.

టీవీ చూస్తున్న పిల్లలంతా ఒక్కసారి వెనక్కి తిరిగి చూసి మళ్ళీ సినిమా చూడ్డంలో పడ్డారు.

పాట అయిపోవస్తుండగా శీను వచ్చాడు. అందర్నీ దాటుకుని ముందుకు రాబో తుంటే... "పోరా మొద్దోడా ఎనక్కూర్చో పో" అన్నారంతా.

శీను మళ్ళీ అందర్నీ దాటుకుని వెన క్కొచ్చి కూర్చోబోతూ నిత్యను చూశాడు. నిత్య పలకరింపుగా నవ్వింది.

"బాగున్నావా? " అన్నాడు.

"మళ్ళీ పరీక్షకి కట్టకూడదూ" అంది.

వేడినీళ్ళు పోసుకుని వచ్చిన నందూ...

లుంగీ కట్టుకుంటూ... "ఒరే... మొద్దోడా... ఇట్లారా" అన్నాడు.

శీను చప్పున లేచి వెళ్ళాడు.

"జాంచెట్టెక్కి... దోరకాయలు నాలుక్కో సుకురా పో"

"ఈ చీకట్లోనా... పురుగూ, పుట్రా వుంటాయ్... వెళ్ళమాకరా మొద్దోడా" సౌభాగ్యమ్మ కేకేసింది.

"సాయంత్రం నిత్యడిగిందే. పొలం నుంచి వస్తూ తెద్దామనుకున్నా. మర్చిపోయా. ఆరున్నరకే చీకటా?" అన్నాడు నందూ.

"రేపు తింటాలే..." నిత్య అంటున్నా విన్పించుకోకుండా మొద్దోడు బాణంలా పరిగెత్తాడు. నిత్య భయపడ్డంతసేపు పట్టలేదు... పదిహేన్నిముషాల్లో... వాలాడు శీను. ప్యాంటు జేబులోంచి తీస్తుంటే వస్తున్నాయ్ కాయలు.

ఓ ఇరవై కాయల్దాకా... నిత్య పడుకున్న మంచం మీద పెట్టాడు.

ప్రయాణ బడలికతో లోపలి గదిలో నిద్రపోతున్న వసంత లేచింది నిత్యేదీ అనుకుంటూ హాల్లోకి వచ్చిన ఆమె... మంచం మీద పద్మాసనం వేసుక్కూర్చుని ఒళ్ళో దిండు పెట్టుకుని... జామకాయ కొరుక్కు తింటూ... సినిమా చూస్తున్న నిత్య కనబడింది.

"అనుకున్నా... నువ్విక్కడికొస్తే మాటినవని. పుస్తకం తీసుకుని మేడమీద గదిలో చదువుకో పో" అంది నిత్యను అసహనంగా చూస్తూ.

అంతకుముందు తేనెపట్టులా అన్పించిన జామకాయ చిరుచేదు చిలికినట్టు అన్పించింది నిత్యకి.

★ ★ ★

"అమ్మా! చాకలి చిన్నక్కొచ్చింది" కేకేశాడు నందూ లోపల కాఫీ పెడుతున్న తల్లిని.

"ఇంటర్ చదివావ్ సిగ్గులేదూ?" అంది పక్కనే నిత్య కోపంగా.

"చిన్నక్క అంటే చాలదా... చాకలి అని కులం పేరు తగిలించాలా?" విసుక్కుంది చిన్నక్కకు వినబడకుండా.

"అదా!" తేలిగ్గా అన్నాడు నందూ. "ఇక్కడ పద్ధతులంతే. కుమ్మరి రామన్న, కమ్మరి పాపన్న అంటూ కులంపేరు తగిలించే పిలుస్తారు"

"కనీసం ఒక్కరు పద్ధతి మార్చుకుంటే... ఇంకోరు ప్రయత్నిస్తారు" చెప్పింది.

"తమరి ఆజ్ఞ" అని, "అమ్మా... చిన్నక్కొచ్చింది" మళ్ళీ కేకేశాడు, ఈసారి చాకలి అనే పదాన్ని ఉపయోగించకుండా.

"దట్స్ గుడ్" చెప్పింది నిత్య.

"ఆ నందూ గాడెటో తగలడినట్టున్నాడు. పద్దురాసుకోవే నిత్య" అంది సౌభాగ్యమ్మ.

నిత్య నోట్‌బుక్కూ, పెన్నూ తీసుకుని రాయసాగింది.

చీరెలు ఏడూ... రవికలు... తొమ్మిదీ... పంచెలు నాలుగు...

"మన వసంతమ్మ కూతురు గదా!" చిన్నక్క అడిగింది.

"తెలీనట్టు అడుగుతావేమే" అంది సౌభాగ్యమ్మ.

"ఏం తెలుసనీ! బిడ్డ ఎప్పుడొచ్చినా రెణ్ణాళ్ళు కూడ వుంచదాయె వసంతమ్మ. చూసి శానాకాలమైందిగా. పిల్ల బాగా పొడుగొచ్చింది" మురిసిపోతూ అంది చిన్నక్క.

"అంతా దాని తాత పోలిక" గర్వంగా నిత్యకేసి చూసింది సౌభాగ్యమ్మ.

"తాతలాగే ఆరడుగులు పెరిగిందంటే ఇంగయినట్టే... నిత్యమ్మకు మొగుడే దొరకడు" కిలకిల నవ్వింది చిన్నక్క.

నవ్వి నవ్వి మళ్ళీ తనే అంది.

"తాతనిచ్చి చెయ్యాల్సిందే"

"అమ్మమ్మా... నేన్రాయను" అరిచింది నిత్య.





"ఊరుకోవే..." చిన్నక్కను గదిమింది సౌభాగ్యమ్మ.

"అవునూ... చిన్నబ్బాయిగారి కోడలు నీళ్ళోసుకుందటగా" ఆరాగా అడిగింది సౌభాగ్యమ్మ.

"రొండోనెల" చెప్పింది చిన్నక్క.

"పూజారి పెద్ద కూతురు కిష్టయ్యతో లేచిపోయిందని విన్నానే."

"లేచిపోవడం... తిరిగి రావడం అన్నీ అయినయ్‌గా. ఆడ్ని... రిజిస్టారీ పెళ్ళి జేసుకుందంట... మొగుడ్ని దీసుకుని ఇంటికొచ్చింది"

"పూజారి రానిచ్చాడా?"

"ఆ కనికిరాయీ పూజారయ్య ఒక్కటేగదమ్మా. గుమ్మంలోంచే తరిమేసెనే"

"ప్చ్... కులం కాకపోయే" సౌభాగ్యమ్మ నిట్టూర్చింది.

నిత్య చప్పున కల్పించుకుంది "ఈ కాలంలో కులాలూ, మతాలూ ఏంటమ్మమ్మా"

"ఈ కాలంలోనే తల్లీ కులాల కుమ్ములాటలు ఎక్కువైనయ్. అప్పట్లో కులమత భేదాలున్నా ఇట్లా ఒకళ్ళనొకళ్ళు చంపుకునేవాళ్ళుగాదు. సామరస్యంగానే వుండేవాళ్ళు" నిట్టూర్చింది సౌభాగ్యమ్మ.

"ఎంకట్రావ్ మూడో కోడలి తమ్ముడు మిలట్రీలో చేరాడంట" చెప్పింది చిన్నక్క.

"రమణయ్య కాలెట్టుంది?"

"మోకాల్దాకా... కట్టెయ్యిచ్చారుగా. లెయ్యడానికి నెలన్నా పట్టుద్ది."

"ఏమైంది?" అడిగింది నిత్య.

"కొండ గడ్డికి పొయ్యొస్తూ కాలుజారి పడ్డాడమ్మా" చెప్పింది చిన్నక్క.

"లీలావతి కాపురాని కొచ్చిందట్నా?"

"మొన్నొచ్చింది. నిన్న మళ్ళా... మొగుడితో దెబ్బలాడి ఎళ్ళిపోయిందట."

"అది మారదే. వాణ్ణి అమాయకుడ్ని జేసి ఆడిస్తుంది"

చిన్నక్క గొంతు తగ్గించి అంది... "వాళ్ళమ్మగారి వూరికాడ... ఆ మనిషికెవుడో వున్నాడంట్లే"

"శివా... శివా" అంది సౌభాగ్యమ్మ.

చిన్నక్క బట్టలు మూట గట్టుకొని భుజానేసుకు వెళ్ళిపోయింది.

"ఇన్‌ఫర్మేషన్ బ్యూరో వెళ్ళిపోయిందా?" అంటూ వచ్చాడు నందూ.

నందూ చేతిలో ఓ పంజరం... అందులో చిలకా వున్నాయ్. లోపల బాగా మగ్గిన జాంపండు కూడా వుంది.

పంజరాన్ని నిత్యకు అందించాడు... "ఎ గిఫ్ట్ టు నిత్యా... ఫ్రమ్ మొద్దోడు"

"ఉదయాన్నే జామచెట్టు ఎక్కాడంట. లటుక్కున చిలకని పట్టేశాడు" చెప్పాడు నందూ.

పంజరంలో చిలక అటూ ఇటూ తిరుగుతోంది. ముచ్చటగా చిలక్కేసి జాంపండుని దానికి దగ్గరగా వేలితో జరపబోయింది.

చటుక్కున ముక్కుతో వేలిమీద పొడిచింది చిలక.

"చిలక్కొట్టుడంటే అదే" చెప్పాడు నందూ.

మంట పుడుతున్న వేలిని... విదిలించుకుంటూ "రాక్షసి" అంది నిత్య చిలక్కేసి కోపంగా చూస్తూ.

నందూ తిరిగి నిత్య చేతిలోంచి పంజరాన్ని అందుకుని గంగరావి కొమ్మకు వేళ్ళాడదీశాడు.

స్నానం చేసి చీరె చుట్టుకుని వచ్చింది వసంత. అల్లంత దూరాన తల్లిని పసిగట్టి చటుక్కున చెట్టుకిందున్న మంచమీద కూర్చుండిపోయి... సీరియస్‌గా పుస్తకంలో తల దూర్చింది.

పంజరంలో చిలక ఒకటే గోల చేస్తోంది.

"ఎవడే దీన్ని తెచ్చింది?" కోపంగా వచ్చింది వసంత.

అక్క కోపం చూసి నందూ జారుకు

న్నాడు.

"దీని గోలకు ఇక నువ్ చదివినట్టే, నందూగాడు చేసే పన్లన్నీ ఇట్టే వుంటయ్"

చిలక గోలకు... ఓ పిల్లి గోడమీంచి మెల్లాలోకి దూకి... పైకి చూస్తూ అరు స్తోంది.

"ఇక నువ్వు తోడయ్యావా..." అంటూ వసంత... కొమ్మనుండి పంజరాన్ని విడదీసి "దీన్ని హాల్లో వుంచుతాలే... నువ్ చదు వుకో నిత్యా" అని పట్టుకెళ్ళిపోయింది.

మధ్యాహ్నం వెళ్ళి చూస్తే... చిలక అరుపులు మానేసి - నిశ్శబ్దంగా పడుకుని వుంది. పంజరంలోని జాంపండు అట్లాగే వుంది.

"చిలక దిగులు పడ్డట్టుందే" అంది సౌభాగ్యమ్మ.

నిత్య మళ్ళీ దానిచేత జాంపండు తినిపించాలని ప్రయత్నించబోయింది గానీ... అది మళ్ళీ పొడవబోయింది.

ఆ సాయంత్రం ఎదురింటి అరుగుమీద గాజుల మలారం దింపుకున్నాడో వ్యక్తి.

ఆడవాళ్ళంతా... చుట్టూ చేరారు.

ఒకటే గలగలలు... కిలకిలలు.

"వసంతమ్మా గాజులెయ్యించుకుందువురా" పిల్చింది ఎదురింటామె.

వసంత వెళ్ళి కాసేపటికి వచ్చింది. నిత్య తల్లికేసి చూసింది.

రెండు చేతుల్నిండా ఎర్రటి మట్టి గాజులు.

"బాగున్నాయా నిత్యా..." అడిగింది వసంత నిత్యని... ముందుకు చాపి చేతుల్ని.

"బ్యూటిఫుల్ మమ్మీ" చెప్పింది నిత్య.

వసంత లోపలికెళ్తుంటే... నిత్య మొబైల్ షోకేస్‌లో వున్న గాజులకేసి తొంగి చూసింది.

వసంత ఎందుకో ఇటు తిరిగింది.

"నిత్యా..."

ఉలిక్కిపడింది నిత్య. చప్పున పుస్తకంలో తల దూర్చింది. వసంత దగ్గర కొస్తుంటే నిత్య అనుకుంది. "ఇక క్లాసు పీకుతుందేమో దేవుడా!"

నిత్య ఆశ్చర్యపోయేలా... "గాజు లేయించుకుంటావా నిత్యా? " అంది.

నిత్య సంతోషంతో ఉప్పొంగిపోతూ "ఆఁ..." అంది.

"నీకీ గాజులు అలవాటు లేదేమో... అతని దగ్గర... వైట్ మెటల్ కూడా వున్న ట్టున్నాయి తెచ్చుకో పో" అంటూ ఇరవై రూపాయల నోటిచ్చింది.

నిత్య... వైట్ మెటల్ కాదు... చిలకపచ్చరంగు మట్టిగాజులు రెండు చేతుల నిండుగా వేయించుకుంది.

మురిపెంగా గాజుల వంకే చూసుకుంటుంటే చటుక్కున మనసులో మెదిలింది... చిలక.

పరిగెత్తికెళ్ళి పంజరం కేసి చూసింది. చిలక పండు ముట్టనేలేదు... దిగులుగా శూన్యంలోకి చూస్తూ పంజరంలో ఓ మూల ఒదిగిపడుకుని వుంది.

చప్పున... హాస్టల్ గుర్తుకొచ్చింది నిత్యకు.

కొన్నాళ్ళు వుండి చదువుకుని ఆనక బయటకొచ్చేసే హాస్టల్‌నే బందిఖానాలా తాను ఫీలవుతుంటే...

అసలెప్పటికీ... తనకి స్వేచ్ఛ దొరుకుతుందో తెలీని చిలక గుండె... ఏమంటుందో...

క్షణం కూడా ఆలస్యం చెయ్యలేదు నిత్య.

పంజరాన్ని మెల్లాలోకి తెచ్చి తలుపు తెరిచింది.

గునగునమంటూ చిలక బయటికి వచ్చి ఒక్కసారిగా... రెక్కలు విప్పుకుంది.

మరుక్షణం.. గంగరావి కొమ్మ మీదకు చేరిపోయి... నిత్యను చూసి ఫ్రెండ్లీగా అరిచింది.






ఆ వూళ్ళో ఒక ఎలిమెంటరీ స్కూలు... హైస్కూలు వున్నాయి. త్వరలో జూనియర్ కాలేజ్ వస్తుందని చెప్పాడు నందు. అక్కడ చదివేవాళ్ళు... ఎక్కువగా కూలీ నాలీ చేసుకునేవాళ్ళ పిల్లలే. స్థితిపరులూ... మధ్యతరగతి వాళ్ళూ... పక్క టౌన్‌లోని ఇంగ్లిష్ మీడియం స్కూళ్ళకు పిల్లల్ని పంపుతున్నారు.

చీకటితో ఐదున్నరకల్లా... టౌన్‌లోని అయిదారు ఇంగ్లిష్ మీడియం స్కూళ్ళ నుంచి బస్‌లు వస్తాయి వూళ్ళోకి.

నాలుగ్గంటలకే లేచి... నిద్ర కళ్ళతో రెడీ అయిపోయి... పుస్తకాల బ్యాగ్‌లూ.. క్యారేజీలు పట్టుకుని పిల్లలు బస్‌లెక్కేస్తారు. స్కూల్ అవర్స్ తరువాత... అక్కడే ట్యూషన్ వుంటోంది. అది ముగించుకొని ఇళ్ళకు చేరేసరికి... రాత్రి ఏడున్నర. స్నానాలు చేసుకొని హోమ్‌వర్క్ చేసుకునేటప్పటికి ఎనిమిదిన్నరా తొమ్మిది ఈజీగా అయిపోతుంది. మూసుకుపోతున్న కళ్ళను బలవంతంగా విప్పుకుని భోజనం చేసి బెడ్ మీద పడిపోతారు.

మరీ... మూడు నాలుగేళ్ళ పిల్లల్ని కూడా... చీకట్లలో లేపి స్కూల్ బస్ ఎక్కించడాన్ని ఆశ్చర్యంగా గమనించింది నిత్య.

పల్లెల్లో... ఏవేవో... వెన్నెలాటలు ఆడతారని విన్నది తను. అసలు వెన్నెలంటే ఏంటో తెలుసా... ఈ సోకాల్డ్ ఇంగ్లిష్ మీడియం స్కూళ్ళ పిల్లలకి. 'వీళ్ళ జీవితాల కన్నా టౌన్లలో... సిటీల్లో వుండే స్టూడెంట్స్ లైఫే మేలేమో... కనీసం అప్ అండ్ డౌన్ టైమన్నా సేవ్ అవుతుంది వాళ్ళకి అన్పించింది నిత్యకి.

ఆ రోజు నిత్యను... వసంత... తన చిన్ననాటి ఫ్రెండ్ క్రిష్ణవేణి ఇంటికి తీసుకెళ్ళింది.

వాళ్ళ పాప కూడా ఎమ్‌సెట్‌లో షార్ట్ టర్మ్ కోచింగ్ తీసుకుని ఎగ్జామ్స్ రాసిందట. సీటు రాలేదని... మళ్ళీ లాంగ్‌టెర్మ్ కోచింగ్‌లో చేర్పిస్తున్నారట. శ్రీ విద్యా రెసిడెన్షియల్‌లో కోచింగ్ నిన్ననే స్టార్టయిపోయిందట. పాప జాయినైపోయిందట... ఆమె చెప్పుకొచ్చింది. మీ పాపనే కాలేజ్‌లో వేస్తున్నావు అని అడిగింది.

"గుంటూరు... ప్రియదర్శినీ రెసిడెన్షియల్ కాలేజ్. మంచి పేరుంది దానికి" అంది వసంత.

"అనుకుంటే అన్ని మంచివేలే. స్ట్రెంగ్త్ ఇంప్రూవ్‌మెంట్ కోసం ఒకదాన్తో ఒకటి పోటీపడి చెబుతున్నారు. అసలు మా రిషిత చదివే కాలేజ్ అయితే పండగలక్కూడా సెలవులివ్వరనుకో. చాలా బాగుంటాయ్ స్టడీస్... మా పాపకి తొమ్మిదొందల ఇరవై మార్కులొచ్చాయి" గొప్పగా అంది క్రిష్ణవేణి.

"రిషిత" పేరు బాగుందే అనుకుంది నిత్య.

"మా నిత్యకు తొమ్మిది వందల అరవై మార్కులొచ్చాయి. ఇంటర్‌లో ఎమ్‌సెట్‌లో స్టేట్ ర్యాంక్‌కి ట్రై చేస్తోంది" ఇంకా గొప్పగా అంది వసంత.

"నిఖిల్ టెన్త్ కదూ!" అంది వసంతే మళ్ళీ.

"ఆఁ... ఉదయం వెళ్తే... రాత్రి ఎనిమిదిన్నరకొస్తాడు. ఎగ్జామ్స్ టైంలో తొమ్మిది దాటుతుంది. ఓ గంట హోమ్‌వర్క్ చేసుకుని... ఓ గంట చదువుకొని పడుకునేసరికి

పదవుతుంది. నీకో విషయం తెల్సా... వాడు వాళ్ళ నాన్నతో మాట్లాడి ఏడాదవుతోంది" నవ్వింది క్రిష్ణవేణి.

"అదేం" అంది వసంత ఆశ్చర్యంగా.

"టైం తల్లీ... వాడికి చదువుకుందుకే టైం చాలట్లేదు"

"టౌన్‌షిప్ నయం" అంది వసంత.

"ఎంతయినా ఈ జనరేషన్ స్టడీస్‌కి డెడికేట్ అయిపోయింది. ఇప్పట్లోలా అప్పట్లో మనల్ని కేర్ తీసుకుని వుంటేనా... ఈపాటికి ఏ అమెరికాలోనో, ఇంగ్లాండ్‌లోనో సెటిలై వుండేవాళ్ళం" గాఢంగా నిట్టూర్చింది. క్రిష్ణవేణి. భోంచెయ్యకుండా వదల్లేదు క్రిష్ణవేణి.

చింత చిగురు పప్పు... గుత్తొంకాయా... రసమూ.. నువ్వులూ, చింతపండు పచ్చడీ చేసింది.

వసంత వద్దంటున్నా వినిపించుకోకుండా "ఎప్పుడొచ్చినా హడావుడే.. అట్లా పలకరించి ఇట్లా పోతావ్. ఈసారి మాట్లాడకు" అంటూ పాయసం మినపగారెలూ చేసింది.

ఎనిమిదింటికి భోజనాలకుకూర్చున్నారు. వంటకాలన్నీ మహా రుచిగా వున్నాయి. చాలు చాలని చెయ్యి అడ్డం పెడ్తున్నా... గిన్నెడు నెయ్యి గుమ్మరించింది.

గడ్డపెరుగులోకి... వాళ్ళ పెరట్లో చెట్టుకి కాసిందంటూ... రసాల మామిడి పళ్ళు ఇచ్చింది.

భోజనాలయ్యేసరికి గుమ్మంలో బస్‌హారన్ వినిపించింది. క్రిష్ణవేణి కొడుకు నిఖిల్ బస్‌దిగి వచ్చాడు. పుస్తకాల బ్యాగూ, కేరేజ్ సర్దిన ప్లాస్టిక్ బుట్టా... హాల్లో ఓ మూల పడేశాడు.

"బాగున్నారా వసంతా ఆంటీ" అంటూ నిత్యని ఎవరన్నట్లు చూశాడు.

"వసంతా ఆంటీ కూతుర్రా... నిత్య... ఎమ్‌సెట్ చేస్తోంది" చెప్పింది క్రిష్ణవేణి. నిత్య 'హాయ్' అంది.

నిఖిల్ సిగ్గుపడుతూ 'హాయ్' అన్నాడు.

బయల్దేరుతుంటే క్రిష్ణవేణి వసంత నుదుట బొట్టుపెట్టి రవికల గుడ్డ ఇచ్చింది.

"ఆంటీని ఇంటిదాకా దిగబెట్టిరా" అంది నిఖిల్‌తో.

"పది కిలోమీటర్లుందా ఏంటి? రెండు వీధుల అవతలేగా" అని వసంత వారిస్తున్నా నిఖిల్ చెప్పులేసుకుని వెంట నడిచాడు.

"నిత్యక్కా! అన్నిట్లో ఏ కాలేజ్ బెస్ట్?" నడుస్తూ అడిగాడు.

"నేను చదివింది సత్యంలో. స్టడీస్ బాగుంటాయ్ మా కాలేజ్‌లో"

నిఖిల్ ఒక్కక్షణం తటపటాయించి అడిగాడు "సెలవులు బాగానే ఇస్తారాక్కా అక్కడ?"

"నో... హాలిడేస్ ఆదివారం కూడా హాఫ్‌డే వుంటుంది. స్లిప్‌టెస్ట్‌లు జరుగుతుంటాయ్ మామూలుగా"

"పండగలకి"?

"సిలబస్ కాకపోతే ఇవ్వరు. నైన్టీ పర్సెంట్ ఇస్తార్లే"

నిఖిల్ "ప్చ్" అన్నాడు.

దార్లో వసంతని చాలా మంది పలకరించారు. ఇల్లు సగం దూరంలో వుండగా "నిక్కీ... ఇకవెళ్ళు... వెళ్ళి హోమ్‌వర్క్ చేసుకో పోమ్మా" అంది వసంత.

పల్లెలో పెరుగుతున్నా... పైరగాలి పీల్చుకునే హక్కులేని... సగటు విద్యార్థి నిఖిల్... విధిలేక తిరుగుముఖం పట్టాడు.

★ ★ ★

మధ్యాహ్నం పన్నెండైంది.

వంట పూర్తిచేసి పక్కనపెట్టి... జిలేబీలు వత్తుతోంది సౌభాగ్యమ్మ. కూతురూ మనమరాలూ తింటారని ఆవిడ తాపత్రయం. వసంత సాయం చేస్తోంది. నాగభూషణం, నందూ ఉదయమనగా పొలానికి వెళ్ళారు. ఇక వచ్చేది సాయంత్రమే.







ఇంటి ముందున్న విశాలమైన ఖాళీస్థలంలో... శాఖోపశాఖలుగా విస్తరించిన గంగరావి చెట్టు కింద నులక మంచం మీద కూర్చుని వుంది నిత్య. చెట్టుమొదలు నానుకుని... చాపుకున్న కాళ్ళు ఒకదాని మీద ఒకటి వేసుకొని... షార్ట్‌టెర్మ్ కోచింగ్ టైంలో ఇచ్చిన ఫిజిక్స్ మెటీరియల్ చదువుతోంది నిత్య.

ఉదయం నుంచీ సమాధుల తోటలో ఆడిఆడి ఆలసిపోయిన శీను... భోజనంవేళ కావస్తుండడంతో ఇంటికి బయలుదేరాడు. వెళ్తూ వెళ్తూ... నాగభూషణంగారి ఇంటి ముందు ఆగి తొంగి చూశాడు. గంగరావి చెట్టుకింద నిత్య కనబడింది.

గబగబ లోపలికొచ్చి... జేబులోంచి దోర మగ్గిన జాంపళ్ళు తీసి... నిత్య ముందు నులకమంచం మీద పోశాడు. హఠాత్తుగా మంచం మీద పడుతున్న జాంపళ్ళను చూసి తలెత్తింది నిత్య.

"హాయ్... శీనూ నువ్వా... థేంక్యూ" అంది ఓ జాంపండు చున్నీతో తుడుచుకొని... నోట్లో పెట్టుకోబోతూ.

ఎక్కడ్నించి వచ్చారో ఇద్దరు పిల్లలు... శీను దగ్గరకి పరిగెత్తుకొచ్చి "నువ్వీడున్నావా మొద్దోడా! మీయమ్మ రమ్మంది" అన్నారు.

నిత్యకి చివుక్కుమంది. వాళ్ళు చూస్తే వేలెడులేరు. శీను చూస్తే అంతెత్తున్నాడు. వాళ్ళు... శీనూని "మొద్దోడా" అనడం నిత్యకు రుచించలేదు.

"రేయ్.. శీనూని 'శీనూ' అని పిలవండి. మొద్దోడు అన్నారో" చూపుడు

వేలితో బెదిరిస్తూ అన్నది.

"ఆళ్ళమ్మ కూడా అట్టే పిలుస్తది" ఓ గడుగ్గాయి అన్నాడు.

"ఆళ్ళమ్మక్కూడా చెప్పు... నే చెప్పిన మాట" అంది నిత్య.

వాడు గబగబ తలూపి... జాంపళ్ళకేసి కళ్ళప్పగించి చూడసాగాడు.

"తీసుకో" అంది నిత్య వాడితో.

వాడు చూసి చూసి లటుక్కున ఓ పండు తీసుకున్నాడు. శీను హడావుడిగా వాడి చేతిని పట్టుకుని... ఆ కాయ లాక్కుని వేరేది ఇచ్చాడు. వాడి వెనకాలే జారిపోతున్న నిక్కర్ని పైకి లాక్కుంటూ ఆశగా పళ్ళకేసి చూస్తున్న మరొకడిక్కూడా ఒకటి చేతిలో పెట్టాడు.

వాళ్ళు వెళ్ళిపోతూ "మీయమ్మ బేగీ రమ్మందిరోయ్ మొద్దోడా" అన్నారు.

నిత్య చటుక్కున మంచం దిగి... గంగరావికొమ్మ విరిచి... తరుముతున్నట్టుగా వెంటబడింది "ఏం చెప్పాన్రా... శీను అన్లేవూ" అంటూ.

తూనీగల్లా... అందకుండా పారిపోయారు వాళ్ళు.

నిత్య ఆ కొమ్మను శీనుమీద ఝుళిపిస్తూ "అసలు నిన్ననాలి. వాళ్ళు మొద్దోడా అంటే... ఆc... అంటావ్ సిగ్గులేదూ? "

శీను సిగ్గెందుకు లేదు అన్నట్టు అదోలా నవ్వాడు.

"ఇక మీదట... నిన్నట్లా ఎవరు పిల్చినా పలక్కు. సరేనా? " అంది.

శీను సరేనన్నట్టు తలూపాడు.

"శీనూ పరీక్షకు కట్టరాదూ. ఈసారి కష్టపడి చదివితే... ఖచ్చితంగా పాసవుతావ్" అంది.

శీను సరేనన్నట్టు తలూపాడు.

"అరె... మొద్దోడా ఇట్రారా" అంది సౌభాగ్యమ్మ పిండి అంటిన చేతుల్తో గుమ్మంలో నుంచుని.

"వెళ్ళొద్దు. శీనూ అని పిలిస్తేనే వెళ్ళు" అంది నిత్య లోగొంతుకతో.

శీను తటపటాయిస్తుంటే వినబడలేదేమో అనుకొని మళ్ళీ కేకేసింది సౌభాగ్యమ్మ.

"మొద్దోడా... పిల్చేది నిన్నేరా" అంటూ.

ఇక ఆగలేకపోయాడు శీను... గబగబ వెళ్ళాడు సౌభాగ్యమ్మ దగ్గరికి.

"అన్నం వేళ దాటిపోతోందిరా... పొలంనుంచి పాలేరెందుకో రాలేదు. ఇంద ఈ కేరేజ్ పట్టుకుపోయి తాతయ్యకిచ్చి రారా" అంది, పదకొండింటికే ప్లాస్టిక్ బుట్టలో సర్దిన కేరేజ్‌ని చూపిస్తూ.

శీను వెంటనే అందుకున్నాడు ప్లాస్టిక్ బుట్టని, అమ్మ పిలిచిందన్న విషయాన్ని పక్కనపెట్టి. వాడు గేటు దాటుతుంటే చెప్పింది నిత్య "మొద్దోడా... అని పిలిస్తే... పలకొద్దన్నా, పలికావ్ కదూ... ఇక నీతో మాట్లాడను"

ఆరోజు సాయంత్రం అయిదు నుంచే పవర్‌లేదు. మామూలు పవర్‌కట్ ఏమో నని చాలాసేపు చూశారందరూ. ఏడవు తున్నా కరెంట్ రాలేదు. ట్రాన్స్‌ఫార్మర్ చెడిపోయిందని చెప్పుకుంటున్నారంతా.

పిల్లలంతా కలుగుల్లోంచి బయటపడ్డట్టూ వీధుల్లోకొచ్చారు. ఎక్కువమంది గవర్న మెంట్ స్కూలు పిల్లలే. ఇంగ్లిష్ మీడియం బస్‌లింకా రాలేదు. వచ్చే వేళయింది. ఏడు నుంచే మొదలయ్యే డైలీ సీరియల్స్‌ని రోజూ సీరియస్‌గా చూసే ఆడాళ్ళంతా ఇవాళ గుమ్మాల్లో చేరిపోయారు.

వెన్నెల్లో పరిసరాలు... బ్లాక్ అండ్ వైట్ సినిమాలా వున్నాయి. పిల్లలు విజృంభిం చారు.

ఒప్పులకుప్పా... ఒయ్యారిభామా... గూట్లో రూపాయ్... నీ మొగుడు సిపాయ్ అంటూ కొందరాడపిల్లలు చేతుల్చేతులు పట్టుకుని గిర్రున తిరుగుతుంటే... కొందరు... చెమ్మచెక్కా... చేరడేసి మొగ్గా... అంటున్నారు.

"గుడికెళ్దాం వస్తావా" అనడిగింది పక్కింటి హైమావతి. హైమావతి ఆవూళ్ళో స్కూల్ ఫైనల్ చదువుతోంది.

కుట్లూ అల్లికలూ మహా ఇష్టం హైమావ తికి. శారీస్ మీద మిర్రర్ వర్క్ అద్భు తంగా చేస్తుంది. ఆమె వర్క్ చేసిన పావళ్ళూ... చీరెలూ చూసి నిత్య తెగ ముచ్చటపడి పోతుంటే "నువ్వేళ్ళలోపు అద్దాలు కుట్టటం నేర్పుతాలే" అని చెప్పింది.

"సరేలే ఆలోపు అయిదారు ఈక్వేషన్లు నేర్చుకోవచ్చు ఆ క్రియేటివ్ వర్క్ చేసుకునే అదృష్టం నాకెక్కడుంది" అనుకుని గాఢంగా నిట్టూర్చింది.

హైమావతి గుడికి రమ్మంది 'వెళ్తా' నంటూ వసంత నడిగింది.

వసంత ఆలోచిస్తుంటే... సౌభాగ్యమ్మ కేకలేసింది "అసలేంటే నువ్వు. దాన్ని గాలి కూడా పీల్చుకోనివ్వవా? ట్రాన్స్‌ఫార్మర్ చెడి పోయి చచ్చిందిగా. ఈ రాత్రికి కరెంటొ చ్చేది లేదు, నీ కూతురు సతికేదీ లేదులే"

నిత్య హైమావతి వెంట బయల్దేరింది.

దార్లో ఓ స్కూల్ చూపించి... "ఇదీ మా స్కూల్" అంది.

నిత్య ఒక్క క్షణం ఆగి స్కూలుకేసి కన్నా ర్పకుండా చూసింది.

పుచ్చపువ్వులా... పరచుకుంటున్న వెన్నెల్లో... స్కూలు బిల్డింగ్ స్పష్టంగానే కనబడుతోంది.

గేటుకూ... స్కూల్ భవనానికీ మధ్య బోలెడు ఖాళీ స్థలం. ఖాళీ స్థలం చుట్టూ... ప్రహరీగోడ వుంది. ప్రహరీగోడ అవతల ప్రదేశం... చెట్లతో నిండిపోయి అడవిలా వుంది. ప్రహరీకవతల స్కూలు ఆవరణలో ఓమూల చిన్న తోటలాంటిది వుంది.

చీకటీ... వెన్నెలా... కలబోతలా ప్రహ రీకి అవతలా ఇవతలా చెట్లున్నాయి.

"ఆ తోట మేం పెంచుతున్నాం" చెప్పింది హైమావతి.

"మీకు తోటపని చేసేంత తీరిక వుంటుందా? " ఆశ్చర్యపోయింది నిత్య.

"ఎందుకుండదూ!" ఇంకా ఆశ్చర్యపో యింది హైమావతి.

"చదువుకోవద్దా" అన్నది నిత్య.

"ఎందుకు చదువుకోం. మా టీచర్లు ఏ



రోజు పాఠాలు ఆరోజు చక్కగా చదివి స్తారు. స్కూల్ తరవాత రోజుకిద్దరం చొప్పున తోటపని చేస్తాం"

ఒక్కసారిగా గుర్తుకొచ్చింది నిత్యకు తను చదివిన ఇంగ్లిష్ మీడియం స్కూల్. తను ఎల్ కేజీ నుండి ఎస్సెస్సీ వరకూ అక్కడే చదివింది.

నాలుగంతస్తులు... అంతస్తుకు అయిదు గదులు... ఫ్యూచర్‌లో నాలుగంతస్తుల రైలు ఎవరైనా కనిపెడితే అచ్చం నిత్య చదివిన స్కూల్లాగే వుంటుంది. ముప్ఫయి మంది కూర్చునే కెపాసిటీవున్న గదుల్లో యాభైమందిని కూర్చోబెడతారు. ఎప్పుడూ స్టడీస్... స్టడీస్. దాదాపుగా ఎక్స్‌ట్రా కరిక్యులర్ యాక్టివిటీస్ వుండవనే చెప్పాలి.

"మా స్కూల్లో సంగీతం, డ్రాయింగ్, కుట్లూ... అల్లికలూ అన్నీ నేర్పుతారు" వింటూ నడుస్తోంది నిత్య.

"మా టీచర్ నాకు... అద్దాలు కుట్టడం నేర్పింది. ఇంకా పది రకాల కుట్లు వచ్చు నాకు"

"ఇవన్నీ నేర్చుకుంటూ మీరెట్లా చదువుకుంటారు హైమా? మాకైతే ఎప్పుడూ స్టడీసే" అంది నిత్య.

"తెల్సులే. మా తమ్ముడ్ని టౌన్‌లో ఇంగ్లిష్ మీడియంలోనేగా వేశారు. ఉదయం ఐదున్నరకు వెళితే రాత్రి ఎనిమిదింటికి వస్తాడు. వచ్చాక్కూడా పడ్డాకా చదువుతూనో... రాస్తూనో వుంటాడు. మళ్లీ నాకంటే క్లెవరేం కాదు" చెప్పింది హైమ.

దారంతా ఎక్కడ ఖాళీస్థలం వుంటే అక్కడ పిల్లలు కేరింతలు కొడుతూ ఆడుతున్నారు.

మేకపులీ, దాగుడుమూతలు, తొక్కుడు బిళ్లా... వాటి పేర్లు కూడా నిత్యకు తెలియవు. హైమావతిని 'అదేం ఆట' అని అడిగి తెల్సుకుంటూ నడుస్తోంది.

"నాగభూషణం గారి మనుమరాలివి కదూ! ఏం చదూతున్నా!"

"ఓమ్మోయ్ హైమా... వసంత కూతురు కదూ! ఎప్పుడొచ్చింది" దారంతా పలకరింపులూ... చిలకరింపులూ...

మాటల్లోనే శ్రీక్రిష్ణాలయం వచ్చేసింది.

బయటే చెప్పులొదిలి... గుడి ఆవరణలో ఓ మూలగా ఉన్న బోరింగ్ దగ్గర కాళ్లు కడుక్కున్నారిద్దరూ.

విశాలమైన ఆవరణలో అక్కడక్కడా గుండ్రంగా కూర్చుని పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు కొందరు. హైమావతి నేరుగా గర్భగుడి దగ్గరికెళ్లి పూజారికి... పూల సజ్జ అందించింది.

దేదీప్యమానంగా వెలిగిపోతున్నాయి. దేవుడికి అటూ ఇటూ వెలిగించిన దీపస్తంభాలు ఆ కాంతులు పడి... ధగధగ మెరిసిపోతున్నాయి... క్రిష్ణ విగ్రహానికి అలంకరించిన ఆభరణాలు.

విగ్రహం ముందు వెండి పళ్లెంలో ఎర్రని కుంకుమ రాశిపోసి వుంది. తన్మయంగా కళ్లు మూసుకుంది నిత్య. పూజారి మంత్రాలు చదువుతూ పేర్లు అడిగాడు. హైమావతి తన కుటుంబంలోని వారందరి పేర్లూ చెప్పి నిత్య పేరు కూడా చెప్పింది.

కొబ్బరికాయ కొట్టి... సగం చిప్పలో వేలెడు పూలూ కుంకుమా, పసుపు పొట్లాలు పెట్టి హైమావతి దోసిట్లో పెట్టాడు. నిత్య చేతిలో కాసింత కదంబమాల పెట్టాడు. ఇద్దరి తలలమీదా శఠగోపం వుంచి దీవించాడు.

ఇద్దరూ గర్భగుడిలోంచి గుడి ఆవరణలోకి వచ్చారు.

నాలుక్కాళ్ల మండపాన్ని చూపించి "అక్కడ కూర్చుందాం" అంది హైమావతి. ఇద్దరూ వెళ్లి మంటపంలో కూర్చున్నారు. హైమావతి కొబ్బరిచిప్పను నేలకేసి కొట్టి ముక్కను నిత్యకందించింది.

నిత్య కొబ్బరిముక్క కొరుకుతూ... పరిస







రాలన్నీ పరిశీలనగా చూస్తోంది. ఇదివరకు తల్లితో కల్సి... ఒకటి రెండు సార్లు గుడికి వచ్చింది గాని... పండగలకి... జనం కిక్కిరిసి ఉన్నప్పుడొచ్చింది.

క్యూలో తోసుకుంటూ వెళ్లటం... పూజారి హడావుడిగా మంత్రాలు చదువుతూ కొబ్బరికాయ కొట్టడం... ప్రసాదం నోట్లో వేసుకోగానే ఇంటికి పరుగెత్తడం... ఇంతే.

ఇవ్వాళలా... యింత హాయిగా, ప్రశాంతంగా ఎప్పుడూ కూర్చోలేదు.

ఆలయం ధ్వజస్తంభంమీది చిరుగంటల సవ్వడి... గుడి గోపురం మీద పావురాల కువకువలూ... ఆగి ఆగి వీస్తున్న చిరుగాలిలోని పూల పరిమళం... మంటపం మీద వెలిగిపోతున్న చందమామ...

"కోనేరు చూద్దాం రా... వెన్నెట్లో భలే వుంటుంది" హైమావతి లేచింది. ఇద్దరూ... గుడికి తూర్పువైపున ఉన్న కోనేటి గట్టుమీదకు చేరుకున్నారు. గట్టంతా రాలివున్నాయి పున్నాగపూలు.

హైమావతి కొమ్మ అందుకుని వూపేసింది. నిత్య తలమీద పున్నాగపూలు జలజల రాలిపడ్డాయి. హైమావతి కిలకిల నవ్వింది. భుజం మీద రాలి పడిన ఓ పువ్వును అందుకుని గాఢంగా వాసన చూసింది నిత్య.

ఇద్దరూ గుడిబయటకొచ్చి చెప్పులేసుకున్నారు. గుడికి పదడుగుల దూరంలో అబ్బాయిలు కబడ్డీ ఆడుతున్నారు.

కబడ్డీ... కబడ్డీ... కబడ్డీ... కబడ్డీ...

ఆ గొంతేదో చిరపరిచితంగా అనిపించి అటు చూసింది నిత్య. దూరంగా వుండటాన చీకట్లో పోల్చుకోలేక కళ్లు చిట్లించి చూసింది.

"ఏంటీ చూస్తున్నావ్" అంది హైమావతి.

"కబడ్డీ... కబడ్డీ... అంటున్న అబ్బాయెవరు? " అడిగింది హైమని.

"వాడా... మన మొద్దోడు" అంది హైమ.

మొద్దోడు తెచ్చిచ్చే... తీపి జాంపళ్ళు గుర్తుకొచ్చి మనసు చివుక్కుమంది నిత్యకు.

"ఎవరో... ఏదో అంటారు. మనం చదువుకుంటున్న వాళ్ళం మొద్దోడా అంటే ఆ అబ్బాయి బాధపడడూ" అంది నిత్య.

"వాడికి... బాధా" హైమావతి ఒక్కపెట్టున నవ్వింది. నిత్య ముఖం మాడ్చుకోవటం గమనించి "సర్లే... శీనూ అని పిలిస్తాలే" అంది.

శీను దూరం నుండే వీళ్ళని గమనించి పరిగెత్తుకొచ్చాడు. జేబులోంచి రెండు జాంపళ్ళు తీసి "ఇందాక మీ ఇంటికెళ్తే... మీరు లేరు" అంటూ ఇచ్చాడు.

"థేంక్యూ శీనూ" అంది నిత్య అందుకుంటూ.

ఆ పల్లెదారిలో... చల్లగాలిలో వెన్నెల వెలుగులో నడుస్తున్న నిత్య జాంపండు మునిపంట కొరుక్కుంటూ అనుకుంది "భగవంతుడా! నేనీ వూళ్ళో వున్నన్ని రోజులూ... ఈ ట్రాన్స్‌ఫార్మర్ బాగవకుండా చూడు"

★ ★ ★

సౌభాగ్యమ్మ అందరికీ ఇడ్లీలు వడ్డించింది. కారప్పొడీ, నెయ్యి వేసింది.

నాగభూషణం మాత్రం కంచంనిండా చద్దన్నం పెట్టుకుని ఎర్రగా కొత్తావకాయ కలుపుకుని తింటున్నాడు.

ఆయన చస్తే టిఫిన్ చెయ్యడు. దగ్గరక్కూడా రానీడు. నిత్య ఇడ్లీ తినడం ఆపి... తాతయ్యానే చూస్తుండిపోయింది.

"ఏం పిల్లా చద్దన్నం లాగిస్తావా? " అడిగాడు భూషణం.

"ఆఁ..." అంది నిత్య నోట్లో నీళ్ళూరుతుండగా.

"అలవాటు లేకుండా తింటే... జబ్బు చేస్తుంది" వసంత అన్నది.

"అహఁ... ఏం జబ్బమ్మా? కాస్త చెప్పు

వింటా" అంటూ కూతుర్ని వెక్కిరించి మళ్ళీ అన్నాడు.

"మీ టౌన్లలో టిఫిన్లు తినేవాళ్ళవే మొహాలు పీక్కుపోయివుంటాయి. చద్దన్నం తినేవాళ్ళ ఒంటి నిగారింపూ... ఆరోగ్యం మీకొక్కనాటికీ రావు. అసలు చద్దన్నంలో కొత్తావకాయ రుచి నువ్వేనాడైనా చూసుంటేగా... మీ అమ్మ చూడనిస్తేగా..."

"దాని ఒంటికి చద్దన్నం పడదు కదండీ" అంది సౌభాగమ్మ.

వసంత చిన్నప్పుడు కూడా చద్దన్నం తిన్లేదు. బిడ్డకు అది పడదనీ, ఇది పడదనీ, వాతం చేస్తుందనీ సౌభాగ్యమ్మ అల్లాడిపోయేది. ఇంట్లోనే వీలైనంతవరకూ పూరీలో..ఇడ్లీలో..దోసెలో.. చేసి పెట్టేది. చెయ్యని రోజున... కాంతమ్మ హోటల్లో గారెలో... పెసరట్లో తెచ్చిపెట్టేది.

"ఇదుగోరా... తిని చూడు" నాగభూషణం నిత్య నోటికి ఆవకాయ ముద్ద అందించాడు.

నిత్య నమిలి మింగాక అడిగాడు "ఎట్టా వుందే?"

"సూపర్‌హిట్ తాతయ్యా. అమ్మమ్మా రేపట్నుంచీ నో దోసెలూ... నో ఇడ్లీలు" అంది నిత్య మరో ముద్ద పెట్టమని చేయి చాస్తూ.

వసంత నిత్యనీ... తండ్రినీ... కొరకొర చూసింది.

నాగభూషణం... నందూ పొలానికి వెళ్ళిపోయాక చెప్పింది వసంత.

"రాత్రికి మళ్ళీ కరెంట్ వుంటుందో లేదో...ఒక్క క్షణం వేస్ట్ కాకుండా చదువ్"

మామూలుగా గంగరావి చెట్టుకింద నులకమంచం మీదకు చేరిపోయింది నిత్య.

"లంకంత ఇల్లు పెట్టుకుని చెట్టుకింద చదువులేమిటే" అని వసంత గొణిగినా పట్టించుకోలేదు.

పక్కింటి హైమావతి గోడమీంచి తొంగి చూసి "మామిడితోట చూపిస్తా... వస్తావా?" అంది.

నిత్యకు ప్రాణం కొట్టుకులాడిందిగాని... తల్లి గుర్తుకొచ్చి ఉసూరుమంటూ వూరుకుంది. నిత్య ప్రార్థన దేవుడు విన్నాడేమో మరి ఆ రాత్రి కూడా ట్రాన్స్‌ఫార్మర్ రిపేర్ కాలేదు. ఉదయం ఎలక్ట్రిసిటీ డిపార్ట్‌మెంట్ నుండి ఇద్దరొచ్చారు గాని పనికాలేదు.

"మమ్మీ... హైమాతో అట్లా తిరిగొస్తా" అంది నిత్య.

సరే వెళ్ళమన్నట్టు తలూపి "అమ్మా... మనింట్లో అప్పట్లో ఓ పెట్రోమాక్స్ లైటుండాలే... ఏమైందదీ?" అంది సౌభాగ్యమ్మతో.

"పెట్రోమాక్స్ లైట్ లేదు. నీ తలకాయ లేదూ... దాన్నట్లా చల్లగాలికి తిరిగిరానీవే వసూ" అంది సౌభాగ్యమ్మ.

"ఎమర్జెన్సీ లైట్ యూజ్ చేసి చదవచ్చునుకో. అది నందూకి అవసరమేమో" తన్లో తను అనుకుంటున్నట్టుగా అన్నది వసంత.

నిత్య గబగబ వెళ్ళి హైమావతిని పికప్ చేసుకొని దారంట అట్లా నడవటం మొదలెట్టింది. నిన్నటికన్నా కాంతిగా వుంది వెన్నెల.

"ఇవాళెక్కడికి వెళదాం... నిత్యా" అంది హైమావతి.

"మామిడి తోటలో కెళ్దాం" అంది నిత్య.

"ఇంకా నయం. చీకటి పడ్డాక తోటలోకా! ఓ పన్చేద్దాం. పంచాయతీ ఆఫీస్ పక్కన మా చింతాత వాళ్ళ ఇల్లుంది. అక్కడికెళ్దాం" అంది.

"ఇళ్ళకి వద్దు. బోర్" అంది నిత్య.

"మా చింతాత చెప్పే దెయ్యం కథలు విన్నావంటేనా... ఇహ రోజూ అక్కడికే పోవాలంటావ్" హైమావతి అట్లాగన్న తర్వాత ఆ చింతాతెవరో చూడాలనే అనుకుంది నిత్య.

వీళ్ళిద్దరూ వెళ్ళేసరికి... ఇంటి ముందున్న మెల్లాలో చాపేసుకుని కూర్చుని వున్నాడు వూరోళ్ళంతా చింతాత అని పిలిచే చిన్నయ్య.





చుట్టూ డజనుమందికి పైగా వున్నారు పిల్లలు.

చింతాత ఏమన్నాడో మరి... ఘొల్లున నవ్వుతున్నారు వాళ్ళు

హైమావతి చింతాత వెనగ్గా వెళ్ళి కళ్ళు మూసింది. చింతాత హైమావతి చేతులు తాకి "ఇట్రాయే నా ముద్దుల పెళ్ళామా" అన్నాడు. వేళ్ళతో హైమ బుగ్గలందుకో బోతూ. నిత్య ఉలిక్కిపడింది. చింతాతవైపు చూసింది.

"ఏంట్రా ముసలి మొగుడా... అమ్మా యిల్తో తిరుగుతున్నావట్నే...కాళ్ళిరగ్గొడుతా" అంది హైమావతి.

నిత్య మళ్ళీ ఉలిక్కిపడి హైమావతి వైపు చూసింది. "ఛ... ఏంటా మాటలు" అంది.

నిత్య గొంతు విని "ఎవరే ఈ జిలేబీ" అన్నాడు. తర్వాత -

"ఓ...వసంత కూతురివా? దా... దా... దా... కూర్చో" ఆప్యాయంగా చూశాడు.

చాప చివర్న కూర్చుంది.

చింతాత నిత్య చదువుల గురించి కాసేపు కుశల ప్రశ్నలేశాడు.

"సుత్తాపి మా నిత్యకి కథ చెప్పు చింతాతా" అంది హైమావతి.

"నేను మంచి వయసులో వున్న ప్పుడుకాసిపోసి, గ్లాస్కో పంచెకట్టి... కిర్రు చెప్పులేసుకొని నడుస్తుంటే నా సామి రంగా...ఆడోళ్ళంతా గుమ్మాల్లో నుంచుని నన్నే చూసేవాళ్ళు"

"అబ్బబ్బ... చింతాతా... దెయ్యాల గురించి చెప్పమంటే నీ గురించి... చెబ్తావే. నువ్వు దెయ్యానివా?" అంది హైమావతి.

"ఓరోజు పనిమీద టౌన్కెళ్ళి రెండో ఆట సినిమా జూసుకోని...వూరికి బయల్దేరినా.

ఇప్పట్లా బస్సులు అప్పుడు వూళ్ళోకి వచ్చే టియి గాదు. వూరిబయట చెంగాళమ్మ గుడి కాడ దిగాల మనూరోళ్ళు. ఆణ్ణుంచి డొంక దాటి పడమటి చేలకడ్డంగా నడిస్తే వూళ్ళోకి వస్తాం. రెండో ఆట జూసి... మెయిన్ రోడ్ మీద గుడికాడ దిగినా... సన్నంగా పట్టు కుంది తుంపర. ఒకటే ఈదర గాలి. చిమ్మ చీకట్లో తోవ కనబడ్డం కష్టంగా వుంది. చెంగాళమ్మకు దండంబెట్టి డొంకలోకి దిగా. ఆయాళప్పుడు ఆ డొంకలోబడి నడిచే మొగోడే అప్పటికి మనూళ్ళో పుట్టలా... సరే... తుంపర పడతాందా... మెరుపులూ ఉరుములూ... గూడా మొదలయ్యినై. భరో సాగా నడుసున్నా. గయిరమ్మ కుంట కాడికొ చ్చేతలికి ఒక్కసారి తళుక్కున మెరిసింది. ముందుకెయ్యబోయిన అడుగు గబాల్న ఎనక్కి తీశా. తాచు... జెర్రిపోతూ దారిక డ్డంగా పెనేసుకొనున్నయ్. బతుకుజీవుడా అని... మెరుపుకి దండంబెట్టి... పక్కకు తప్పుకొని ముందుకు నడిచినా... కూసింతసే పటికి పడమటి చేలొచ్చినయ్. జల్లుకు తడి సిన గట్లు జారిపోతాన్నయ్

అసలే... వరిపొలాలు... బురదపాములు కాళ్ళకింద అడపాదడపా పడతావున్నయ్. ఎట్టాగో నడిచి ఇరుగ్గంతకాడికి వచ్చేశా. అప్పుడు కనబడిందది..."

కనబడిందేమిటో పిల్లలు వూహించేశారు. ఒకరికొకరు భయంగా దగ్గరగా జరు గుతూ... చింతాత వంక... యాంగ్జయి టీగా చూశారు.

"ఎంత కొమ్ములిరిగిన మొగోడైనా దాన్ని జూసి... ఠారుకోవల్సిందే"

వెనక వరుసలో కూర్చున్నవాళ్ళు మరింత ముందుకు జరిగారు.

"కళ్ళింత లావున్జేసి... కోక ఎగ్గట్టి... గజ్జెలు ఘల్లుఘల్లు మన్పిస్తా నా ఎదర నిల బడ్డది... చెప్పొద్దు, ఒళ్ళు చల్లబడిపో యింది. గుండె దడదడా కొట్టుకుంది"

ఒకడు లేచి ఒంటికి పోవాలన్నాడు. చింతాత వాడి గోల పట్టించుకోకుండా చెప్పు కుపోతున్నాడు. "అది మామూలు పిశాచజా తికి చెందింది కాదు. శాకినీ... డాకినీ...

మోహినీ... కూడా కాదు"

"మరి? " ఎవరో అన్నారు.

"అది... నా పెళ్ళాం జాలమ్మ"

అందరూ పక్కుమని నవ్వారు.

నిత్యక్కూడా తెగ నవ్వొచ్చింది. 'అంత సేపు వూరించి కథకు ఏం కొసమెరుపి చ్చాడు!' అనుకుంది.

"ఇప్పుడామె బతికుందా? " హైమావతి నడిగింది నిత్య మెల్లగా.

"ప్చ్... ఎప్పుడో పోయింది" అంది హైమావతి. అంతవరకూ హుషారుగా మాట్లాడుతున్న చింతాత మౌనంగా అయి పోయాడు.

"లేదు నిత్యమ్మా. అదెక్కడికీ పోలేదు. నా గుండెల్లోనే మఠమేసుకుని కూకోనుంది"

చింతాత కళ్ళలో తడి మెరిసిందేమో మరి... వెన్నెల్లో కనబడలేదు.

"చింతాతకి ఇద్దరు కొడుకులుంటే ఇద్దరూ పట్నంలో స్థిరపడ్డారు. వాళ్ళు తాతని పట్టిం చుకోరు. ఇదుగో ఈ ఇంట్లోవాళ్ళు.. వరం డాలో పడుకోనిస్తారు. వూళ్ళో అందరూ రోజుకొకరు వంతులేసుకొని అన్నం పెడ తారు" చెప్పింది హైమావతి మెల్లగా నిత్యకు.

"ఈ ఇల్లు చింతాతది కాదా!" ఆశ్చర్యపో యింది నిత్య.

కథ అయిపోగానే పిల్లలంతా... బయ టకి పరిగెత్తిపోయి కోతికొమ్మచ్చి ఆడుతు న్నారు.

"వస్తాం చింతాతా" హైమావతి లేచి ఓ పొట్లం చింతాత చేతిలో వుంచింది.

"ఏంది పెళ్ళామా? " అన్నాడు.

"అరటికాయ బజ్జీలు మొగుడా" అంది.

వస్తూ... వస్తూ... దార్లో కొన్నదవి హైమావతి. తాతకోసమన్నమాట.

"వస్తాం తాతయ్యా" చెప్పింది నిత్య.

"ఓస్... పెళ్ళామా వరండాలో వదిలిపె ట్టిపోరాదూ" అన్నాడు చింతాత కర్ర వూతంతో లేచి నిలబడి, హైమావతి ఆయన రెక్క పట్టుకుని వరండాలో వదిలి పెట్టింది. చాపతీసి వరండాలో పరుస్తున్న నిత్యకు అర్థమైంది...

'చింతాతకు కళ్ళు లేవు. కన్నీళ్ళు మాత్రమే వున్నయ్' అని.




**ని**త్య బంపర్ లాటరీ తగిలినదానిలా సంబరపడిపోయింది చింతాత చూసొచ్చాక మరుసటిరోజు మళ్ళీ కలవాలనుకుంది. అమ్మమ్మ చేసిన జిలేబీలు ఇచ్చి తాత తనను 'జిలేబీ' అని పిలిచిన పేరును సార్థకం చేసుకుందాం అనుకుంది.

కానీ... ట్రాన్స్‌ఫార్మర్ బాగయింది. కరెంటొచ్చేసింది. ఆరోజు రాత్రింబవళ్ళు వసంత నిత్య ఎదురుగా కూర్చుని మరీ చదివించింది.

"అబ్బబ్బ దాన్ని మరీ చంపుతున్నా వక్కా... ఎమ్‌సెట్ రాసి సీటు తెచ్చుకో వడం యిప్పుడేమంత కష్టం కాదు. కనీస మార్కులు థర్టీపర్సెంట్ చేశారిప్పుడు. మన నిత్య తెలివికి... అది ఆడుతూ పాడుతూ సీటు తెచ్చుకుంటుంది" నందూ వసంతను విసుక్కున్నాడు.

వసంత చర్రున చూసింది నందూవైపు.

"నా ఎయిమ్ అది కాదు. విషయం తెల్సీ అట్టా మాట్లాడకు".

"ఎవరి పిచ్చి వాళ్ళకానందం" నందూ గొణుక్కున్నాడు, వసంత గమనించకుండా.

పొలం నుండి వచ్చి స్నానం చేశాక... ఎప్పట్లా గంగరావి చెట్టుకింద వున్న నులక







మంచాన్ని జాజిపందిరి కిందకు లాక్కుని... కూర్చున్నాడు నాగభూషణం.

పక్కనే స్టూల్ మీద రేడియో.

"ఈ అలవాటు పోనిచ్చుకున్నారు కాదు. లక్షణంగా కూర్చొని టీవీ చూడక... పాటా ఆటా రెండు కనబడతాయిగా దాన్లో" సౌభాగ్యమ్మ భర్తకు తలగడ అందిస్తూ అంది.

తలగడ మీద తల ఆనించి... వెల్లికిలా పడుకుని "నీలాకాశం... చందమామా... చల్లగాలి... జాజిపూల వాసనా... రేడియోలో ఘంటసాల పాట... వీటిలోని ఆనందం అనుభవించేవాళ్ళకే తెలుస్తుందే భాగ్యం"

"అద్సరేగానీ... రేపెళ్తున్నామా పిల్లని చూడ్డానికి!" అందామె.

"ఎందుకెళ్ళం. వాళ్ళక్కబురు కూడా పెట్టాను వస్తున్నట్టు. అమ్మాయిని పిలువ్" అన్నాడు.

సౌభాగ్యమ్మ వసంతని కేకేసింది. వసంతతో పాటూ నందూ కూడా వచ్చాడు. "ఏం వసూ! రేపు బయల్దేరదాం చిన్నవలసకి"

"ఎందుకు నాన్నా? " అంది వసంత.

సౌభాగ్యమ్మ నిట్టూర్చింది. "నీకు... నిత్యమ్మ చదువు తప్ప ఇంకేం గుర్తుండదే. నందూ పెళ్ళి చూపుల గురించే... మీ నాన్న అడుగుతుంటే"

"ఓం... అదా... అట్లాగే వెళ్దాం. ఉదయాన్నే బయల్దేరదాం. మధ్యాహ్నం భోజనాల వేళకు వచ్చెయ్యొచ్చు" చెప్పింది.

"వాళ్ళు భోజనాలకేర్పాటు చేస్తే? " నందూ అన్నాడు.

"గతికితే అతకదురా శుంఠా" విసుక్కుంది సౌభాగ్యమ్మ.

"చిన్నబ్బాయిగారు కారిస్తానన్నారుగా. ఇంకోసారెళ్ళి గుర్తుచేసిరాపో" చెప్పాడు నాగభూషణం.

"అవసరం లేదు నాన్నా. నాగరాజు చీకటితో కారు తెచ్చి మన గుమ్మంలో పెడతాడు" అన్నాడు నందూ.

నిత్యకి విషయం అర్థమైంది. అయితే ఆమె కర్థంకానిదల్లా ఒక్కటే... ఇంతకీ... తనను తీసుకెళ్తున్నారా... లేదా... పడుకోబోయే ముందు నందూని కదిలించింది.

"నువ్వు రాకుండా నాకు పెళ్ళి చూపు లేంటే? సెలక్షన్ నీదేనమ్మా... బంగారు తల్లీ!" అన్నాడు నందూ ముద్దుగా నిత్య తలమీద మొట్టి.

"మమ్మీ"... అంటూ సందేహంగా ఆగిపోయింది నిత్య.

"నువ్వొస్తున్నావ్" ఖచ్చితంగా చెప్పాడు.

ఎట్లా మేనేజ్ చేశాడో మరి... వసంత నిత్యకు అడ్డు చెప్పలేదు. రోజూ చీకటితో లేపి చదువుకోమని చెప్పే వసంత ఆరోజు "త్వరగా రెడీ కా... మామయ్యకి పిల్లని చూసొద్దాం" అంది.

నిత్య లావెండర్ కలర్ చుడీదార్ వేసుకొని నిముషాల్లో రెడీ అయిపోయింది.

నందూ అన్నట్టే... ఉదయం ఏడు కావస్తుండగా చిన్నబ్బాయిగారి కారు డ్రైవరు నాగరాజు... కారు తెచ్చి గుమ్మంలో పెట్టాడు.

అందరూ తెరిపిన పడి ఎక్కి కూర్చునేసరికి ఎనిమిదిన్నరైంది.

నందూ పూలూ, పళ్ళూ, స్వీట్లూ వున్న ప్లాస్టిక్ బేగ్ తెచ్చి కారు బ్యాక్‌సీటులో పెట్టాడు.

నందూ ఇంటికి తాళం పెడుతుంటే ఎవరూ చూడకుండా అడిగింది నిత్య "ఎట్లా మేనేజ్ చేశావు మామయ్యా"

"దెయ్యం పేరు వల్లించా" నందూ కిసుక్కున నవ్వి మళ్ళీ అన్నాడు.

"నిత్య నొక్కదాన్ని వుంచటం మంచిది కాదు. నువ్వే ఆలోచించుకో అన్నా. అంతే. అక్క ఒప్పేసుకుంది.. అద్సరేగానీ డ్రెస్ ఎట్లా వుందో చెప్పు"

"సింప్లీ సూపర్బ్" చెప్పింది నిత్య.

"నాగార్జునా... వెంకటేష్... తరుణ్... జగపతిబాబు... మహేష్ లాంటి వాళ్ళెవ రైనా గుర్తొస్తున్నారా?"

ఒక్క క్షణం అతనికేసి నిశితంగా చూసి.... నిరసనగా అన్నది "హూం... నిన్నెంత తక్కువగా అంచనా వేసుకున్నావ్ మామయ్యా. ఆఫ్టాల్... యాక్టర్స్, మోడల్స్ ఏంటి... మామయ్యా... నిన్ను చూస్తుంటే నాకు ఓ డివైన్ హీరో గుర్తుకొస్తున్నాడు"

"అతనెవరు? హాలీవుడ్ స్టారా?" ఆరాగా అడిగాడు.

నిత్య భక్తిగా చేతులు జోడించి కళ్ళు మూసుకుని చెప్పింది.

"శ్రీ... శ్రీ... శ్రీ... ఆంజనే యస్వామివారు"

నిత్య చెవి పట్టుకొన్న పట్టుకోవటం అట్లాగే కారుదాకా నడిపించుకొచ్చాడు. సౌభాగ్యమ్మా, వసంతా అరిస్తేగాని చెవిని వదల్లేదు నందూ.

★ ★ ★

డ్రైవర్ పక్కన నాగభూషణం, నందూ సర్దుకున్నారు. వెనక సీట్లో సౌభాగ్యమ్మా, వసంతా, నిత్య కూర్చున్నారు. గాలి బాగా ఆడుతుందని విండోస్ డౌన్ చెయ్యలేదు.

నాగరాజు కార్ స్టార్ట్ చేశాడు.

"ఏం కారే ఇది. భలేగుంది" సౌభాగ్యమ్మ వసంతతో అంది.

"మారుతీ ఎస్టీమ్" చెప్పింది వసంత.

"ఎంతయ్యుంటుందో" మళ్ళీ అడిగింది.

"ష్... అమ్మా. డ్రైవర్ వింటే వీళ్ళెప్పుడూ కారు మొహం చూళ్లేదేమో అనుకుంటారు. వూరుకో" అంది వసంత.

"నాగరాజూ...ఒక్క క్షణం కారాపు" అన్నాడు నందూ.

**"నాగార్జునా... వెంకటేష్... తరుణ్... జగపతిబాబు... మహేష్ లాంటి వాళ్ళెవరైనా గుర్తొస్తున్నారా?"**

అతను ఆపగానే నందూ వెనక్కి తిరిగి చెప్పాడు నిత్యకు "అదుగో... అదేనే సమాధుల తోటంటే.. మన మొద్దోడు రోజూ నీకు జాంకాయలు తెచ్చిచ్చేది ఇక్కడ్నుంచే"

"ఓర్నీ దుంపతెగ. అదేమన్నా తాజ్‌మహలా... ఆపి మరీ చూపిస్తున్నావ్" అంది వసంత.

"కాదులేక్కా... నిత్య నన్ను రెండుమూడుసార్లడిగింది. సమాధుల తోటంటే ఏంటి మామయ్యా అని. అందుకని చూపించా. అదుగో నిత్య మొద్దోడు జాంచెట్టు మీదే వున్నాడు" అంటూ, "రేయ్ మొద్దోడా! నాలుక్కాయలు తెంపుకురా" అని కేక పెట్టాడు.

శీను వెనక్కి తిరిగి చూసి... చకచక కాయలు తెంపుతున్నాడు.

"మొద్దోడా అనకు మామయ్యా. ఫీలవుతాడు"

"అహం... అట్టాంటి ఫీలింగ్స్ వాడికేం లేవ్. టెన్త్ అన్నిసార్లు తప్పినప్పుడే అన్నీ పోయాయమ్మా" అన్నాడు నందూ.

"నువ్వు ఇంటర్ తప్పావుగా. నిన్నూ అట్లాగే పిలుస్తా" కసిగా అంది నిత్య.

"నేనొక్కసారేనమ్మా" అన్నాడు నందూ.

శీనూ కాయలు కోస్తుంటే నిత్య... తోటలోకి నిర్నిమేషంగా చూస్తోంది. తోట చాలా విశాలంగా ఉంది. సుమారు వందల ఎకరాల మేర వుంది. ఆ తోటలో పళ్ళ చెట్లకంటే... పేరు తెలియని పిచ్చి చెట్లే ఎక్కువగా వున్నట్టనిపించింది.

చిత్తు వత్తుగా పెరిగిన పేరు తెలియని పొదల మధ్య నుండి తెల్లగా కనపడుతోంది రాజారెడ్డి సమాధి. అక్కడక్కడా పెచ్చులూడిపోయి వుందది.

ఆ తోటకు చెందిన గోపీరంగులో వున్న



పురాతనమైన మేడ కుంగిపోయినట్టుగా వుంది. గోడలు...రంగు వెలిసిపోయి పాకుడు పట్టివున్నాయ్. కొన్ని చోట్లయితే గోడ నెర్రెలు పోసి... ఆ నెర్రెల్లోంచి పిచ్చి మొక్కలు దట్టంగా పెరిగి వున్నాయ్. తోటలో కొంతమేర బాగా చదును చేసినట్టుగా వుంది. అక్కడ పిల్లలు క్రికెట్ ఆడుతున్నారు.

"ఈ స్థలాన్ని మొన్నెవరో అట్టల ఫ్యాక్టరీ వాళ్లడిగారు" చెప్పింది సౌభాగ్యమ్మ.

"వాళ్ళు అమ్మరుగా" వసంత అంది.

"అమ్మరు. ఫ్యాక్టరీ వాళ్ళు ప్రయత్నం చేశారంతే. ఇదిట్లా... ఆ రాజారెడ్డిగారి జ్ఞాపకార్థం ఉండిపోవాల్సిందే. ఆ మహాను భావుడి వైభవమట్లాంటిది."

"చాలా మంచివాడా అమ్మమ్మా" అడిగింది నిత్య.



అమ్మాయిని తీసుకొచ్చి కుర్చీలో కూర్చోబెట్టారు. పల్లెల్లో కూడా 'చాప' సిస్టం పోయిందన్నమాట అనుకుంది నిత్య. అమ్మాయి టెన్త్ డిస్‌కంటిన్యూ చేసిందట "పాసో, ఫెయిలో చెప్పకుండా ఇదో స్టైయిలన్న మాట" అంది నిత్య నందూ చెవిలో.

కుట్లూ, అల్లికలూ వచ్చుట. వంట బ్రహ్మాండంగా చేస్తుందట. ఇప్పుడు వాళ్ళకి ఆఫర్ చేసిన స్వీట్స్ ఆ అమ్మాయి చేసినవేనట.

"షాపులో కొన్నవని స్పష్టంగా తెలుస్తోంది" మళ్ళీ నందూ చెవి కొరికింది నిత్య.

కాఫీ కూడా ఆ అమ్మాయే కలిపిందట.

"ఇన్‌స్టంట్ కాఫీ కలపడం కూడా అరవై నాలుగు కళల్లో ఓ కళేమో!" పెదాలు కదలకుండా అడిగింది నిత్య.

సంగీతం వచ్చుట. పాటలు బాగా పాడుతుందట.

"ఓ పాట పాడండి" చటుక్కున అడిగింది నిత్య.

"అధిక ప్రసంగి" అన్నట్టు కొరకొర చూసింది వసంత నిత్యవైపు.

"ఆ అమ్మాయి తలెత్తి నిత్య వైపు చూస్తున్నట్టుగా నటిస్తూ నందూ వైపు చూసింది. నందూ కంగారుపడ్డాడు.

"నువ్వు అడిగితేనేగానీ పాడేలా లేదు" చిన్నగా అంది నిత్య.

అయితే ఆ అమ్మాయి నందూ అడక్కుండానే, 'కోయిల పాట బాగుందా... కొమ్మల సడి బాగుందా' అంటూ పాడింది. బాగానే పాడింది. గొంతు ఓ మోస్తరుగా ఉంది. ట్యూన్ కరెక్ట్‌గా లాగింది. 'అందమైన మేఘమాల బాగుందా' అంటున్నప్పుడల్లా నందూవైపు దొంగచూపులు చూడ్డం... నందూ సిగ్గుపడ్డం నిత్య గమనిస్తూనే ఉంది.

పాట పూర్తవగానే "ఆంజనేయ దండకం వచ్చాండి" అంది నిత్య.

నందు నిత్య చెవి మెలిపెట్టబోయి బాగోదని ఊరుకున్నాడు.

అందరూ ముసిముసిగా నవ్వుతుంటే పెళ్లికూతురి తల్లి ఆరాగా అడిగింది "ఎవరండీ ఈ అమ్మాయ్?"

"నా మనవరాలు... ఇదో... నందూ అక్క వసంత. దాని కూతురిది... నిత్య"

"అంటే అబ్బాయికి మేనకోడలా!" అదోలా అందామె.

"పేరడుగూ" అంది వసంత నందూని.

"తెలుసుగా. ఇంకెందుకూ అడగటం" అన్నాడు నందూ బిడియంగా. పెళ్లికూతుర్ని లోపలికి తీసుకెళ్ళారు. ఎర్రటి కంచిపట్టు చీరె అంచుని... నడుం చుట్టూ తిప్పి పట్టుకుని... జడలో తురిమిన ఆరు మూరల మల్లెపూలూ జడతో పాటు అటూ ఇటూ వూగేలా నడుస్తూ... లోపలి గదిలో కెళ్ళిపోయింది పెళ్ళికూతురు.

పెద్దవాళ్ళేదో మాట్లాడుకుంటుంటే నిత్య, నందూ బయటకొచ్చారు. పెళ్ళికూతురి చెల్లెలూ... తమ్ముడూ... చిన్నపిల్లలూ.. బయట ఒకటే గెంతులు, తమ ఈడువాళ్ళతో కలిసి.

గుమ్మం ముందు మెల్లాలో ఓ పక్క బంతిపూల మొక్కలు విరగబూసి వున్నాయ్. మధ్యమధ్యలో ఎరుపూ, పసుపూ కనకాంబరాలు. ఇంకోపక్క రెండు గజనిమ్మ చెట్లున్నాయ్.

"మేఘమాల నచ్చిందా?" అంది నిత్య.

"నీలాగా కోతిముఖం కాదుగా... నచ్చకపోవటానికి" అన్నాడు నందూ.

"అవున్లే... ఆ అమ్మాయి మన జాతి కాదుగా" అంది నిత్య.

నందూ చెవి పట్టుకోబోతుంటే "ఇది రెండుసార్లు మెలేశావు. కావాలంటే ఈ చెవి పట్టుకో" అంటూ రెండో చెవి చూపించి నిత్య భయపడిపోతున్నట్లు నటిస్తూ.

"వెళ్ళగానే ఫోన్ చేస్తా" నాగభూషణం గొంతు వినబడింది.

నందూ, నిత్యా గుమ్మం వైపు చూశారు. మాటలైపోయాయేమో అందరూ బయటికొచ్చారు.

"అమ్మాయితో అబ్బాయేమైనా మాట్లాడతాడేమో అడగండి" అంటున్నాడు పెళ్ళికూతురి తండ్రి.

"వాడి మొహం. వాడు మాట్లాడేదేముందిలే" అంది సౌభాగ్యమ్మ.

నిత్య కిసుక్కున నవ్వింది.

వాళ్ళు భోజనం చెయ్యమని బతిమలాడుతున్నా... వద్దంటే వద్దని అందరూ కారెక్కారు. పెళ్ళికూతురి బంధువులు వినయంగా కారు డోర్ వేశారు.

"వారం రోజుల్లో ఫోన్ చేస్తాంలెండి?" నాగభూషణం మళ్ళీ అన్నాడు.

కారు బయల్దేరుతుంటే- నందూ వంగి ఆ ఇంటికేసి చూశాడు. గుమ్మం పక్కనే ఉన్న కిటికీలోంచి తననే ఆరాధనగా చూస్తూ కన్పించాయి రెండు కళ్ళు.

**"మేఘమాల నచ్చిందా?" అంది నిత్య. "నీలాగా కోతి ముఖం కాదుగా... నచ్చకపోవటానికి" అన్నాడు నందూ. "అవున్లే... ఆ అమ్మాయి మన జాతి కాదుగా" అంది నిత్య.**

"ఏరా... నందూ... ఏమంటావ్?" అంది వసంత.

"ఆయనేమనడు. ఎప్పుడో ఫ్లాటయిపోయాడు" అంది నిత్య.

"ఇదీ.... దీని మాటలూ.... తీసికెళ్ళి హాస్టల్‌లో పడేస్తేగానీ... చక్కగా రాదు" అంది వసంత చిరాగ్గా నవ్వుతూ.

నందూ దార్లో మళ్ళీ కారాపమన్నాడు.

"ఎందుకూ?" అంది వసంత.

ఆమెకు తొందరగా ఉంది. ఇంటికెళ్ళి భోజనాలు అవీ కానిచ్చి నిత్యను చదివించుకోవాలని.

"నిత్యకు మన తాటిముంజెలు రుచి చూపిద్దామని" అన్నాడు.

"ఇంట్లో ఫ్రిజ్‌లో వున్నాయిరా" అంది వసంత.

"ఎక్కడి దానివే తల్లీ. పొలంగట్ల మీద కూర్చుని... చెట్టుకాయలు దింపించి, అప్పటికప్పుడు తినే ముంజల మజా.... ఇంట్లో ఫ్రిజ్జులోవి తింటుంటే వస్తుందా?"



అందరూ కారు దిగారు.

"ఇవన్నీ మన పొలాలే నిత్యా" చెప్పింది సౌభాగ్యమ్మ.

కనుచూపు మేర ఏపుగా పెరిగి వుంది పైరు.

ఆ మధ్యాహ్నపు ఎండలో... పచ్చలు రాశులు పోసినట్టు వున్నాయ్ వరిచేలు.

కంకి భారానికి వంగిపోయిన మొక్కలు గాలి వీవనలకు సముద్రపు అలల్లా కదులుతున్నాయి. పొలం గట్ల మీద వున్నాయి... ఓ పది తాటిచెట్లూ... పది ఈతచెట్లూ... అయిదారు కొబ్బరి చెట్లూ.

వీళ్లని చూడగానే పాలేరు నాగులు పరిగెత్తుకొచ్చాడు.

"తాటికాయలు దింపుదాం, రా నాగులూ" అంటూ నందూ అతనితో కలిసి వెళ్ళాడు. డ్రైవర్ నాగరాజు కూడా వాళ్ళతో నడిచాడు.

అంతా చెట్ల నీడన కూర్చున్నారు.

"కార్లో... ఫిజిక్సో... కెమిస్ట్రో... ఏదో ఒక మెటీరియల్ పడేసుకొచ్చుకుంటే బాగుండేది" నిట్టూర్చింది వసంత.

నిత్య ఒకసారి తల్లికేసి చూసి తల తిప్పుకుంది. దూరంగా తాటిచెట్టు దగ్గర నిలబడి నిత్యని రమ్మన్నట్టు చెయ్యి వూపాడు నందూ.

నిత్య... రమ్మన్నదే తడవుగా బయల్దేరింది. నాగులు చెట్టెక్కి కాయలు దింపుతున్నాడు.

నాగరాజు... మోటారు పక్కనే వున్న పాకలోంచి మడ్డు కత్తి తెచ్చి కాయలు చెక్కుతున్నాడు. మోటార్ ఆన్ చేసి వుంది. పంపులోంచి నీళ్ళు జలపాతంలా పడుతున్నాయి. ముందున్న పెద్ద సిమెంట్ చప్టాలోని నీళ్లలో నిత్య ఇష్టమొచ్చినట్టు ఆడుకుంది. కాళ్ళతో చేతుల్తో నీళ్ళను చెదరగొడుతూ... ఒళ్ళంతా తడుపుకుంది.

"చంటి సినిమాలో మీనా పోర్షనా?" అడిగాడు నందూ.

నందూకేసి కోపంగా చూసి "అందమైన మేఘమాల బాగుందా" అంది. నందూ వుడుక్కుంటూ అటు తిరిగాడు. నాగరాజు నీట్‌గా చెక్కిన కాయని నిత్యకిచ్చాడు తినమని.

ఓ గంట తర్వాత కారు బయల్దేరింది.

"ప్చ్ టైం వేస్ట్" అనుకుంది వసంత.

"దీజార్ గోల్డెన్ మొమెంట్స్" అనుకుంది నిత్య.




ఆ రోజు ఒకటో తారీఖు. ఆఫీస్‌కి వెళ్ళి శాలరీ తెచ్చుకుంటానని నందూని తోడు తీసుకుని ఉదయాన్నే టౌన్ కెళ్ళింది. వసంత. వెళ్తూ వెళ్తూ "నిత్యా..." అంది. తల్లి ఏం చెప్పబోతుందో తెలుసు కనుక...

"ఒక్క నిమిషం వృథా చెయ్యకుండా చదువుతాను, ఓకే" అంది.

"నా బంగారు తల్లి" నిత్య నుదుటిమీద ముద్దిచ్చింది.

"ఎన్ని కేజీలో" అన్నాడు నందూ.

"మేఘమాలకంటే ఓ కేజీ ఎక్కువే"

నిత్య వంక తినేసేలా చూస్తూ వసంత వెనక వెళ్ళిపోయాడు. వాళ్లట్లా పోగానే "యాహూః" అని అరిచేసింది నిత్య.

"అదేమిటే పిచ్చికోతిలా అట్లా అరుస్తావ్" అంది సౌభాగ్యమ్మ. అమ్మమ్మ బుగ్గమీద చటుక్కున ముద్దిచ్చి గారాలు పోయింది నిత్య.

"మరే... అమ్మమ్మా హైమా నాకు మామిడితోపు చూపిస్తానంది. వెళ్తానే"

"నందూ వచ్చాక పోదూగానీలే" అందామె.

"నందూ ఒక్కడే రాడు. తోకలా మీ కూతురొస్తుంది" నిత్య బుంగమూతి పెట్టింది.

"అవ్వ! నా కూతుర్ని తోకంటావటే... చిన్నంతరం, పెద్దంతరం లేదూ" అని కోప్పడి, మళ్లీ అంతలోనే "అట్లానే వెళ్ళిరా... మళ్లీ ఆ రాక్షసి వచ్చిందంటే పడనీదు" అంది సౌభాగ్యమ్మ.

"యు ఆర్ వెరీ స్వీట్ అమ్మమ్మా" అంది నిత్య.

పది నిముషాల్లో... హైమని పికప్ చేసుకుని తోపుదారి పట్టింది. దారికటూ ఇటూ విరగబూసిన తంగేడు పూలు. ఎంత దూరం నడిచినా వెంటబడి వస్తున్నట్టు నాగజెముడు పొదలూ... పేరు కూడా తెలియని రంగు రంగుల పూలూ... అక్కడక్కడా రావి... కానుగ... దిరిసెన వృక్షాలూ... వాటి కాండాలకు అల్లుకున్న అడివి పూలతలూ...

'మైగాడ్ ఇది చూడకుండా ఉండి వుంటే చాలా మిస్సయ్యేదాన్ని' అనుకుంది నిత్య.

"త్వరగా కదులు... అసలు తోపే చూడలేదు మనం. భోజనాలటైంకి ఇంట్లో వుండాలన్నావ్" అంది హైమావతి.

"యస్... మమ్మీ వస్తుంది. త్వరగా పద తోపుకి" అంది నిత్య.

ఇద్దరూ నడుస్తున్నారు. కాస్త దూరం పోయాక... మొదలైంది కమ్మని మామిడి పూత వాసన.

నిత్య గుండెనిండా ఆ పరిమళాన్ని పీల్చుకుని అన్నది "మామిడితోపు వచ్చేసింది కదూ హైమా"

తోపులోకి అడుగు పెట్టబోతూ... తోపు మొదట్లోనే వున్న ఓ గున్నమామిడి చెట్టుకేసి రెప్పలార్పకుండా చూసింది.

గుబుర్లు గుబుర్లుగా అల్లుకున్న ఆకుల్లోంచి... ఆకు ఆకుకీ ఒకటి చొప్పున వేళ్ళాడుతున్నాయి మామిడికాయలు.

ఏ అద్భుత చిత్రకారుడో అహర్నిశలూ శ్రమించి గీసిన ముగ్ధమనోజ్ఞ చిత్రంలా వుందా గున్నమావి మాను.

అసంకల్పితంగా... ఓ కొమ్మవంచి ముద్దు పెట్టుకుంది నిత్య. పచ్చి మామిడి పరిమళం... ఆమె గుండె లోలోతుల్లోకి వెళ్ళిపోయి అగరుపొగలా కమ్ముకుంది.

తోపులోనే వున్న ఓ పాక దగ్గరకు తీసుకుపోయింది నిత్యను హైమావతి.

ఆ పాకలో వున్న ఓ వ్యక్తి... హైమావతిని చూసి "ఏం హైమావతమ్మా... ఇట్టా వచ్చినవ్... ఆరెవురూ? " అన్నాడు నిత్యను చూస్తూ.

"భూషణం తాతయ్య మనవరాలు. తోట చూద్దామని వచ్చింది చిన్నాయినా" అంది హైమావతి.

"వసంతమ్మ కూతురా! ఏం నాయినా బాగుండావా? " అని హైమావతితో "పో... అట్టాగే సూపిచ్చుపో..." అన్నాడు.

ఇక... హైమావతి క్యాడా దొరకలేదు... నిత్య. చెట్టు చెట్టు దగ్గరకూ పరిగెత్తి చేతికందిన ప్రతి ఆకునీ ముట్టుకుని చూసింది. ప్రతి కాయనీ తాకి తన్మయురాలైంది.

మామిడితోపు సుగంధానికే మనసు పరవశించిపోతుంటే... పైన మత్తుగా కూస్తున్నాయి కోయిలలు.

తిరిగి తిరిగి... ఓ చెట్టుకింద కూర్చుంది నిత్య. నాలుగు పచ్చిమామిడి కాయలు కోసుకొచ్చి నిత్య పక్కనే చతికిలపడింది హైమ.

నిత్యకొకటి ఆఫర్ చేసి తానొకటి తీసుకుని కసుక్కుని కొరికింది... మామిడికాయ. నిత్య... ఉప్పు కావాలంది.







పాకలోకెళ్ళి ఉప్పు తెచ్చింది హైమ. నిత్య ఒక్క కాయ తినేసరికి...

హైమావతి మూడు కాయలు కసకస నమిలేసింది.

"గోరింటాకు పెట్టుకుందామా" అంది హైమ.

పచ్చిమామిడి రుచిలో పడిన నిత్యకు వసంత మనసులోంచి పూర్తిగా తొలగిపోయింది. ఇద్దరూ... కలిసి... తోపులో అక్కడక్కడా పెరిగిన గోరింట పొదల్ని వెదికి పట్టుకుని... నాలుగు దోసిళ్ళ ఆకు దూశారు. ఆకంతా నిత్య కర్చీఫ్‌లో మూట కట్టింది.

పాకలోకెళ్ళి "చిన్నాయినా! గోరింటాకు నూరుకుంటామే" అనడిగింది హైమ.

"నూరుకోండ్రి. అడగాల్నా" అని "ఒసే ఎంగటమ్మా పిలకాయిలికి గోరింతాకు నూరి పెట్టవే" అన్నాడు.

"తోటమాలి... మీ చిన్నాయినా..." అడిగింది నిత్య మెల్లగా.

"కాదూ! ఇక్కడందరం ఏదో ఒక వరస కలిపి పిలుచుకుంటాం" నవ్వింది హైమావతి.

వెంకటమ్మ... హైమా కలిసి... గోరింటాకు మెత్తగా నూరారు. ఆ పాకలోనే కూర్చుని గోరింటాకుతో అరిచేతిలో చందమామనీ... చుట్టూ నక్షత్రాల్నీ అద్దుకున్నారు.

హైమావతి నిత్యకి పెడితే... హైమావతికి వెంకటమ్మ పెట్టింది. "గెంట... సాలు... ఎర్రంగ పండిపోద్ది" అంది వెంకటమ్మ.

"భోజనాల వేళకు పోలేమా?" నిత్య అంది.

"ఎన్ని గంటలకొస్తుంది మీ మమ్మీ" అడిగింది హైమవతి.

"నాలుగవుతుందేమో టౌన్లో హోటల్లోనే భోంచేస్తామన్నారు"

"ఇంకేమైతే... మూడుకంతా ఇంటికి చేరుకుందాం" అంది.

ఇద్దరూ పాకలో ఇటుక గోడనానుకుని చేతులు గాలికి ఆరబెట్టుకుని కూర్చున్నారు.

అన్నంవేళ దాటిపోతుంటే... భోజనానిక్కూర్చోబోతూ అడిగాడు నిత్యని తోటమాలి "మా వణ్ణం దింట్రా అమ్మాయిగోరూ"

మామూలుగా అయితే 'వద్దని' తిరస్కరించేదే నిత్య. కానీ... అతనడిగిన తీరు ఆమె హృదయాన్ని తాకింది. 'మా అన్నం తింటారా?' అన్న అతని ప్రశ్నకు "ఎందుకు తినం? తింటాం" అన్నదే కరెక్ట్ సమాధానం అన్పించిందామెకు.



అందుకే ఆ మాటే అంది. తోటమాలి ముఖం వెలిగిపోయింది.

"ఎంగటమ్మా.... కూరాకేం జేసినవ్" అంటూ తబ్బిబ్బాయిపోయాడు.

"ఊరుబిండయ్యా" అందామె సిగ్గుసిగ్గుగా.

"అంటే ఏంటి?" హైమావతిని అడిగింది నిత్య.

"పచ్చడి" చెప్పింది హైమ.

వెంకటమ్మతో నిత్య చెప్పింది "చేతులూ ప్లేటూ శుభ్రంగా కడిగి... అన్నం నువ్వే కలుపు"

వెంకటమ్మ నమ్మలేనట్టు చూస్తుంటే నిత్య... గోరింటాకు చేతుల్ని చూపి "త్వరగా కలుపు. ఆకలేస్తుంది" అంది.

నిత్య చెప్పేది నిజమేనన్న నమ్మకం కుది

స్తున్న హైమ తనూ నోరు తెరి చింది.

డైనింగ్ టేబుల్ మీద నాలుగు రకాల కూరలు చుట్టూ పెట్టుకుని పింగాణీ ప్లేట్స్‌లోకి ఫ్యాషన్‌గా వడ్డించుకుని తినే అన్నా నికి ఈ రుచి... రాదు... రానేరాదు' అనుకుంది నిత్య.

కలిపిన అన్నం అయిపోగానే "కూసింత పెట్టనా?" అంది వెంకటమ్మ.

ఇద్దరూ చాల న్నారు.

రెండవుతుం డగా తోటలో పంపుదగ్గర గోరింటాకు కడి గేసుకున్నారు. కుంకుమపూల చేలలా వున్న అరిచేతుల్ని సంబ రంగా చూసుకుంది నిత్య.

అరిచేతుల్ని చాపి వెంకటమ్మకి చూపిం చారు. వెంకటమ్మ నిత్య అరిచేతిని ఆప్యా యంగా చూసి "నీకు మంచి పెనిమిటొ స్తాడు" అంది.

నిత్య చెంపల్లో మందారాలు విరిశాయి.

"నాకో" అంది హైమావతి అరిచేతిని వెంకటమ్మ ముందుకు చాపి.

"నీకు ఎడ్డోడొస్తాడు" అంది.

"చూడు... చిన్నాయినా" అంటూ గారాలు పోయింది హైమావతి.

తోటమాలినడిగి కోసుకున్న పచ్చిమామి

రాక వెంకటమ్మ... ట్రంకు పెట్టెలో దాచి పెట్టిన స్టీలు కంచం బయటకి తీసి... వాళ్ళు చూస్తుండగా అయిదారుసార్లు కడి గింది.

కుండలోంచి పొగలుకక్కే అన్నం కంచంలో వడ్డించి... గోంగూర పచ్చడేసి కలిపింది.

"ఆం" అని నోరు తెరిచింది నిత్య.

నిత్య తినడం చూసి... తటపటాయి







డికాయల్ని... చన్నీలో మూటకట్టుకుంది నిత్య.

"మా ఇళ్ళలో వణ్ణందిన్నట్టు ఎవులికీ సెప్పబాకండ్రి" అన్నాడు తోటమాలి తల గోక్కుంటూ.

గున్నమావి గుబుర్ల సందుల్లోంచి నేల మీదపడి... తారట్లాడుతున్న ఎండపొడల తళతళల్ని... కళ్ళనిండా పోగేసుకుని... ఇంటిదారిపట్టింది నిత్య హైమావతి వెంట.

నిత్య ఇంటికి చేరిన గంటకి వసంతా, నందూ వచ్చారు.

చూస్తుండగానే వారం గడిచిపోయింది. దివాకర్ వచ్చాడు. అప్పటికప్పుడు బయల్దేరమని హడావుడి చేస్తున్న అల్లుడ్ని వారించి గారెలూ... బూరెలూ వండి మర్యాదలు చేసింది సౌభాగ్యమ్మ.

వసంతతోపాటు నందూ కూడా బయల్దేరేలా నిర్ణయం జరిగింది.

"ఈ వారంబట్టీ నిత్య ప్రవర్తనలో ఏ విపరీతం లేదుకదూ!" రహస్యంగా అడిగాడు దివాకర్.

"ఆ డాక్టర్ ప్రవర్తనే విపరీతంగా వుంది'' నిరసనగా అన్నది వసంత.

దివాకర్ తృప్తిగా వూపిరి పీల్చుకున్నాడు.

"పిల్ల నచ్చిందని ఫోన్ చెయ్యించనా వసంతా!" అనడిగింది సౌభాగ్యమ్మ.

"ఏరా నందూ" అంది వసంత.

నందూ సిగ్గుపడ్డాడు. అతనేం చెప్పక్కర్లేకుండానే అర్థమైంది వాళ్ళకి.

"బాగా చదివి మీ అమ్మ కలలు నిజం చెయ్యాలే నిత్యా" అంది సౌభాగ్యమ్మ మనమరాలి తలనిమిరి.

నిత్య పక్కింటికెళ్ళి వూరెళ్తున్నట్టు చెప్పి హైమావతి చేతికి యాభై రూపాయల నోటిచ్చి "రోజూ చింతాతాతకు బజ్జీలు కొని పెట్టు, నా పేరు చెప్పటం మర్చిపోకేం" అన్నది.

నాగభూషణం వీధి మలుపుదాకా వచ్చాడు. దివాకర్ వారిస్తే ఆగిపోయాడు. అందరూ మెయిన్‌రోడ్డు దగ్గరకొచ్చి బస్ కోసం వెయిట్ చేస్తూ నిలబడ్డారు.

ఓ కుర్రాడు గసపెట్టుకుంటూ నిత్య దగ్గరకొచ్చాడు. "అక్కా... మొద్దోడు ఈ జాంపళ్ళు నీకిచ్చి రమ్మన్నాడు" అంటూ నాలుగు దోరమగ్గిన పళ్ళు ఆమెకిచ్చాడు.

"అదేం... శీనూ రాకూడదూ" అంది నిత్య.

ఓసారి శీనూని చూడాలని వుందామెకు.

"నీ కోసం పళ్ళు కోద్దామని జామచెట్టెక్కాడా! ఎవరో నువ్వెళ్ళిపోతున్నావని చెప్పేసరికి హడావుడిగా దిగబోయి జారిపడ్డాడు. కుడికాలు విరిగిపోయిందాడికి"

గుండెల్లో కలుక్కుమంది ఎందుకో. నందూవైపు చూసింది.

దుమ్మురేపుకుంటూ బస్ వచ్చి ఆగింది. వసంత ఎక్కేసి నిత్యను ఎక్కమన్నట్టు చేయి చాపింది.

నిత్య మళ్ళీ నందూవైపు చూసింది.

"వాడికేం కాదులే... ఏడాదికోసారి వాడేదో ఒకటి విరగ్గొట్టుకుంటూనే వుంటాడు" అన్నాడు నందూ.

నిత్య బస్సెక్కి నిశ్శబ్దంగా కూర్చుంది.




వారం రోజులుగా ఇంట్లో పేరుకుపోయిన దుమ్మూ, ధూళీ దులిపి ఇల్లంతా కడిగి అన్ని సర్దుకునేసరికి వసంత పని అయిపోయింది. అయితే నిత్య హెల్ప్ చేస్తానన్నా వసంత ఒప్పుకోలేదు. 'నువ్వు చదువుకో'

అంటూ మొత్తం పని ఒంటిచేత్తో చేసేసింది.

"అక్కా! రేపు నిత్య వెళ్ళిపోతుంది కాబట్టి... ఇవాళ అందరం సినిమా కెళ్దాం" అన్నాడు నందూ.

"టైం వేస్టేమో" నాన్చింది వసంత.

"మరీ ఓవర్ చెయ్యకు" విసుక్కున్నాడు దివాకర్.

వసంత 'పోనీలే' అనుకుంది.

వసంత పనిచేసి అలసిపోయింది కనుకా వంట చెయ్యకూడదు... అందరూ హోటల్లో భోంచెయ్యాలి అని నిర్ణయం జరిగింది.

అయిదున్నరకి అందరూ రెడీ అయ్యారు. నందూ బైక్ మీదెళ్ళి 'మల్లీశ్వరి'కి టికెట్స్ తెచ్చాడు.

దివాకర్ నందూని ఆటో పిలవమంటే వసంత "ఎందుకూ వెహికల్ వుందిగా" అంది.

"ఎందుకు లేదూ... నువ్వూ, నేనూ, నిత్యా ఎక్కి వెళ్దాం. నందూ వెనకాల పరిగెత్తు కుంటూ వస్తాడు" అన్నాడు దివాకర్.

నాలుక్కరుచుకుంది వసంత.

"హుఁ... రక్తసంబంధం!" విరక్తిగా వసంతకేసి చూసి... ఆటోకోసం వెళ్ళాడు నందూ.

సిన్మాలో హీరోయిన్... హీరోని 'పెళ్ళికాని ప్రసాదూ' అని పిలుస్తూంటే నిత్య విరగబడి నవ్వింది.

ఇంటర్వెల్‌లో నందూ అందరికీ కూల్ డ్రింక్స్ తెచ్చాడు.

సినిమా అయ్యాక హోటల్‌కెళ్ళి... భోంచేసి ఇంటికి చేరేసరికి...

పదకొండు దాటింది.

"ఇవాళ దాన్ని పడుకోనీ" చెప్పాడు దివాకర్.

"ప్చ్... ఈ సిన్మావల్ల టైమంతా వేస్ట్" సణుక్కుంది వసంత.

అలసిపోయిన అందరూ ఆదమరిచి నిద్రపోయారు. రాత్రి రెండు గంటలప్పుడు చటుక్కున మెలకువొచ్చింది హాల్లో పడుకుని ఉన్న నందుకి. ఎవరో... తన తలవైపు నుంచి నడిచివెళ్తున్న అలికిడి.

ఒక్కసారిగా మనసులో మెదిలాయి, ఈ వారం బట్టీ మరిచిపోయిన సంఘటనలన్నీ.

కాస్త భయంగా అన్పించింది. ఎందుకైనా మంచిదని కాళ్ళ నుండి తలదాకా దుప్పటి ముసుగుతన్ని పడుకున్నాడు. అయినా నిద్ర పట్టలేదు.

పెరటి తలుపు బోల్ట్ ఎవరో తీస్తున్నట్లూ సన్నగా చప్పుడైంది. ఇక ఆగలేకపోయాడు. పక్కనే ఉన్న దివాకర్‌ని తట్టిలేపాడు.

ఆ ఇంట్లో భీతిగా ఉన్న దగ్గర్నుంచీ దివాకర్... నందూ కలిసి హాల్లో పడుకుంటున్నారు.

నిత్య నొక్కదాన్ని పడుకోనీకుండా వసంత తన దగ్గర పడుకోబెట్టుకుంటోంది.

"బావా! పెరటి తలుపు చప్పుడైంది" లోగొంతుకలో చెప్పాడు నందు. ఇద్దరూ లేచి మెల్లగా నడుచుకుంటూ... పెరటి తలుపు దగ్గరికి చేరుకున్నారు.

నందు అనుమానం నిజమైంది. బోల్ట్ తీసేసి ఉంది. నందు తలుపు తెరవబోతుంటే దివాకర్ వారించాడు.

అతని బుర్ర పాదరసంలా పనిచేస్తోంది. అటాచ్డ్ బాత్‌రూమ్ ఉండే ఇల్లు రాత్రివేళ పెరటి తలుపు తెరవాల్సిన అవసరం ఆ ఇంట్లో ఎవరికీ లేదు. బయటి నుంచి తలుపు తీస్తే... అది బయటి దొంగపని... బట్... లోపల్నుంచి తీశారు కాబట్టి... ఇది ఇంటి దొంగ పని.

ఒకవేళ... ఒకవేళ...

అతను శబ్దం చెయ్యకుండా వెళ్ళి బెడ్‌రూం తలుపులు నెట్టాడు.

ఆదమరిచి నిద్రపోతోంది వసంత. ఆమె పక్కనే ఉండాల్సిన నిత్య లేదు. వెనువెంటనే మెదిలాడు... దివాకర్ మనసులో డాక్టర్ అలోక్. ఇంకేం ఆలోచించలేదు దివాకర్. ఏదో మాట్లాడబోతున్న నందుని నిశ్శబ్దంగా







ఫాలో అవమని సైగచేసి... పెరటి తలుపు కొద్దిగా తెరిచి తొంగి చూశాడు.

వేపచెట్టు మొదట్లో అటు తిరిగి కూర్చుని ఉంది ఒక ఆకారం. మసక వెన్నెల్లో ఆ ఆకారాన్ని దివాకర్ కళ్లు అస్పష్టంగా పోల్చుకున్నా అతని మనసు మాత్రం స్పష్టంగానే పోల్చుకుంది.

నందు కంగారుపడుతుంటే... దివాకర్ అతని భుజం మీద చెయ్యేసి... చిన్నగా తట్టి సముదాయించాడు. మెదలకుండా ఉండమని కళ్లతోనే అర్థించాడు.

ఆ ఆకారం... చెట్టు మొదట్లో మట్టిని తొలగించి... ఒక వస్తువుని బయటికి తీసింది. అందులోంచి ఏదో పదార్థాన్ని చిన్న గిన్నెలాంటి దాన్లోకి వంపింది. అదేదో ద్రవపదార్థమని అర్థమైంది వాళ్లకు.

మెల్లగా లేచి ప్రహరీ గోడవైపు నడిచింది.

"మీ అక్కను లేపుకురా నందూ. చూడూ... అల్లరి చెయ్యకుండా రమ్మను" నందు చెవిలో చెప్పాడు. అట్లా చెబ్తున్నప్పుడు దివాకర్ గొంతు వణకడం... నందూ గమనించాడు.

ఆ ఆకారం ఓ అయిదు నిముషాలపాటు ఆ గోడమీద ఏదో రాసి... వెనక్కి తిరిగింది.

దివాకర్... చప్పున పెరటి తలుపు దగ్గరకు వేశాడు. వసంతనీ... నందునీ పక్కకు తప్పుకోమన్నాడు.

వసంత "నన్ను వెళ్లనివ్వండి... ప్లీజ్" అంటూ ఏడుస్తుంటే "ష్... అరవకు" అంటు గదిమాడు.

రెండు నిముషాల తర్వాత తెరుచుకుంది తలుపు.

నిశ్శబ్దంగా లోపలికడుగు పెట్టి... పెరటి తలుపుకి యథాతథంగా బోల్ట్ పెట్టింది నిత్య.

★ ★ ★

"రేపటితో నీపని ఆఖరు"

పెరటి గోడమీద రక్తంతో తల్లకిందులుగా రాసివున్న ఆ ఎగుడుదిగుడు అక్షరాల్ని చదవగానే "మమ్మీ" అంటూ గావుకేకపెట్టింది నిత్య.

రాత్రి నిత్య లోపలికి రాగానే... పెరట్లో లైట్ వెలిగించి గోడమీద ఆమె రాసిందేమిటో చూశారు వాళ్లు.

ఆ షాక్ని తట్టుకోలేక దివాకర్ భుజం మీద వాలిపోయింది వసంత. నందూ ఆ రాతల్ని చెరిపెయ్యబోతుంటే వారించాడు దివాకర్.

"అదట్లాగే ఉంచు నందు... రేపు దాని రియాక్షన్ అబ్జర్వ్ చేద్దాం" అన్నాడు.

నిత్య పెట్టిన గావుకేకకి వసంతేం కంగారు పడలేదు. అసలు రాదల్చుకోనట్టుగా కూర్చున్నచోటే ఉండిపోయింది.

"వెళ్లు వసూ! దాని ఎమోషన్స్ కనుగుణంగా మనం స్పందించినట్టు కనబడాలి" దివాకర్ ఆమెను తొందరచేశాడు.

వసంత కళ్లు తుడుచుకుంటూ పెరట్లోకి వెళ్లింది.

నిత్య యాంగ్జయిటీగా వసంత దగ్గరకు పరుగెత్తింది. నిత్య శరీరం సన్నగా కంపించడాన్ని గమనించింది వసంత. "ఇదేంటి... ఇవాళ...ఊరెళ్తుంటే...మళ్లీ ఈ రాతలు" నిత్య కళ్లలో నీళ్లు.

"ఇంత నటనా?" వసంత నిత్యకేసి అదోలా చూసింది. ఈలోపు నందూ... దివాకర్ అక్కడికి వచ్చారు.

"దెయ్యం.... మీ కూతుర్ని మింగుతుందట... గోడమీద రాసింది" ఉక్రోషంగా అంది వసంత దివాకర్తో.

తల్లి మాటలో తేడాని కనిపెట్టేసింది నిత్య. నిత్య వసంత కేసి హర్ట్ అయినట్టుగా చూడ్డాన్ని దివాకర్ గమనించేశాడు.

అందుకే ఆమె దృష్టి మళ్లించడానికన్నట్టు గబగబ గోడ దగ్గరకెళ్ళి రెండు చేతులూ రెండు జేబుల్లో పెట్టుకుని పరిశీలిస్తున్నట్టుగా నిలబడ్డాడు.

అతను అనుకున్నట్టే... నిత్య వచ్చి

పక్కన నిలబడింది.

"నిత్యా! ఇది చదూతుంటే నాకో డౌట్ కలుగుతోందిరా" అన్నాడు దివాకర్.

"ఏంటి డాడీ? " అడిగింది నిత్య.

"డాక్టర్ అలోక్ అన్నట్టు ఇది మనుషుల పనే అన్పిస్తోంది. మన ఇంటి సభ్యుల్లోనే ఒకరిలా చేస్తున్నారని కదా ఆయన చెప్పారు"

"అట్టా చెయ్యాల్సిన అవసరం మనింట్లో ఎవరికుంది డాడీ? " అని ఒక్క క్షణం సాలోచనగా వుండిపోయి మళ్ళీ అంది "నువ్వు రాయవు. మమ్మీ రాయదు. నందూ మామయ్య...రాయడు... నేను..."

"నువ్వు రాశావేమో!" తీక్షణంగా చూసింది వసంత నిత్య వైపు.

నిత్య అలాగే వసంతకేసి చూసింది. క్రమంగా నిత్య కళ్ళు నీటితో నిండాయి. అక్కడ నిలబడలేనట్టు లోపలికెళ్ళిపోయి తన బెడ్‌రూంలో బెడ్‌మీద బోర్లా పడింది.

"నువ్వు టూ ఎమోషనల్ వసంతా" దివాకర్ విసుక్కున్నాడు.

"స్వయంగా కళ్లతో చూశాక్కూడా ఎమోషనల్ కాకుండా ఎట్లా వుంటాను"

"చూడకముందు కూడా ఇట్లాగే ఎమోషనల్ అయ్యావ్. డాక్టర్‌నే సవాల్ చేశావుగా" ఈ మాటతో వసంత ముఖం మాడ్చుకుని గప్‌చిప్‌గా వుండిపోయింది.

"చూడు వసూ! డాక్టర్ ఓ మాట చెప్పాడు గుర్తుందా నీకు? " ఏంటన్నట్టు చూసింది.

"ఏదో మానసిక దౌర్బల్యం వల్ల ఈ విపరీత మనస్థితి వస్తుందనీ... ఆ స్థితిలో వాళ్ళు చేసే పనులు వాళ్లకే గుర్తుండకపోవచ్చుననీ" వసంత తలూపింది.

"సో... మన నిత్యకి రాత్రి తను చేసిన పని తనకే గుర్తులేదేమో!"

"సరే ఆ విషయం వదిలెయ్యండి. గుర్తుందా లేదా అనేది ఇప్పుడు సమస్య కాదు. అసలట్లా చెయ్యటానిక్కారణమేంటో మనం తెల్సుకోవాలి"

"మరి ఇవాళ హాస్టల్‌కి ప్రయాణం కుదరదేమో!"

"ఇవ్వాళే డాక్టర్ దగ్గరకెళ్దాం నిత్యని తీసుకొని"

"ఉండు తొందరపడకు... ఫోన్‌చేసి అప్పాయింట్‌మెంట్ తీసుకోనివ్వు" అన్నాడు నందూ... బక్కెట్ నిండా నీళ్ళు తెచ్చి పెరటి గోడను శుభ్రంగా కడిగేశాడు.

దివాకర్ ఫోన్ చేస్తే... అలోక్ ఆ మరుసటి రోజుకి అప్పాయింట్‌మెంట్ ఇచ్చాడు.

"లక్షణంగా చదువుకోవాల్సిన పిల్లకు ఈ ఖర్మేంటండీ? " మళ్ళీ కన్నీళ్ళు పెట్టుకోబో

## తీర్పు



'విజయచిత్ర'లో పనిచేస్తున్న రోజుల్లో ఒకరోజున కొండలరావు స్కూటర్ మీద వెళ్తుండగా సిగ్నల్ పడ్డా ఆగలేదేమంటూ కానిస్టేబుల్ ఆపి మొబైల్ కోర్టు ముందు నిలబెట్టాడు. నిజానికి ఆయనవద్ద డ్రైవింగ్ లైసెన్సు లేదు. ఆ విషయం కూడా తెలిస్తే మరింత ఇబ్బందేనని కొండలరావు ఆందోళన.

'సిగ్నల్ పడ్డా ఆపకుండా వెళ్తున్నారట' అన్నాడు జడ్జి.

'అవును' అన్నారు కొండలరావు.

'ఎందుకలా చేశారు? '

'ఫైన్ కడదామని..' అన్నారు కొండలరావు ఏంచెప్పాలో తోచక.

ఆ జవాబుకు న్యాయమూర్తికి నవ్వొచ్చింది. సరే ఫైన్ కట్టేసి వెళ్లండి అన్నారు డ్రైవింగ్ లైసెన్స్ గురించి అడక్కుండానే.







యిన వసంతను వారించాడు.

"ఈ ఒక్కరాత్రి గడిస్తే... రేపు విషయం తెలుస్తుంది. వెళ్ళు... వెళ్ళి ఏం జరగనట్టే నిత్యను ఓదార్చు..."

నిత్య గదివైపు వెళ్ళబోతూ భయంగా అనుకుంది వసంత 'భగవంతుడా ఇంకా ఒక రాత్రి గడవాలా!'




"**నిత్య** ప్రవర్తనకు ఏదో మూలకారణం వుంది. ఆ మూలకారణం నిత్యను తన ప్రవర్తననూ, అనుభూతులనూ... అర్థవంత మయిన రీతిలో మలుచుకోనీక అడ్డుపడు తోంది. ఆమెను తీవ్ర వ్యాకులత... భయా నికి గురిచేసే మూలకారణాన్ని అమె చేత గుర్తింపజేసి ఎదుర్కొని... అధి గమించేటట్టు చేయాలి"

డాక్టర్ అలోక్ చెప్పింది శ్రద్ధగా విన్నారు దివాకర్... వసంతలు. డాక్టర్ అలోక్‌కి ఫోన్‌చేసి అప్పాయింట్‌మెంట్ తీసుకున్న రాత్రి... నిత్య ఒక దారుణమైన పని చేసింది.

క్రితం రాత్రి సంఘటనతో బెంబేలెత్తిపో యిన వసంతా, నందూ, దివాకర్లు చాలా సేపు మేల్కొని మేల్కొని తెల్లవారుఝా మున నాలుగ్గంటలకు మాగన్నుగా నిద్రలో పడ్డారు.

అదను చూసి లేచింది నిత్య. శబ్దం కాకుండా అడుగులేస్తూ... కిచెన్ డోర్ తీసు కుని లోపలికి వెళ్ళింది.

గదిలో లైటు వెయ్యకుండానే కప్‌బోర్డ్‌లో తడిమి కూరగాయలు కోసుకునే కత్తి దొరక బుచ్చుకుంది.

ఆమె అట్లా వెతుకుతున్నప్పుడు... ప్లేట్ కింద పడి పెద్ద శబ్దమైంది. ఉలిక్కిపడి ఒక్కసారిగా లేచారు ముగ్గురూ...

నిద్రమత్తు వదిలించుకుని... ఏం జరుగు తోందో చూసేలోగానే ఘోరం జరిగిపో యింది.

కిచెన్ తలుపు తీసి వుండటం గమనిం చింది ముందుగా వసంత. హడావుడిగా వెళ్ళి లైట్ స్విచాన్ చేసిందామె.

లైట్ వెలుతుర్లో కనబడిన దృశ్యం ఆమె మస్తిష్కంలో డైనమైట్‌నే పేల్చింది.

ఎడం చేతిని ముందుకు చాపి కుడిచే తిలో పట్టుకున్న కత్తితో మణికట్టు మీది రక్తనాళాల్ని కోసుకుంటోంది నిత్య.

ఒక్క ఉదుటున వెళ్ళి... కత్తి చేతుల్లోకి లాక్కుంది. ఆసరికే మణికట్టు దగ్గర్నుంచి రక్తం ధారలుగా కడుతోంది.

సగం కాటన్ చీరె మొత్తం తడిపి చుట్టినా రక్తం స్రవిస్తూనే వుంది.

నందూ... బైక్ మీదెళ్ళి నిమిషాల్లో ఆటో పిల్చుకొచ్చాడు.

వసంత ఏడ్పు విని చుట్టుపక్కల వాళ్ళు కూడా లేచిపోయారు. ముందు వసంతని ఎక్కమని చెప్పి... నిత్య తల ఆమె ఒళ్ళో అమరేలా సీట్‌మీద పడుకోబెట్టారు. దివా కర్ డ్రైవర్ పక్కన కూర్చుని నందూని బైక్ మీద వెనకాల రమ్మన్నాడు.

హాస్పిటల్ చేరేంతవరకూ... నిత్య ఎడం చేతి మణికట్టుని అదిమి పట్టుకునే వుంది వసంత.

వసంత కళ్ళలోని నీళ్ళతో పోటీపడుతూ నిత్య... మణికట్టు నుంచి రక్తం కారు తోంది.

ఆ రాత్రివేళ కేస్ టేకప్ చేయడానికి డాక్టర్ తటపటాయిస్తుంటే కాళ్ళావేళ్ళా పడి అడ్మిట్ చేశారు. అది ప్రయివేట్ క్లినిక్ కాబటి డబ్బులు వెదజల్లి పోలీస్ కేస్

కాకుండా మేనేజ్ చేశాడు దివాకర్.

నాలుగు బాటిల్స్ రక్తం ఎక్కించాక మెల్లగా కళ్లు విప్పింది నిత్య.

"నిత్యా... నిత్యా" అని పిలుస్తూ వసంత కొట్టుకులాడుతున్నా ఆమె వైపు చూడలేదు నిత్య.

తండ్రి పలకరించినా అదే పరిస్థితి. నందూ పిలుపుకు మాత్రం కాస్త రెస్పాన్స్ ఇచ్చింది.

"ఎందుకు నిత్యమ్మా... ఎందుకు చేశావిట్లా? " నిత్య తల నిమురుతున్న నందూ కళ్లలో నీళ్లు తిరుగుతున్నాయి.

నిత్య నిర్జీవంగా ఓ నవ్వు నవ్వింది.

"డోంట్ డిస్టర్బ్ హర్" అన్నాడు డాక్టర్.

ఉదయం పది గంటలకంతా సౌభాగ్యమ్మా, నాగభూషణం దిగారు.

మూడు రోజులు ఇంటెన్సివ్ కేర్‌లో వుంచి డిశ్చార్జి చేశారు.

ఎవరెంత అడిగినా నిత్యది ఒకటే సమాధానం. అది నిర్జీవమైన నవ్వు.

దివాకర్ చెప్పాడు ఇంట్లో అందరికీ "ఇక దాన్ని ప్రశ్నలు వేసి విసిగించొద్దు. అలోక్ గార్ని కలిస్తే అన్నీ క్లియర్ అవుతాయి"

అతను మళ్లీ డాక్టర్ అలోక్‌కి ఫోన్ చేసి జరిగిన విషయం వివరించి మళ్లీ అప్పాయింట్‌మెంట్ తీసుకున్నాడు.

★ ★ ★

"నిత్యను హిప్నటైజ్ చేసి నిద్రపుచ్చి.. హెటెరో సజెషన్స్ ఇవ్వటం ద్వారా... లోపల విషయాలను బయటకు చెప్పిస్తాను. ఐ విల్ మేక్ హర్ టు టాక్ అవుట్. అయితే ఆ అమ్మాయి నిద్ర నుంచి మేల్కొన్నాక నిద్రలో వెలిబుచ్చిన విషయాలేవీ ఆమెకు గుర్తుండవు. బట్... ఈ ప్రాసెస్‌లో రూట్ కాజ్ మనకు తెలిసిపోతుంది. అప్పుడు ట్రీట్‌మెంట్ మొదలుపెడదాం" డాక్టర్ అలోక్ చెప్పాడు.

"మీరేం చేస్తారో మీ ఇష్టం డాక్టర్... బట్... నా కూతురు మళ్లీ మామూలు మనిషి కావాలి" కళ్లలో నీళ్లు తొణుకుతుండగా చెప్పింది వసంత.




**మం**ద్రంగా పరుచుకొని వుందా గదిలో నీలిరంగు కాంతి. నిత్యకెదురుగా వున్నాడు డాక్టర్ అలోక్. కొంచెం సేపు... హెటిరో సజెషన్స్ చేశాడు. చూస్తుండగానే నిత్య సెమి హిప్నాటిక్ దశలోకి వెళ్ళింది. అలోక్ ప్రశ్నల కనుగుణంగా చెప్పడం మొదలు పెట్టింది.

మీరా నోట్స్ రాస్తోంది. ఆ గదిలోనే ఓ కార్నర్‌లో కూర్చుని వున్నారు దివాకర్ దంపతులు.

"ఆ పనులన్నీ చేసింది నేనే. అక్కడ హాస్టల్లో ఇక్కడ ఇంట్లో అన్నీ నేనే చేశాను. సత్యం కాలేజ్‌లో చేరేముందు... ఎవరికీ తెలీకుండా బ్లడ్ బ్యాంక్‌లో ఓ బాటిల్ రక్తం కొన్నాను. దాన్ని ప్యాక్ చేసి నా బేగ్‌లో బట్టల అడుగున దాచుకున్నాను.

నైట్ స్టడీ అవర్స్ తర్వాత అందరూ మెస్‌కు వెళ్లినప్పుడు నాకు ఆకలి లేదని చెప్పి రూమ్‌లోనే వుండిపోయాను. తరువాత ఎవరూ చూడకుండా మా రూమ్ డోర్ మీద బ్లడ్‌తో "ఈ గదిలో దెయ్యం వుంది" అని రాశాను. నా అక్షరాలు ఎవరూ గుర్తుపట్టకుండా వుండేందుకు... తల్లకిందులుగా ఒంకర టింకరగా రాశాను. ఇంకోసారి ఆ బాటిల్లోని బ్లడ్‌ని పెరుగులో పోసి అందర్నీ భయపెట్టాను.

"మంటలు సృష్టించడానికి నీకు ఎల్లో పాస్ఫరస్ ఎక్కడిది? "







"అదీ కొన్నాను. కెమికల్స్ అమ్మే షాపులో"

"నీకు ఇవన్నీ కొనడానికి డబ్బులెక్కడివి? "

"మా డాడీ పాకెట్ మనీ ఇస్తారుగా. అవి వాడాను"

"ఇంట్లో... ఇసుకా రాళ్ళూ ఇవన్నీ కూడా నీ పనే కదూ"

"ఆఁ... ఎవరూ చూడనప్పుడు... రాళ్లు ఇసకా ప్లాస్టిక్ కవర్స్‌లో పోగేసుకుని నా బెడ్‌రూంలో నా పర్సనల్ కప్‌బోర్డ్‌లో దాచేదాన్ని, అందర్నీ నిద్రపోనిచ్చి ఇల్లంతా చల్లేదాన్ని"

"అవునూ... రెండుసార్లు ఉరి వేసుకోబోయావెందుకు? "

"రాధికలా నాకూ చనిపోవాలన్పించింది"

"రాధికెవరు"

"ఆరేడేళ్ళ క్రితం మా హాస్టల్లో వుండేదట. హాస్టల్ రూమ్‌లోనే వురివేసుకుని చనిపోయిందట"

"ఎందుకు చనిపోయిందట? "

"మార్కులు తగ్గాయని లెక్చరర్ అవమానించిందట"

"నీకీ విషయం ఎట్లా తెల్సు? "

"రాజమ్మకు పూనకం వచ్చినప్పుడు బయటపడిందీ సంగతి"

"రాజమ్మెవరు? "

"మా హాస్టల్ కుక్"

"ఆమెకు పూనకం ఎప్పుడు వచ్చింది? "

"నేను చేసే పన్లన్నీ దెయ్యం చేస్తున్నాయనుకుని బెంబేలు పడిపోయారంతా మేనేజ్‌మెంట్ ఓ సారి మంత్రగాళ్ళని పిలిపించి... హాస్టల్ కేంపస్‌లో పూజలు చేయించింది. అప్పుడు రాజమ్మ ఒంట్లోకి రాధిక ఆత్మ వచ్చింది. హాస్టల్‌ని సర్వనాశనం చేస్తానని చెప్పింది. ఇది నేను అడ్వాంటేజ్‌గా తీసుకుని ఆ దెయ్యమే ఈ పన్లన్నీ చేస్తున్నట్టు మేకప్ చేసుకుంటూ వచ్చాను"

**"ఆఁ... ఎవరూ చూడనప్పుడు... రాళ్లు ఇసకా ప్లాస్టిక్ కవర్స్‌లో పోగేసుకుని నా బెడ్‌రూంలో నా పర్సనల్ కప్‌బోర్డ్‌లో దాచేదాన్ని, అందర్నీ నిద్రపోనిచ్చి ఇల్లంతా చల్లేదాన్ని"**

"నిజంగా రాధిక ఆత్మ వుందని నువ్వు నమ్ముతున్నావా? "

"నాకట్లాంటి నమ్మకాల్లేవు. అయితే... అప్పుడప్పుడూ రాధిక నా కల్లోకి వస్తూండేది"

"ఎక్కడో చెట్లమధ్య మంత్రగాడు భూస్థాపితం చేసిన బాటిల్ తిరిగి హాస్టల్ కేంపస్‌లో కెట్లా వచ్చింది. నువ్వు మళ్ళీ తవ్వి తెచ్చావా? "

"ఉహూఁ... అట్లాంటిదే హార్లిక్స్ బాటిల్ సంపాదించి కేంపస్‌లో పగులగొట్టి ఆ గాజు ముక్కల మధ్య రాధిక రాసినట్టు రక్తంతో రాసిన లెటర్ పెట్టాను'

"'ఎందుకట్లా చేశావ్? "

"దెయ్యం వెళ్లిపోయిందని అందరూ నమ్మితే... మళ్ళీ నేను వాళ్ళని భయపెట్టలేనుగా. అందుకే దెయ్యం మళ్లీ హాస్టల్లో ప్రవేశించినట్టు క్రియేట్ చేశా"

"గ్లాసులూ, ప్లేట్లూ గాల్లో ఎగిరాయని... కనబడని నోళ్ళేవో కొవ్వొత్తిని వూది ఆర్పేసేవనీ... మీ ఇంట్లో వాళ్లు భయపడ్డారు. ఇవన్నీ ఏంటీ? "

"గ్లాసులూ, ప్లేట్లూ ఎగరడం నిజానికి వాళ్లెవరూ చూడలేదు. నేనే వాటిని పగలగొట్టి... అవి ఎగురుతూ వచ్చి కింద పడిపోయాయని వెర్రికేకలు వేసేదాన్ని... వాళ్లే చూసినట్టుగా ఫీల్ అయ్యేంత సీన్ క్రియేట్ చేసేదాన్ని. కొవ్వొత్తి ఆట కూడా అంతే. ఎట్లాగో దాన్ని ఆరిపోయేలా చేసి

నేను చూస్తుండగానే ఎవరో వూదేశారని గోల చేసేదాన్ని. అయితే ఒక్కోసారి మాత్రం...వాళ్ళు అట్లాంటివి చూసినట్టుగా నాకు చెప్పేవాళ్ళు అదెట్లాగో నాకు తెలీదు"

"నీ జుట్టుని మూడుసార్లు దెయ్యం కత్తిరించిందట"

"నా జుట్టు నేనే కత్తిరించుకుని... పక్కలో కత్తెర పెట్టుకుని తెలీనట్టు పడుకొనేదాన్ని. హాస్టల్లో మా రూమ్మేట్ 'తేజస్విని' జుట్టు కూడా నేనే కత్తిరించి సాదియా బేగ్‌లో బట్టల అడుగున దాచా"

"నీ ఫ్రెండ్ జుట్టుని అలా కత్తిరించడం అన్యాయం కదా!"

"లేదు... చుడీదార్ మీదకి ఆ జుట్టు నప్పడంలేదని అందరూ తేజస్వినిని గేలిచేసేవాళ్ళు. అది మాత్రం ఆ స్టైయిల్ మార్చదు. అందుకే... దాని స్టైయిలు మార్చినట్టు వుంటుంది... అందర్నీ భయ పెట్టినట్టూ వుంటుందని ఆపని చేశా. నేన నుకున్నట్టే అందరూ దాని హెయిర్‌స్టయిల్‌ని మెచ్చుకున్నారు కూడా"

"మీ మామయ్య నందగోపాల్‌కి రక్తంతో ప్రేమలేఖలు రాసింది నువ్వేకదా!"

"అవును. నా పనులకి అడ్డం రాకుండా భయపడి వెళ్ళిపోవాలని అట్లా చేశా. ఓ బాటిల్ బ్లడ్‌ని మా పెరట్లో వేపచెట్టు కింద నేల అడుగున దాచిపెట్టాను. ఫ్యాబ్రిక్ పెయింట్ వేసుకునే బ్రష్‌తో రక్తంలో ముంచి లవ్ లెటర్స్ రాసేదాన్ని"

"నీ ప్రమేయం లేకుండా... మీ ఇంట్లో గానీ... హాస్టల్లోగాని జరిగిన విశేషాలేమైనా వున్నాయా? "

"హాస్టల్లో రాజమ్మకు పూనకం రావడం... మా ఇంట్లో మా అమ్మమ్మకు పూనకం రావడం గురించి నాకు తెలీదు. మా హాస్టల్ వాచ్‌మెన్ నర్సింలు... పొదల్లోకి ఒంటికి పోతే ఏదో చెయ్యి అతని గొంతు పట్టుకున్నదని చెప్పాడు. మా లెక్చరర్స్‌లో కొంతమంది కూడా... ఏవేవో దృశ్యాలు కనబడ్డాయని భయపడిపోతుండే వాళ్ళు. ఇవేవీ నాకు తెలియవు"

"హాస్టల్లో... ఎందుకట్లా అందర్నీ బెదరగొట్టావ్? "

"సెలవులు కావాలని. ఎప్పుడూ చదవటమంటే బోర్‌గా వుండేది"

"చదువంటే ఇష్టంలేదా? "

"చాలా ఇష్టం. నాకు చక్కగా చదువుకోవాలనే వుంది. నేను బ్రిలియంట్ స్టూడెంట్‌ని తెల్సా"

"మరి బ్రిలియంట్ స్టూడెంట్‌వి... ఆఫ్టాల్ సెలవులకోసం అట్లా చెయ్యొచ్చా..."

"ఆఫ్టాల్ సెలవుల కోసం కాదు. నామీద చాలా స్ట్రెస్ వుంది. ఆ ఒత్తిడికి తట్టుకోలేక విశ్రాంతి కావాలనుకున్నాను"

"స్ట్రెస్సా? ఏంటది? "

"నేను ఇంటర్‌లో చేరినప్పటినుంచీ... మా లెక్చరర్స్‌కీ... మా స్కూల్ మేనేజ్‌మెంట్‌కీ నామీద అపారమైన నమ్మకం. కాలేజీలో అందరికంటె ఎక్కువ మార్కులు నేనే తెచ్చుకోవాలి. ఒక్క మార్కు అటూ ఇటూ అయినా బోలెడు డిస్కషన్స్ జరిగేవి.

కాలేజ్ ప్రతిష్ఠ అంతా నామీదే ఆధారపడివుందనీ... ఆ అకడమిక్ ఇయర్‌కి నేను వాళ్ళకి స్టేట్ ఫస్ట్ సంపాదించి పెట్టి తీరాలనీ... ఒకటే వత్తిడి చేసేవాళ్ళు"

"అది నీకూ గర్వకారణమేగా"

"కాదు. నాకెంత మాత్రం కాదు"

"ఎందుకని? నీకు స్టేట్ ఫస్ట్‌ర్యాంక్ తెచ్చుకోవటం ఇష్టంలేదా? "

"అంతకుమించి 'మమ్మీ' అంటే ఎక్కువిష్టం. మమ్మీ నా ప్రాణం. ఆమె లేకుండా నేను బతకలేను"

"మీ మమ్మీకి... స్టేట్ ర్యాంక్‌కీ... సంబంధం ఏంటి నిత్యా? "







"నేను స్టేట్ ఫస్ట్ తెచ్చుకోకపోతే... మమ్మీ సూసైడ్ చేసుకుంటుంది"

"ఎందుకట్లా? "

"మా నాన్నమ్మతో మమ్మీ బెట్ కట్టింది. మా డేడీ చెల్లెలి పెళ్ళికి... వాళ్ళు మూడు లక్షలు ఇమ్మన్నారు. మా డేడీ అంతివ్వలేను... ఓ లక్ష సర్దుతాను" అన్నాడు.

"నీ కూతురి చదువులకైతే వేలువేలు తగలేస్తావే... అదంతా పొదుపుచేసి నీ చెల్లెలి పెళ్ళి ఘనంగా చెయ్యరాదూ! ఇంతా చదివి రేపు నీ కూతురు వెలగబెట్టబోయేది... నీ పెళ్ళాంలా ఆ ముష్టి ఉద్యోగమేగా" అని నానమ్మ డాడీని తిట్టిపోసింది.

మమ్మీకి చాలా కోపం వచ్చేసింది. "నా కూతురు మీరనుకుంటున్నట్టూ సామాన్యురాలు కాదు. అది ఎమ్‌సెట్‌లో స్టేట్ ర్యాంక్ తెచ్చుకుంటుంది. సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ అవుతుంది. అమెరికాలో సెటిల్ అవుతుంది. నీలాంటివాళ్ళు పలకరించడానికే భయపడేంత ఎత్తుకు ఎదుగుతుంది" అన్నది.

మాటా మాటా పెరిగింది.

మా తాతయ్య కూడా కల్పించుకుని "ఆడదానికి అంత టెక్కు పనికిరాదు. అన్ని సవాళ్ళు విసురుతున్నావ్... కూతురిమీద చాలా ఆశలే పెట్టుకున్నావ్. అమెరికా... ఆస్ట్రేలియా పక్కన పెట్టు. రేపది ర్యాంక్ కూడా తెచ్చుకోలేకపోతే తలెక్కడ పెట్టుకుంటావ్? " అన్నారు.

మమ్మీ తీవ్రంగా హర్ట్ అయింది.

"నిత్య స్టేట్ ఫస్ట్ ర్యాంక్ తెచ్చుకోలేకపోతే నేను ఆత్మహత్య చేసుకుంటాను. ఇది నేను ఆవేశంలో అనే మాటకాదు. దాని తెలివితేటల మీద వున్న కాన్ఫిడెన్స్‌తో చెబుతున్నాను. నిత్య మీద ఒట్టేసి మరీ చెబుతున్నా... అన్నమాట నిలబెట్టుకుంటాను"

డాడీ వారిస్తున్నా వినకుండా నా తల పైన చెయ్యిపెట్టి ఒట్టేసింది మమ్మీ. అందరూ అవాక్కయ్యారు. మమ్మీ ఇంత పని చేస్తుందని వాళ్ళు కూడా వూహించి వుండరు.

ఆరోజు చెప్పింది మమ్మీ నాతో "ఈ మమ్మీ కావాలనుకుంటే కష్టపడి చదువు. స్టేట్ ఫస్ట్‌ర్యాంక్ తెచ్చుకో. షార్ట్ టెర్మ్ ట్రై చెయ్యి. ర్యాంక్ రాకపోతే లాంగ్‌టెర్మ్‌లో చేరు. ఏమైనా చెయ్యి. ఎంత ఖరీదైన కాలేజ్ అయినా ఫర్లేదు. నువ్వు నన్ను గెలిపించాలి. లేదో... మమ్మీని మర్చిపోవాల్సి వుంటుంది"

> **"నా కూతురు మీరనుకుంటున్నట్టూ సామాన్యురాలు కాదు. అది ఎమ్‌సెట్‌లో స్టేట్ ర్యాంక్ తెచ్చుకుంటుంది. అమెరికాలో సెటిల్ అవుతుంది.**

"మమ్మీ మాట నిలబెట్టాలి నిత్యా. మమ్మీ మహా సున్నితం. అన్నంతపనీ చేస్తుంది" అన్నాడు డాడీ.

అదుగో... ఆరోజు మొదలైంది నాలో ఘర్షణ. పుస్తకం ఓపెన్ చేసి చదువుతుంటే చాలు... ఒక వేళ... ర్యాంక్ రాకపోతే.. మమ్మీ చనిపోతుందా? అన్న ప్రశ్న నన్ను వెంటాడి వేధించేది.

దానికితోడు మేనేజ్‌మెంట్ ఒత్తిడి.

ర్యాంక్ నా చేతుల్లో వుందా?

ర్యాంక్ విలువ ఒక నిండు ప్రాణమా!

ఈ ఒత్తిడి లేకముందు చక్కగా చదవగలిగే నేను... క్రమంగా రోజు రోజుకీ డిప్రెస్ అయిపోసాగాను.

అనుక్షణం మమ్మీ కట్టిన బెట్... నన్ను వెంటాడుతుండేది.

నా కెపాసిటీ మీద నేను పందెం కాయా

లిగానీ... ఇంకొకరు కాయడమేంటి? చది వేది నేను కానీ... మమ్మీ కాదే.

క్రమంగా నాలో అసహనం పెరిగిపో యింది. కేవలం చదువుకి అంకితమై జీవి తంలో అన్నీ కోల్పోతున్నాననే భావన నన్ను కుంగదీసింది. నేను చదువుకో వాలి... ఎట్ ద సేమ్ టైమ్ చిన్న చిన్న సంతోషాల్ని అనుభవించాలి. కానీ అవ కాశం లేదు.

చిన్నప్పుడు అమ్మమ్మ నాకో కథ చెప్పింది. అనగనగా ఓ రాజట. ఆయన వృద్ధాప్యంలో పడ్డంతో యువరాజుకి పట్టం కట్టాడంట. తరువాత అరణ్యవాసానికి వెళ్ల బోతూ యువరాజుతో... కోటలో... ఏ గది తలుపులైనా తెరువు గానీ... పడమటి గది తలుపులు తెరవకు అని చెప్పాడట. ఇక ఆనాటి నుంచీ... యువరాజుకి పరి పాలన మీద ధ్యాస లేకుండా పోయిందట. రాత్రింబవళ్లూ... ఆ పడమటి గది గురించే ఆలోచించేవాడట.

అట్లా అయింది నా పరిస్థితి.

చదువుకోవాలని పుస్తకం తెరిస్తే చాలు, మమ్మీ చేసిన ఛాలెంజే గుర్తుకొచ్చేది.

ఆందోళనతో మనసు వికలమయ్యేది. ఆ హేంగోవర్ నుంచి తప్పించుకుంటా నికి... ఊహల లోకాల్లో విహరించేదాన్ని. కొత్తగా డైరీ రాయటం అలవాటు చేసుకు న్నాను.

ఓ రోజూ ఓ పేజీలో... "చీకటి వస్తేనే కదా పగటిని మింగేస్తుంది" అన్న వాక్యం రాస్తున్నప్పుడు చప్పున స్ఫురించింది ఓ ఆలోచన.

నాకు స్టేట్ ర్యాంక్ రాకుంటే... మమ్మీ చనిపోతుంది. నేనసలు పరీక్షలకే అటెండ్ కాకపోతే! అయితే నేను చదవనని మొండి కేస్తే మమ్మీ ప్రాణాలతో ఉండదు.

అందుకే తీవ్రంగా... చాలా తీవ్రంగా ఆలోచించా... అట్లా ఆలోచిస్తున్నప్పుడు

## అయోమయం



**ఓ**సారి జెమ్‌షెడ్పూర్‌లోని టాటా స్టీల్ ఫ్యాక్టరీ చూడడానికి వెళ్లారు కొండలరావు. అక్కడ అధికారులు ఆయనకు ఫ్యాక్టరీ అంతా తిప్పి చూపారు. ఇనుము కరగడం - దాన్ని ముక్కలు కొట్టడం - వాటి చుట్టూ ఎర్రటి మంటలు .. వేడి ! వాటన్నింటినీ వారు వివరిస్తుంటే - 'ఏమిటో అంతా అయోమయం' అన్నారు కొండలరావు.

వెంటనే అధికారులు 'అబ్బే... అయోమయం ఏమీ లేదన్సార్ అంతా ఖచ్చితమే' అన్నారు.

'అయ్యా.. అయః అంటే ఇనుము.. అయోమయం అంటే అంతా ఇను పమయం అని నా ఉద్దేశం' అంటూ ఆయన తెలుగు మాస్టారి అవతారం ఎత్తేసరికి నవ్వులే నవ్వులు..

నాకు విపరీతమైన తలనొప్పి వచ్చేది. అట్లా రెండు మూడు రోజులు గడిచాక... న్యూస్ పేపర్‌లో ఓ న్యూస్ చూశా. ఏదో గ్రామంలో ఇళ్లు వాటంతటవే తగలబడి పోతున్నాయనీ... ఒంటిమీద బట్టలు వాటంతటవే చిరిగి పోతున్నాయనీ... ఆ గ్రామస్థుల్ని ఏదో దెయ్యం పట్టి పీడిస్తోం దనీ... ఏమిటేమిటో రాశారు.

ఆ గ్రామస్థులు ఇల్లు వాకిలీ వదిలేసి పారిపోతున్నారని కూడా రాశారు.

"ఇదేదో హైటెక్ కుట్ర... దెయ్యాలా... గాడిద గుడ్డా..." అన్నాడు మా సైన్స్ లెక్చ రర్.

అప్పుడు వచ్చింది నాకీ దెయ్యం ఐడియా.







"నీ స్వార్థం కోసం... మిగతా స్టూడెంట్స్‌ని బలిచేస్తున్నట్టుగా అన్పించలేదా నీకు? "

"బలి చెయ్యడమా! ఒక వారం రోజుల పాటు వాళ్లని స్ట్రెస్ నుండి తప్పించాననుకుంటున్నా. ఆ మాత్రం విశ్రాంతి వాళ్లకూ కావాలి. దె డిజర్విట్... విశ్రాంతి మా మెదళ్లని వైటలైజ్ చేస్తుంది. అందుకేగా ఏ ఫీల్డ్‌లోనూ లేని సెలవులు... ఎడ్యుకేషన్ ఫీల్డ్‌లో ఇస్తారు. స్టూడెంట్స్‌కి ఆ విశ్రాంతి అవసరమనేగా! మరి ఇప్పుడెందుకు వాటిని కేన్సిల్ చెయ్యాలి? "

"ఇక నువ్వు ఎమ్‌సెట్ ప్రిపేర్ కావా? "

"నాకు ర్యాంక్ రాకపోతే జరిగేదేమిటో నాకు తెలుసు. చెప్పాగా మమ్మీ ప్రాణం ముఖ్యం నాకు"

"బ్లడ్ వెజల్స్ కోసుకుని బీభత్సం చేశావెందుకు? "

"నన్ను మళ్లీ హాస్టల్‌కి పంపిస్తున్నారు వాళ్లు. ఒన్స్ ఎగైన్ గేమ్ మొదలెట్టలేను. అలిసిపోయాను. అందుకే ప్రాణం తీసుకుంటే సమస్య తీరుతుందనుకున్నా. నేను పోయినా మమ్మీ ప్రాణాలతో ఉంటుంది. అందుకే తెగించా"

డాక్టర్ అలోక్... ఇక ప్రశ్నలాపి సెమీ హిప్నాటిక్ స్టేజ్ నుండి నిత్యను బయటకు తీసుకువచ్చే సజెషన్స్ ఇవ్వటం మొదలెట్టాడు.

★ ★ ★

"కాలేజ్ మేనేజ్‌మెంట్ ఆమె మీద పెట్టుకున్న నమ్మకంతోనే... ఒత్తిడికి లోనైన ఆమె బ్రెయిన్ని మీరు చేసిన ఛాలెంజ్... పూర్తిగా భయపెట్టింది. ఆమె కాన్ఫిడెన్స్‌ని దెబ్బతీసింది. మీరామె భుజాలమీద వేసిన బాధ్యత మోయలేని బరువుగా మారింది. అది లోలోపల డిప్రెషన్‌కి దారితీసింది. ఆందోళన ఆమె శరీరంలోని హార్మోన్లు... విటమిన్లు... ఎంజైములపై ప్రభావాన్ని చూపింది. దాంతో బ్రెయిన్లో కెమికల్ ఇంబేలన్స్ జరిగి... నిత్య మానసిక దౌర్బల్యానికి గురైంది."

వసంత అపరాధిలా తలవంచుకు కూర్చుంది.

"కెమికల్ ఇంబేలన్స్ సెట్‌రైట్ చెయ్యడానికి అవసరమైన ట్రీట్‌మెంట్ మేమిస్తాం. నెలకోసారి కౌన్సిలింగ్ ఇస్తుంటాం. బట్ ఎట్ ద సేమ్ టైం... మీ సహకారం కావాలి. మా చికిత్స ఫిఫ్టీ పర్సెంటేనన్న విషయం గుర్తుంచుకోండి"

**"బలి చెయ్యడమా! వారం రోజుల పాటు వాళ్లని స్ట్రెస్ నుండి తప్పించాననుకుంటున్నా. ఆ మాత్రం విశ్రాంతి వాళ్లకూ కావాలి.**

"ఏం చెయ్యమన్నా చేస్తాం సార్" దివాకర్ ఉద్వేగంగా అన్నాడు.

"ఇప్పుడు మీ అమ్మాయి ఆరోగ్య పరిస్థితి మెరుగుపడ్డం అనేది మీ చేతుల్లోనే ఉంది. ముఖ్యంగా మీ చేతుల్లో" వసంతకేసి పర్టిక్యులర్‌గా చూస్తూ అన్నాడు.

"చెప్పండి డాక్టర్" వసంత కళ్లు తుడుచుకుంది. "ముఖ్యంగా ఇప్పుడు మీరు చెయ్యాల్సిన పనులు రెండున్నాయి. ఫస్ట్‌థింగ్... మీ అత్తమామలకి పరిస్థితి వివరించి పిలిపించడం, సెకెండ్ థింగ్... వాళ్లతో మీరు చేసిన ఛాలెంజ్‌ని విత్‌డ్రా చేసుకున్నారన్న విషయాన్ని నిత్య నమ్మేలా చేయడం"

మౌనంగా తల వూపింది వసంత.

"డూయిట్ ఇమ్మీడియెట్లీ" చెప్పాడు అలోక్.

"ఒకే డాక్టర్" చెప్పాడు దివాకర్.

"పోతే... నిద్రలో నిత్య చెప్పిన విషయాలేవీ ఆమెకు పొరపాటున కూడా లీక్ చెయ్యకండి. ఆమెను ఎప్పట్లా మామూ

లుగా ట్రీట్ చెయ్యండి. ఫిజికల్‌గా వీక్ అయ్యావు కాబట్టి ఈ సంవత్సరం ఎమ్‌సెట్‌కి ప్రిపేర్ అవ్వాల్సిన అవసరంలేదని చెప్పండి.

ఎమ్‌సెట్ కోర్స్ ఒక్కటే చదువు కాదనీ... ర్యాంకులు మాత్రమే... తెలివితేటలకు కొలబద్దలు కావనీ మీరు గుర్తించినట్టూ ఆమెకు నమ్మకం కలిగించండి. ఆమె కిష్టమైన కోర్స్ చేసుకునే స్వేచ్ఛను ఆమె కివ్వండి. పుస్తకాల పురుగులా బతకాల్సిన అవసరాన్ని క్రియేట్ చెయ్యకండి. ఆమెకు నచ్చిన టీవీ ప్రోగ్రామ్స్ చూడనివ్వండి. సినిమాల కెళ్ళనివ్వండి. ఒక్క మాటలో చెప్పాలంటే... ఆమెకిష్టమైన రీతిలో ఆమెను జీవించనివ్వండి. కోర్కెల చట్రంలో ఆమెను బంధించకుండా డెసిషన్ మేకింగ్ స్కిల్‌ని పెంచుకోనివ్వండి.

"ష్యూర్ డాక్టర్" చెప్పాడు దివాకర్.

"ఒక ముఖ్యమైన విషయం" అంటూ టేబుల్ డ్రాయర్ లాగి ఒక డైరీని బయటికి తీశాడు.

ఆమెకు సంబంధించిన డైరీలు, ఫ్రెండ్స్ రాసిన వుత్తరాలు లాంటి పర్సనల్ థింగ్స్ ఏమైనా వుంటే తీసుకురమ్మని దివాకర్ ఫోన్‌లో అప్పాయింట్‌మెంట్ తీసుకున్నప్పుడే చెప్పాడాయన.

"టేకిట్" డైరీని దివాకర్‌కి ఇస్తూ చెప్పాడు అలోక్.

"వాటీజ్ నిత్యా అనేది మీకు తెలియాలంటే... దీన్ని మీరు చదవాలి. ముఖ్యంగా నేను టిక్ చేసిన పేజీల్ని చదవండి. అప్పుడే... మీరు ఆమెను కరెక్ట్‌గా ట్రీట్ చెయ్యగలుగుతారు".

మీరా... నిత్య భుజం చుట్టూ చేతిని చుట్టి నడిపించుకువచ్చింది. అలోక్ నిత్యతో కాసేపు మాట్లాడాడు.

కేవలం నిత్యకిష్టమైన రంగులూ... సినిమా హీరోలూ... హీరోయిన్లూ... ఆమె హాబీలు... ఆమె లైక్‌చేసే డ్రెస్‌కోడ్ ఇలాంటి విషయాల మీదే దొర్లాయి కబుర్లు. డాక్టర్ అలోక్ ప్రిస్క్రిప్షన్ రాసి దివాకర్‌కి ఇచ్చాడు.

నిత్యను ఓ పువ్వులా నడిపించుకుంటూ క్లినిక్ బయటకొచ్చారు దివాకర్ దంపతులు.

★ ★ ★

కొడుకు కోడలు పరిస్థితి వివరించాల్సిన అవసరం లేకుండానే వూడిపడ్డారు నిత్య నాన్నమ్మ లలితమ్మా, తాత రంగారావులు ఆ మరుసటి రోజే.

వచ్చీరాగానే "ఇంత జరుగుతున్నా మాకొక్క ముక్క చెప్పార్రా" అంటూ ఘొల్లుమనబోయిన లలితమ్మనూ, "వాళ్ళెందుకు చెబుతారే... వాళ్ళకి మనమేమవుతాం" అంటూ నిష్ఠూరమాడుతున్న రంగారావునీ.. చప్పున అలర్టయిపోయి బెడ్‌రూమ్‌లోకి లాక్కెళ్ళి కూర్చోబెట్టాడు దివాకర్.

ఆ టైంలో... నిత్య గాఢంగా నిద్రపోతుండటంతో వసంత తేలిగ్గా వూపిరి పీల్చుకుంది. దివాకర్ జరిగిన విషయమంతా అరగంటసేపు వివరించాడు. లలితమ్మ కళ్ళు నీటి తటాకాలే అయ్యాయి. రంగారావు అపరాధిలా తలదించుకున్నాడు.

"పెద్దవాళ్ళ మీద ఛాలెంజ్ చేసినందుకు దేవుడు బాగానే బుద్ధిచెప్పాడు మామయ్యా నాకు" అన్నది వసంత సిగ్గుపడుతూ.

రంగారావు వెంటనే వారించాడు "ఇందులో నీ తప్పేం లేదు వసంతమ్మా. పెద్దరికం మర్చిపోయి నిన్ను తూలనాడి మాట మిగిలింది మేమే"

లలితమ్మ హఠాత్తుగా లేచి వసంతని వాటేసుకుని బావురుమంది. వసంత కళ్ళూ చెమర్చాయి. "వూరుకోండత్తయ్యా" అంది.

"జరిగింది జరిగిపోయింది. ఇక కావాల్సింది చూడండి" అంది అక్కడే వుండి అన్నం తింటున్న సౌభాగ్యమ్మ.







డాక్టర్ అలోక్ చెప్పిన జాగ్రత్తలన్నీ వాళ్ళకు వివరించాడు దివాకర్.

ఆరోజు నిద్ర లేవగానే... ఒక వింత దృశ్యాన్ని చూస్తున్నట్టుగా కళ్లప్పగించి చూస్తూ నిలబడిపోయింది నిత్య.

లలితమ్మకూ... రంగారావుకూ నవ్వుతూ కాఫీ అందిస్తోంది... వసంత.

లలితమ్మ నిత్యను గమనించి దగ్గరకు పిలిచింది. పక్కన కూర్చోబెట్టుకుని ఆప్యాయంగా తల నిమిరింది. రంగారావు చాలా సేపు మనమరాలితో కబుర్లు చెప్పాడు. నిత్యకేదో అర్థమవుతోంది. వాతావరణం ఆహ్లాదంగా అన్పిస్తోంది.

ఆ సాయంత్రం... సౌభాగ్యమ్మా... నాగభూషణం ఊరికి ప్రయాణమయ్యారు. నందూని మాత్రం రెండు రోజులాగి రమ్మన్నారు.

"మేమట్లా రాగానే మీరిట్లా ప్రయాణమవడం ఏం బాలేదు" అంటూ గునిసింది లలితమ్మ.

పొలంపనుల గురించి ఏకరువు పెట్టి ఆమెను సమాధానపరిచారు.

"దివాకర్... నాకో సందేహం" అన్నాడు నాగభూషణం బయల్దేరుతూ...

"ఏంటి మామయ్యా" అన్నాడు దివాకర్.

నాగభూషణం నిత్య కోసం చూశాడు. అక్కడెక్కడా కనబడలేదు. "నిత్య సంగతి అర్థమైంది నరే... మీ అత్తయ్యకూ పూనకం వచ్చింది కదా! ఆ కథా కమామీషూ ఏంటి? " అన్నాడు.

"ఇక్కడ అత్తయ్యగానీ... అక్కడ హాస్టల్ కుక్ రాజమ్మకానీ హిస్టీరికల్‌గా పూనకం వచ్చినట్టుగా ప్రవర్తించడానికి దెయ్యంపట్ల వాళ్ళకు గల విపరీతమైన విశ్వాసంలోంచి పుట్టిన మతిభ్రమణమే కారణమట. మంత్రగాళ్ళు అసలు లేని దెయ్యాన్ని వున్నట్టు నమ్మిస్తారు. దాంతో బలహీన మనస్కులు ఊహద్వారా పూనకం తెచ్చుకుంటారట. ఆ రాజమ్మ... రాధిక అనే స్టూడెంట్ హాస్టల్లో ఉరి వేసుకోవడం గురించే ఆల్రెడీ ఎక్కడో వినే వుంటుంది. మేనేజ్‌మెంట్‌కి భయపడి నోరు నొక్కేసుకుంటుంది. పూనకం పుణ్యమా అని అది కక్కేసుంటుంది"

"హమ్మయ్య మీ అత్తయ్య పూనకం వచ్చి ఒంటరిగా వున్నప్పుడు నా పీక ఎక్కడ పట్టుకుంటుందోనని హడలి చచ్చాను"

"మరి బావా! హాస్టల్లో నిత్యచేసిన ట్రిక్స్ సరే... వాచ్‌మెన్ గొంతుని ఏదో దెయ్యి పట్టుకోవడం...కొంతమంది స్టూడెంట్సూ లెక్చరర్సూ వింత వింత విషయాల్ని ఎక్స్‌పీరియన్స్ చెయ్యటం.. గురించి డాక్టరేమైనా ఎక్స్‌ప్లనేషన్ ఇచ్చారా? "

"సేమ్ కేస్ విత్ దెమ్ ఆల్సో. 'దెయ్యం' అన్న నమ్మకంలోంచి పుట్టిన వూహాజనిత దృశ్యాలవి. వాళ్లంతా మాస్ హిస్టీరియా బారిన పడ్డ వ్యక్తులట. పైగా రాజమ్మ... రాధిక ఆత్మ గురించి వాగడంతో అందరిలో అంతర్లీనంగా భయం పురివిప్పి డెల్యూషన్స్‌కి లోనైవుంటారని ఆయన అంటారు"

ఇంతలో నిత్య రావడంతో సంభాషణ కట్టయింది. "అమ్మమ్మా! నేను వూరికొస్తున్నప్పుడు శీనూకి కాలు విరిగిందన్నారు. ఎట్లాగుందో కనుక్కొని ఫోన్ చెయ్యి" అంది నిత్య.

"నిత్యమ్మా... సన్నజాజి పందిరికింద కూర్చుని మళ్ళీ మనిద్దరం.. రేడియోలో ఘంటసాల పాటలు వినేదెప్పుడే" మనవరాలి బుగ్గలు సాగదీస్తూ అన్నాడు నాగభూషణం.

నిత్య నవ్వింది. నందూ వాళ్ళను బస్సెక్కించి రావడానికి వెళ్ళాడు.

ఆ రాత్రి... దివాకర్... వసంతలు నిత్య డైరీ తెరిచారు. ముందుగా డాక్టర్ అలోక్ టిక్ చేసిన పేజీ తిప్పారు.

'నాకు మరణించి మళ్ళీ పుట్టాలని వుంది. బాల్యాన్ని తనివితీరా అనుభవించాలని వుంది. 'అమ్మ' 'నాన్న' అన్న పదాల్ని నా పెదాలు వుచ్చరించకముందే.... 'మమ్మీ' 'డేడీ' అని నేర్పిన నర్సరీ గదుల గోడలు ఇప్పటికీ నన్ను చుట్టేసి నాకు ఊపిరి సలపనివ్వటంలేదు. ఆ గోడల్ని బద్దలు కొట్టుకుని... విశాల విశ్వంలోకి అడుగుపెట్టాలని వుంది. సముద్రపు ఒడ్డున పిచ్చిక గూళ్ళు కట్టిన జ్ఞాపకాలూ... వాన నీటిలో కాగితప్పడవలు వదలిన అనుభూతులూ నాక్కావాలి. వెన్నెల్లో ఆటలాడిన అనుభవాలూ...

అమ్మమ్మ ఒళ్ళో పడుకుని... చందమామ కథలు చదివిన అనుభూతులూ...

నేను పొంది తీరాలి.

అందుకే నేను మరణించి మళ్ళీ పుట్టాలి. ఈసారి నా బాల్యాన్ని ఎవరికీ తాకట్టు పెట్టను. దాన్ని నేనే తనివితీరా అనుభవిస్తాను. చిన్నతనపు ఆట పాటల చిరుదీపాల్ని... నా బతుకు బాటంతా వెలిగించుకుంటాను.

దివాకర్ మరో పేజీ తిప్పాడు.

నేను ఇండియా వదిలి వెళ్ళలేను. వేకువలో... విచ్చుకునే మందారాల్నీ... సంధ్యలలో విరబూసే సన్నజాజుల్నీ... పెరట్లో దానిమ్మపూల ఎర్రదనాన్నీ... జామకొమ్మల మీదే వాలే... ఆకుపచ్చ శారికల్నీ...

ఎలా మరచిపోగల్ను?

రోడ్డుపక్క దాబాలో తిన్న పరోటా రుచినీ...

చినుకుల్లో తడవకుండా... నేను ఒరిగి నిలబడ్డ పూరింటి చూరునీ... విండో షాపింగ్‌లో నా మనసును హత్తుకున్న అద్దాల చోళీనీ... మొబైల్ షోకేస్‌లో అమ్మ కానికి వచ్చే.. మట్టిగాజుల సవ్వడినీ...

నేనెప్పటికీ మిస్ కాను.

అమ్మ ఆవపెట్టి చేసే ఆనపకాయ కూరనీ...

నాన్న... కొనిపెట్టే పీచుమిఠాయి రుచినీ...

జాజి పందిరి కింద తాతయ్యతో కలిసి రేడియోలో విన్న ఘంటసాల పాటనీ... శీను నా కోసం కోసుకొచ్చే... దోరమగ్గిన జామకాయల్లోని తీపినీ...

జస్ట్... ఐ కాన్ట్... ఫర్‌గెట్

అందుకే... నేను అమెరికా వెళ్ళను.

దివాకర్ డైరీ మూసి... తలగడ కింద పెట్టాడు. అతనితో పాటూ డైరీ పేజీల్లో పరిగెత్తిన... వసంత కళ్ళలోకి చూస్తూ దివాకర్ అన్నాడు. "నిత్యని వదిలి మనం మాత్రం వుండగలమా వసూ? "

తల అడ్డంగా వూపింది వసంత.

★ ★ ★

నిత్య ప్రతి సాయం సంధ్యలో... జాజి పందిరి కింద కూర్చుని తాతయ్యతో కబుర్లు చెబుతూ... ఓల్డ్ మెలొడీస్ వింటూనే వుంది.

హైమావతితో కలిసి తోటలూ, దొడ్లూ తిరుగుతూ... అరిచేతుల్లో మెహిందీ ముగ్గులు వేసుకుంటూనే వుంది.

చూస్తుండగానే నందూ పెళ్ళయిపోయి 'మేఘమాల' కాపురానికొచ్చేసింది. నిత్య అడిగి అడిగి ఆమెచేత 'కోయిల పాట బాగుందా...' అని పాడించుకుంటూనే వుంది. శీనూకి తనే స్వయంగా కోచింగ్ ఇచ్చి టెన్త్‌క్లాస్ పాసయ్యేలా చేసింది.

అమ్మమ్మ చేసే జిలేబీలో... సున్నుండలో చింతాతకు పొట్లం కట్టి ఇస్తూనే వుంది.

మునిమాపులూ... ముళ్ళగోరింటలూ... నేలతంగేళ్ళూ... దిరిసెనమాన్లూ... ఒరల బావులూ... మావిచిగుళ్ళూ... నిత్యకిప్పుడు చిరపరిచితాలు...క్రిష్టాలయం ధ్వజ స్తంభం మీది చిరుగంటల సవ్వళ్ళు...

గుడిగోపురం మీది పావురాళ్ళ కువకు



# పిడికెడు విత్తనాల్తో...



విటమిన్-ఇ ఎక్కువగా వృక్షాల విత్తనాల్లో లభిస్తుంది. గామెటో ఫెరాల్ అనే ఎంజైము క్యాన్సర్ కణాల వృద్ధిని నియంత్రించడంలో ప్రముఖపాత్ర పోషిస్తుందని పుర్డ్యూ యూనివర్సిటీ పరిశోధకులు కనుగొన్నారు. ఈ ఎంజైము చర్యవలన మానవ ప్రోస్ట్రేట్ గ్రంథి, కాలేయ క్యాన్సర్ కణ విభజనలు పెరగకుండా నియంత్రించవచ్చని ప్రయోగాల ద్వారా తెలిసింది. ఆసక్తికరమైన విషయమేమంటే ఆరోగ్యవంతమైన కణాల విభజనకు అడ్డురాకుండా, కేవలం క్యాన్సర్ సోకిన కణాల విభజనపై దీనిప్రభావం చూపి, నియంత్రిస్తుంది. ఈ గామెటో ఫెరాల్ ఎక్కువగా వాల్‌నట్స్, బాదం పప్పుల్లో లభ్యమవుతుంది. స్పానిష్ శాస్త్రవేత్తలు ఇటీవల జరిపిన పరిశోధనల్లో రక్తనాళాల గోడల్లో పేరుకుపోయే అధిక కొవ్వుని తొలగించి, శుభ్రపరచడంలో గామెటో ఫెరాల్ ప్రముఖపాత్ర పోషిస్తుందని, దీనివలన 11% శాతం వరకు మనం గుండెజబ్బుల నుండి రక్షణ పొందగల్గుతున్నామని కనుగొన్నారు. ఆరోగ్యాన్నందించే, పోషక విలువలున్న వాల్‌నట్స్, బాదం గింజల్ని రోజూ పిడికెడు తినటం శ్రేష్ఠమంటున్నారు శాస్త్రజ్ఞులు. సో.. "విష్‌యూ ఎ హ్యాండ్ ఫుల్ డే" అందామా!

వలూ...

పాలపిట్టలూ... వరికంకులూ... ఒకటేమిటి...

అన్నీ నిత్యకు నేస్తాలే...

కాలం.. చిరుగాలులు వీస్తూ... జాజి పరిమళాలు మోస్తూ సాగిపోతూనే వుంది.

ఓరోజు హఠాత్తుగా అడిగింది నిత్య... తనని చూడ్డానికి వచ్చిన వసంతని.

"బోర్ కొడుతోంది మమ్మీ... కాలేజ్ లో చేరతా"

వసంత... సంతోషంగా దివాకర్‌కేసి చూసింది.

"ఏ కోర్స్ చేస్తావురా? " అడిగాడు దివాకర్. "మీ ఇష్టం డాడీ" అంది నిత్య.

"పూర్తి ఛాయిస్ నీదే" అంది వసంత.

"దెన్..." ఒక్క క్షణం ఆలోచనలో పడిపోయి "బయోకెమిస్ట్రీ చెయ్యాలనుంది నాకు" అంది.

"ఫెంటాస్టిక్! అదే చెయ్యి" చెప్పింది వసంత. ఆ రాత్రి ఆరుబయట వెన్నెల్లో... వసంత పక్కనే పడుకుని చెప్పింది నిత్య.

"నా మనసులోని పదమటిగది తలుపులు తెరుచుకున్నాయి మమ్మీ. ఆ గదిలోని సంతోషం పొంగిపొరలి... నా మనసంతా నిండిపోయింది. ఆ స్ఫూర్తితో ఆడుతూ... పాడుతూనే నేనిప్పుడు దేన్నయినా సాధించగలను" నిత్య కళ్ళలోని కాంతులు... ఆకాశంలోని నక్షత్రాలు.. ఒక్కలాగే అనిపించాయి వసంతకు. ★

# కష్టాల్ని వడపోసిన కథకుడు

## జాక్ లండన్

వైరుధ్యాల మధ్య సాగింది జాక్ లండన్ (1876-1916) జీవితం. మార్క్స్, నీషే ఆయన్ను ప్రభావితం చేశారు. గత శతాబ్దపు తొలి దశకంలో అమెరికాలో సోషలిస్టు భావాలను ప్రచారం చేసిన ప్రముఖ వక్త, కేవలం రచనల ద్వారానే మిలియన్లు సంపాదించిన రచయిత జాక్ లండన్. అతడి రచనలన్నీ స్వానుభవంలోంచే వచ్చాయి. తన పూర్వులు హెర్మన్ మెల్విల్, మార్క్ ట్వేన్‌లలాగ జాక్ లండన్‌కు కూడా ప్రమాదాల అంచున బతకటమంటే ఇష్టం.

బాల్యమంతా పేదరికంలో గడిచింది. పదేళ్లప్పుడే ఫ్యాక్టరీలో పనికి కుదిరాడు. ఇల్లు గడవడానికి డబ్బు కావాలి. సంపాదించిన ప్రతి సెంటూ తెచ్చి తల్లికిచ్చాడు.

### తెర తీయగ రాదా!

"ఒకసారి మెషీన్ దగ్గర ముప్పై ఆరు గంటలు వరుసగా పనిచేశాను" అని రాసుకున్నాడు.

జాక్ లండన్‌కు జీవితం చెరసాలగానే కాదు, కసాయిశాలగా కూడా కనిపించింది. పడవల్లో కళాసిగా పనిచేసినప్పుడు జీవిత క్రౌర్యపు ఎర్రటి కోరల్నీ, రక్తసిక్తమైన పంజాల్నీ చూశాడు. క్రూర జంతువులకన్నా క్రూరమైన మనుషుల మధ్య బతికాడు. పొట్టకూటికోసం చావో బతుకో తేల్చుకునే కొట్లాటలు నిత్యకృత్యాలు.

జీవితం దుర్భరమనుకుంటున్న ఆ దశలో ఒక సువర్ణావకాశం అతణ్ణి రారమ్మని ఆహ్వానించింది.

19వ శతాబ్ది చివరి దశాబ్దంలో అలాస్కాలోని క్లాండైక్‌లో బంగారు నిల్వలను కనుగొన్నారు. ఇంకేముంది? తమ వంతు బంగారంకోసం అందరూ యాత్రలు ప్రారంభించారు. జాక్ లండన్ 'గోల్డ్ ప్రాస్పెక్టర్'గా అవతారమెత్తాడు.

కాని, అలాస్కా వాతావరణం ప్రాణాంతకం. అక్కడికి వెళ్లి తిరిగి రావటం దుస్సాధ్యం. చలిని, ఆకలిని భరించలేక వందలాది ప్రాస్పెక్టర్లు ఆ హిమనదాల్లో కూరుకుపోయారు. మొత్తంమీద తిరిగి వచ్చేనాటికి జాక్ లండన్ తన వెంట నాలుగున్నర డాలర్ల బంగారు రజను తెచ్చుకున్నాడు.

అయితే ఈ అనుభవమే, తరువాత అతడు ప్రపంచ ప్రఖ్యాత రచయిత కావటానికి పునాదులు వేసింది.

"శారీరక శ్రమకు బదులు బుద్ధితో సంపాదించాలని" నిశ్చయించుకుని, పబ్లిక్ లైబ్రరీల సాయంతో పుస్తకాల



లోకంలో ప్రవేశించాడు. అదో డిస్కవరీ. మరో పనిలేదు. నిద్రాహారాలు మాని చదివాడు. రాశాడు- రోజుకు పదిహేను గంటలు. వేళ్లు నొప్పి పుట్టిందాకా, నొప్పితో చేతులు వాచిపోయిందాకా రాశాడు.

చాలామంది ఒక జీవిత కాలంలో చూడలేని జీవితాన్ని తన బాల్యంలోనే అనుభవించిన జాక్ లండన్, కిప్లింగ్‌నూ, ఆరెల్ స్టీవెన్‌సన్‌నూ ప్రేరణగా తీసుకుని వందలాది రచనలు చేశాడు. మరో ఏడాది తర్వాత 1900లో పుస్తకాల పరంపర ప్రారంభమైంది.

**జాక్ లండన్ ప్రతిభాశాలి. సామాన్యులకు దృగ్గోచరం కాని విషయాలను చూడగలిగే ప్రజ్ఞ, దార్శనికత అతని సొత్తు**

**- ఆనతోల్ ఫ్రాంస్**

ఆ సంవత్సరం 'బిఫోర్స్ ది ఆడం', 1902లో లండన్ ఘెట్టోల భయానక చిత్రం 'పీపుల్ ఆఫ్ ది ఆబిస్' (నరకంలో నరులు), 'ఎడాటర్ ఆఫ్ ది స్నో' వెలువడ్డాయి.

1904లో జీవితాన్ని యుద్ధరంగంగా చిత్రించిన 'సీ వూల్ఫ్' అమెరికన్ సముద్రయాన సాహిత్యంలో ఒక సంచలనం.

1908లో వర్గవైషమ్యాలనూ, రాబోయే విప్లవాల అనూహ్య పరిణామాల్నీ చిత్రించిన "ఐరన్ హీల్"తో సోషలిస్టు రచయితగా మారాడు.

1909లో ఆత్మకథాత్మకమైన 'మార్టిన్ ఎడెన్' వెలువడింది.

పరిమితుల్లో బతకటం జాక్ లండన్ లాంటి జీనియస్‌లకు సాధ్యం కాదు. తాగుడు వ్యసనం అతణ్ణి మృత్యువుకు చేరువగా తీసికెళ్లింది. ఈ దశలో చేసిన మరో రచన 'జాన్ బార్లీకార్న్' (1913). అమెరికన్ వాడుక భాషలో దీనికి తాగుబోతు అని అర్థం. ఈ జాన్ బార్లీకార్న్ తన ఆప్తమిత్రుడని జాక్ లండన్ స్వయంగా చెప్పుకున్నాడు.

మరో మూడేళ్లకు ఈ ఆప్తమిత్రుడే అతడి ప్రాణాన్ని డిమాండ్ చేశాడు.

ఇరవై ఏళ్లదాకా సాహిత్య జ్ఞానం లేని వ్యక్తి, పదహారేళ్లలో జీవశక్తితో స్పందించే, అత్యంత ప్రజాదరణ పొందిన యాభైకి పైగా విలక్షణ గ్రంథాలను రాసి తన నలభైయ్యవ ఏట మరణించిన జాక్ లండన్ మానవమాత్రులు అనేక జీవితకాలాల్లో సాధించలేనిది తనకు సాధ్యమని నిరూపించాడు.

**- స్వప్న**

## చతుర సమీక్ష | జూన్ 'చతుర' నవల పడమటి గది

సమీక్షకుని/సమీక్షకురాలి పేరు:

___

చిరునామా:

___

___

___

# అతనికంటె ఘనుడు



**బులుసు-జీ-ప్రకాష్**

ఒక దగ్గర దోపిడీ!

ఇంకొక దగ్గర ఒక స్త్రీ మాన భంగం!

వేరొకచోట రైల్వే స్టేషన్లో బాంబు పేలుళ్ళు- కొంతమంది దుర్మరణం!

కొండొకచో హత్య!

ఇవన్నీ ఎవరు చేస్తున్నారో, ఎందుకు చేస్తున్నారో పోలీస్ అధికార్లకి అంతు చిక్కలేదు. ఆచూకీ కోసం పోలీస్ కుక్కల్ని నాలుగు పక్కలా పంపించారు. ప్రత్యక్ష సాక్షుల కథనం ప్రకారం ఆ నేరస్థుని క్యారికేచర్ కంప్యూటర్ మీద రూపొందించారు. పత్రికల్లోను, టీవీల్లోను ప్రచారం చేశారు.

ఇదంతా గమనించిన ఆగర్భ శ్రీమంతుడు ఆపద్బాంధవరావు తనే స్వయంగా ఎస్పీ బంగాళాకెళ్లి లొంగిపోయాడు.

ఎస్పీగారు, ఆయన సిబ్బందీ ఆశ్చరపోయారు!

# చతుర కత

ఆపద్బాంధవరావుని ప్రశ్నల పరంపరతో ఉక్కిరి బిక్కిరి చేశారు. మీడియాని ఆహ్వానించి వారి సమక్షంలోనే ప్రశ్నల్ని సంధించారు.

"మీరు కోటీశ్వరుడై ఉండి దోపిడీకి ఎందుకు పాల్పడ్డారు? " ఎస్పీ ప్రశ్న.

"ఇంట్లో అందమైన భార్య ఉంటుండగా ఒక స్త్రీని మానభంగం చేయవలసిన అగత్యం ఏమిటి? "

అదనపు ఎస్పీ ప్రశ్న.

"రైల్వే స్టేషన్‌లో బాంబులు పేల్చి అమాయకుల ప్రాణాలు బలిగొనడం వల్ల మీక్కలిగిన ప్రయోజనం? " డిఎస్పీ ప్రశ్న.

"మీరు అజాతశత్రువులని ప్రజలు నమ్ముతున్నారు. అటువంటిది మీరు హత్య చేయడంలో ఆంతర్యం ఏమిటి? " ఇన్‌స్పెక్టర్ ప్రశ్న.

విడివిడిగా సమాధానం చెప్పవలసిన అవసరం లేకుండా అన్నింటికీ టోకుగా సమాధానం చెప్పాడు ఆపద్బాంధవరావు.

"పోయినసారి ఎన్నికలలో పోటీ చేద్దామనుకుని టిక్కెట్ కోసం అన్ని పార్టీలను సంప్రదించాను. కానీ, ఆ పార్టీలవారు నువ్వు చేసిన మంచి పనులేమిటో చెప్పమన్నారు. నా నియోజకవర్గ పరిధిలో వంద రామ మందిరాలు కట్టించాను. వంద గ్రామాలకు వంద మంచి నీళ్ల బోర్లు వేయించానని చెప్పాను. సరే, ఏ విషయమూ ఆలోచించి చెప్తాం అన్నారు. కాని పార్టీ టిక్కెట్టు ఇంకొకరికిచ్చారు. అతడు గృహ దహనాలు, దోపిడీలు, మానభంగాలు, హత్యలూ, రైల్వే స్టేషన్లు పేల్చివేయడాలు చేసి, ఆ విధంగా జనాభా తగ్గించాడు. కనీసం వచ్చే ఎన్నికల్లోనైనా నాకు పార్టీ టిక్కెట్టు దక్కుతుందని నేను కూడా ఇప్పుడదే పని చేశాను" అన్నాడు ఆపద్బాంధవరావు తాపీగా.

"ఇప్పుడు మీరు జైల్ సెల్‌లో కూర్చోవలసొస్తుందే!" అన్నారు ఎస్పీ.

"జైల్ సెల్‌లో ఉంటూనే సెల్‌ఫోన్‌లో మాట్లాడి బెయిల్ తెప్పించుకుంటాను" ధీమాగా అన్నాడు ఆపద్బాంధవరావు.

"బాగుంది. మీరు చేసిన ఈ నేరాలు ఘోరాలు చూసిన సాక్షులు కోర్టులో సాక్ష్యం ఇస్తే, మీకు బెయిల్ నిరాకరిస్తారే కోర్టువారు? " అన్నాడు ఎస్పీ.

"నాకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పినవారు లారీల కింద పడి ప్రమాదవశాత్తూ ప్రాణాలు కోల్పోతారు. అందుకే నాకు వ్యతిరేకంగా సాక్ష్యం ఇవ్వడానికి ఎవ్వరూ సాహసించరు!" అన్నాడు ఆపద్బాంధవరావు.

తను అనుకున్నట్టుగానే జైల్‌సెల్‌లో కూర్చుని సెల్‌ఫోన్ ద్వారా వ్యవహారం నడిపి బెయిల్ మీద బయటికొచ్చేశాడు ఆపద్బాంధవరావు.

మరో కొద్ది నెలల్లో ఎన్నికల నోటిఫికేషన్ జారీ అయింది. మళ్లీ పార్టీ టిక్కెట్టుకై దరఖాస్తు చేసి తన నేరచరిత్రని విపులంగా తెలియజేశాడు ఆపద్బాంధవరావు. కానీ పార్టీ టిక్కెట్టు ఈసారి కూడా దక్కలేదతనికి!

మధ్యవర్తిని సంప్రదించాడు. అతడు సెల్‌లో చెప్పిన సమాధానం.

"మీకంటే పదిరెట్లు నేరాలు చేసినవాడు ఇంకోడు దొరికాడు. సారీ!" ★

'సర్కారు గడ్డి'పై పాఠకుల

# సమీక్షలు




## 'మైక్రోస్కోపిక్' నవల

### రూ. 100/- పొందిన సమీక్ష

ఆచార్య కొలకలూరి ఇనాక్ గారి 'సర్కారు గడ్డి' నవలిక- ఇటు వైవిధ్య కథనంతో, వాస్తవిక కథాంశంతో సాగింది. కరువు రక్కసి కోరల్లో చిక్కి, నాలుగేళ్ళుగా తిండిగింజలు లేక రైతులు అలమటిస్తుంటే... వారికి అన్నిటా వెన్నుదన్నుగా నిలిచే ఆలమందలకు ఎండుగడ్డి కూడా విదల్చలేని దుస్థితి నెలకొంది. మేత పెట్టలేక వాటిని కట్టేసి చంపటం కంటే కబేళాలకు తోలి, ఆ వచ్చిన డబ్బుతో కాలం వెళ్లదీయాలనే బడుగు రైతులు కొందరైతే, పంటలు లేక, చేతిలో పనులు లేక పూటగడవని పేద రైతులు వలస పోయారు. ఆలమందలు ఆకలితో నకనకలాడాయి. ఈ విషమ పరిస్థితిలో పేదరైతుల వ్యవసాయానికి ఆధారపడే గొడ్డూ గోదాకు సర్కారు ఎండు గడ్డి అందించే పథకం అమలు పరచింది. అయితే ఆ మూగజీవులకు అందవలసిన ఆ సర్కారు గడ్డి అందకుండా, మధ్యలో గడ్డి మేసే సర్పంచులు, వారి తాబేదార్లు ఆడే నాటకాలు, వేసే ఎత్తులు ఈ నవలలో చిత్రితం. ఇందులో ముఖ్య పాత్రధారి 'రాముడు' ఒక వృద్ధ దళిత రైతు. అందరికీ ఇష్టుడు. కలుపుగోలుతనం, నిజాయతీ, స్నేహభావంతో అందరికీ ఆదర్శప్రాయుడు. నాలుగేళ్ల కరవు అతణ్ణి, అతని కుటుంబాన్ని ఛిద్రం చేసింది. ప్రాణం కంటే మిన్నగా ప్రేమించే ముసలి ఎద్దును తన తమ్ముడు 'లక్ష్మణు'డని అంటాడు. జీవితాంతం తన కుటుంబానికి అండగా నిలిచి, వృద్ధాప్యంలో కాటికి కాళ్ళు జాపిన తమ్ముణ్ణి, ఆకలితో అలమటిస్తూ కన్నీళ్ళు కారుస్తూ మూగవేదనతో చూసి, ఈ లోకంలోని బ్రతుకు పోరాటాన్ని జంటగా ముగిస్తారు. వారి అంతిమ యాత్ర ఘనంగా సాగటం విషాదానికి పరాకాష్ఠ.

పల్లెజీవితాన్ని హృద్యంగా, గడ్డితినే మనుషులు నడిపే రాజకీయాలను 'మైక్రోస్కోపిక్'గా చిత్రించిన రచయిత అభినందనీయులు.

**- ఎం.డి. సౌజన్య, తెనాలి**

## ఇది గ(డ్డి)డ్డు సమస్య! రూ. 75/- పొందిన సమీక్ష

మనిషి మనుగడకు తిండిగింజలు ఎలాంటివో, పశువులకు గ్రాసం అలాంటిది. నోరు, తెలివితేటలు ఉన్న మనిషి తన తిండి తానే సంపాదించుకోగలడు. కానీ మనిషి అధీనంలో బ్రతికే నోరులేని పశువులకు ఆ ఏర్పాటు మనిషే చేయాలి. కరవు కాటకాలలో తిండిగింజలతోపాటు పశుగ్రాసం కూడా కరవై ఎన్నో పశువులు ప్రాణాలు కోల్పోవడం తెలిసిన విషయమే. లభ్యమైన కాస్త గడ్డీ డబ్బున్న మోతుబరి రైతులు కాజేస్తే, సన్నకారు, పేద రైతుల పశువులకు మేత మృగ్యం అవుతుంది. అందువల్ల పేద

రైతుల పశువులకు గడ్డి సప్లయ్ చేయవల సిన అవసరం, బాధ్యత ప్రభుత్వంపైన ఉన్నాయి. దానికి సంబంధించినదే 'సర్కారు గడ్డి'.

సర్కారు గడ్డి నేపథ్యంలో రావుడి కుటుంబం, రావుడు లచ్చువుల అనుబంధం, గ్రామం-దళితవాడల మధ్య గల సంబం ధాలు, రాజకీయాలు ఇందులో చర్చించబ డ్డాయి. సర్కారు గడ్డి పంపిణీ కంటే ఆ గడ్డిని చేర్చే హమాలీలు, మేస్త్రీలు, అనంతపురం వివరాలే ఎక్కువ కనిపి స్తాయి. ప్రతి అంశాన్ని అత్యంత విపులంగా వివరించిన రచయితలోని 'మాస్టారు' తొంగి చూస్తారు. అతి సామాన్య జీవితాలను గూర్చి చక్కగా తెలుసుకునే అవకాశం లభి స్తుంది. గడ్డి సమస్య గడ్డు సమస్య కాగా, తమ పశువుల మేత కోసం బక్క రైతులు పడే అవస్థలు, ఆందోళనలు వివరించినా- సర్కారు గడ్డి పంపిణీలో లోటుపాట్లు, అవ స్థలు, రాజకీయాల కోసం ఎదురుచూసిన పాఠకుడికి కొంత నిరుత్సాహం తప్పదు.

రావుడు లచ్చుమనుల అనుబంధాన్ని వివ రించిన తీరు మనసులకు హత్తుకుంటుంది. మనిషి-జంతువుల అనుబంధాలకు అద్దం పడుతుంది.

ముఠామేస్త్రి వ్యక్తిగత ఉదంతం, లచ్చు మక్క-యంగటేసుల వ్యవహారం కథ నిడివి పెంచడానికి తప్ప కథకు అవసరం లేనివి, అతకనివి. ఇందులో కథ తక్కువ, కథనం ఎక్కువాను! ఇతివృత్తం మంచిదే అయినా, దానికి తగు న్యాయం చేకూరలేదనిపిస్తుంది. పశు సంపద అతి ముఖ్యమైనది. వాటి మేత విషయంలో ఎలాంటి అలక్ష్యమూ కూడదు. ముఖ్యంగా క్షామకాలంలో ఈ గడ్డు సమస్యను నేర్పుతో, శ్రద్ధతో పరిష్క రించవలసిన బాధ్యత ప్రభుత్వంపైన వుంది. చక్కటి శిల్పంతో సాగి, ఆసక్తిగా చదివిస్తుంది నవల.

– వి.వి.ఎస్.పామర్తి, సికింద్రాబాద్

## సజీవ సాక్ష్యం రూ. 50/– పొందిన లేఖ

**అ**నాదిగా మనిషికి పశువుకి మధ్యనున్న అనుబంధం, విడదీయరానిది. వారి మధ్య పెనవేసుకున్న మమతానురాగాలను రమ్యంగా అక్షరీకరించిన నవల ఇది.

రాయలసీమ వాతావరణంలో ఆద్యంతం అద్భుతమైన కథాగమనంతో సాగిన నవలలో వాడిన పదాలు, మాటలు సగటు పాఠకుడిని అలరిస్తాయి. ఇతివృత్తంలో రావుడు అనే రైతుకు ముగ్గురు కొడుకులు పెద్దోబులేసు, నడిపోబులేసు, సన్నోబులేసు వ్యవసాయాన్ని నమ్ముకుని జీవించే సగటు మనుషులు. రావుడు తన ప్రియమైన పశువును లచ్చువుడు అని పిలుచుకోవడం, పెంపుడుకుక్కను బూసీ అని పిలవడం అత డికి మూగజీవుల పట్ల వున్న అనురాగాన్ని, కారుణ్యాన్ని తెలియజేస్తుంది. ప్రభుత్వం లారీల్లో సరఫరా చేసే గడ్డిని మధ్యలో దళా రీలు, హమాలీల సాయంతో స్వాహా చేసి సొమ్ము చేసుకోవడం శోచనీయం. కరవు కాటకాలు సంభవించినప్పుడు పల్లెల్లో ఎడ్లు, ఆవులు, ఎనంగొడ్లు, బర్రెలు, గొర్రెలు గడ్డి కరవై, నీరు కరవై, బతుకు బరువై కబేళాలకు తరలే దురదృష్ట సంఘటనలు కలతపెడ తాయి. రావుడి తమ్ముడు లచ్చువుడు నిద్ర పోయినట్లుగా పరమపదించటం, నోరులేని మూగజీవాలు సైతం కన్నీరు కార్చటం హృదయవిదారకం. ఇనాక్ అద్భుతమైన రచనా సృష్టికి 'సర్కారు గడ్డి' సజీవసాక్ష్యం.

– ముక్కెర రమేశ్‌చంద్ర, గుర్రంపేట.

## హాస్యం కాదు... హాస్యాస్పదం రూ. 50/- పొందిన సమీక్ష

రాయలసీమ మాండలికంతో సీమ గ్రామీణ జీవితాన్ని అద్భుతంగా చిత్రీకరించారు రచయిత. రైతులకు, పశువులకూ మధ్య ఉండే ఆత్మీయతానురాగాల్ని హృదయాల్ని కదిలించే తీరులో ప్రదర్శించారు. ఆయనది ప్రత్యేక శైలి. అయితే కొన్ని సందర్భాల్లో చెప్పిందే మళ్లీ మళ్లీ చెబుతున్నందుకు విసుగేస్తుంది కూడా! ఎండుగడ్డి కోసం గడ్డి తినే స్వార్థపరుల వైఖరిని ఎండగట్టడం కథావస్తువు అయినా అనేక పాత్రలు, సన్నివేశాలూ అనవసరంగా ప్రవేశించి విసిగిస్తాయి. కథను మరింత సూటిగా, హృద్యంగా, సగం నిడివిలోనే మలచవచ్చు. ఆబోతు, ఆవు, దాని పేడ కోసం తట్ట పట్టుకొని ఆవు వెనకే తిరిగే మూర్తి- ఆ వర్ణనలు పూర్తిగా అనవసరం. మేధావివర్గానికి చెందిన కొందరు ఒక వర్గాన్ని ఎద్దేవా చేసే మైండ్ సెట్‌ని సూచిస్తుంది ఆ వర్ణన. అనంతపురం ఆబోతు రామారావు పోస్టర్లనే తింటూ ఇతర పోస్టర్ల జోలికి పోదట. రచయిత దీన్ని హాస్యంగా భావించారేమో కాని హాస్యాస్పదంగా ఉంది! మురామేస్త్రి గాథ, లచ్చువక్క, యంగటేసుల కథ, పాల నాగమ్మ కథ- ఇవన్నీ పేజీలు నింపడానికే పనికొచ్చాయి. నవల చదివాక బాగానే ఉందనిపించినా గొప్ప నవల చదివిన అనుభూతి మాత్రం కలగదు.

– శుభ, కాకినాడ

## అవినాభావ సంబంధం రూ. 50/- పొందిన సమీక్ష

ఇతివృత్త వస్తువు సాధారణమైనదే. ఇది పెద్ద పెద్ద స్కాములకే దారితీసినా ఇనాక్ గారు దీన్ని వ్యక్తపరచడంలోనే ఉంది ప్రత్యేకత. కరవుతో మనుషులు, రైతులే కాలుతారన్నది చాలామంది భావన. జంతువులు ముఖ్యంగా పొలాలు దున్నే ఎడ్లు, పోతులు, పాలిచ్చే ఆవులు, గేదెల సంగతి ఎవరికీ పట్టదు మరి. భూగర్భజలం ఇంకిపోయి, బోర్లలో నీళ్లు రాక పంటే కాదు, గడ్డి పరకైనా మొలవకపోతే ఏం జరుగుతుంది? అలాంటి పరిస్థితుల్లో 'సర్కారేం' చేయగలదు? గడ్డి రైలు వస్తే ఏం జరుగుతుంది. సరఫరా ఎలా? అప్పుడు ప్రజలు, రైతులు, సర్పంచులు, సభ్యులు, 'సర్కారీ'లు, చివరకు జంతువులు కూడా ఎలా ప్రవర్తిస్తాయి? వీటన్నింటినీ కళ్లారా చూసే కంటే, నవల చదివితేనే నూరు రెట్లు చూసినంత స్ఫూర్తిని పాఠకులకందించారు. పాఠకులను విచలితులను చేసేది రామలచ్చువుల చరమాంకం. కన్నీరు పెట్టిస్తుంది. ఇంతటి అవినాభావ సంబంధం ఉంటుందా అన్న ఆశ్చర్యం కలగక మానదు.

- వి.లలితాంబ, పర్లాకిమిడి (ఒరిస్సా)

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2006-2008 RN1/32186/78